# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౮. సంచిక ౩.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩


విషయసూచిక

---

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—విశ్రాంతి; సోదె.

సాధారణ చిత్రములు:—అక్షయవటము - గయ; పురాణకేలా - ఉరఫు హస్తినాపురము - ఢిల్లి; 'సూర్య' 'బాణతీర్థ' జలపాతము; అమెరికాపిల్ల శాండో; సముద్రపు ఉడుము; సెంటుమారిసులో పేరుడు మంచుపయి జారుచు ఆడు టెన్నిసు ఆట; మోట; పిడివాటు; నూర్పుడు; పూలబేరము; శ్రీ లక్ష్మీనృసింహస్వామి ఆలయ మహాద్వారము, కదిరి; దోసెపోత; రెక్కలు లేని విమానము; పాపనాశన జలపాత చిత్రములు ౪; జలపాతము (కొండలోయలో); తిరువణ్ణామలై పుష్కరిణి; గడగంతు - మదరాసు; చంద్రగిరి త్రోవలోని కొలను; శ్రీ వేంకటేశ్వరాలయము; స్వామి పుష్కరిణియందలి మంటపము; గరుడసేవ; మేరియన్ మార్షు సుందరి; 'నిర్మల' కన్య; ప్రతిబింబము; వ్యంగ్యచిత్రము ౧; చెలిమి కలిమి; దాహము; తిరువమ్మియూరు శిథిలము; ఇతరచిత్రములును.

---




చెన్నపట్టణము, మార్చి ౧౯౩౩

సంపుటము ౧౦ ఆంగీరస సంవత్సరము, ఫాల్గునమాసము సంఖ్య 3.


# ఆంధ్రగీతి


కొల్లూరు ధర్మారాయకవిగారు, బి. ఏ.
(ఆంధ్రగీర్వాణ సాహిత్యపరిషత్తు)


రాజవేదిచెంత ప్రణమిల్లెను నా తొలినోము పంట; ని
స్తేజము లీసుమంబు లరచేతి కవుంగిట మోడ్చి, యే రహః
పూజ యొనర్చెనో, నిదుర ముద్దిడనేరని వాలుఁగన్నులన్
నాజవరాలు :—వేదికెలనన్ నిదురింపవు నా తమస్స్మృతుల్.

ఊరట లేని వే నిడుదయూర్పులతో నినదించు నా నిరా
శారుణజీవగీతి బయలంతటఁ బ్రాఁకిన దేమొ; యీ హిమా
నీరజనీ విహాయసము నీకొఱకై విలపించు మంచు క
న్నీరుసఁ దోఁచు నాయెడఁద నించిన శీతల మృత్యుబింబముల్.

ఈ తెలిమల్లెతీవ పులకింపదు ప్రేమసుధాశ్రువేని నా
చేతమునందు; కారుమసిచేలముఁ దాల్చి స్వనించు నా నిశా
గీతిక మారుమ్రోఁత పలికింపకయే వినువీధి నేగ నా
శాతతిఁ జూతు నీయునికిజాడకునై తెలిమబ్బు తున్కలన్.

ప్రేమసుధాంబువుల్ చిలుకరించిన నా తొలుసంజ మబ్బు కన్
బ్రామిన యీ నిశీథి నెటు ప్రోఁకినదో వివరింప నొక్క స
ద్యోమృత విద్యుదంకమును దోఁచక నిల్చితి నిట్టు లీ తమ
స్సీమఁ జిరంతనప్రణయశిల్పి మలంచిన ఆ యెడందకై.

తలిరు ఎడందలోని కలఁతన్ కనుగొల్కులవెంట నా కరాం
గుళులకు డించి నాదు నిసికోయిల మిన్నులలో నశించె! నేఁ
డలసగతిన్ విపంచిపయి నంగుళి సైచినయంత తీవియల్
పులకిత గాత్రలై గళములోనె నడంచును గద్గదాశ్రువుల్.

జాలి యెఱుంగ కీజగతి సాగును భగ్నమనోనుభూతి ముం
గాలను దన్ని!—యీ తెరువు గానని తెప్పను వీడి కాలశై
వాలము దాఁటి తీరమున వ్రాలిన నాఁ డిటుచూచి నవ్వుటా
లాడెద, ప్రేమభాగ్య హృదయాంగణ కోమలతల్పశాయినై.

---

# బమ్మెర పోతన

దే. వేం. సత్యనారాయణమూర్తిగారు

"మ య్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః." —భగవద్గీత.

A great book is born of the brain and heart of its Author. —Hudson.

ఓంకారస్వరూపుడగు నాపరమాత్ముని లీలల నేవిధముననైన వర్ణింపజాలిన కవికీర్తియే చిరస్థాయిని. అట్టికవియే మహాప్రతిభా సంపన్నుండయి యుండును. ఆతని హృదయమును మనశ్శక్తియు నాతనిగ్రంథమున తప్పక ప్రతిబింబితములగును.

"We cannot demand from every man (poet) that he have unusual depth of insight or exceptional experience; but demand of him that he give us of his best and his best cannot be another's".— George Henry Lewes.

ఇటులు భావముల స్పష్టముగా వ్యక్తీకరింపజాలువారలే ప్రతిభాసంపన్నులు. వీరలే యుగకర్తలు. వీరిగ్రంథముల స్వతంత్రత యొక ప్రధానాంశమై యుండును. స్వతంత్రత కావ్యమున కొక నూతనజీవము నాపాదించును.

ఇది లేని గ్రంథము మృత కళేబరము మాడ్కి కళావిహీనమై యుండును. కావ్యము సజీవమైయున్నదన్న వాక్యమునకు, కావ్యమునందు, కవియొక్క స్వతంత్రత ప్రతిఫలించుచున్నదనుటయే పరమార్థము.

'The throng and succession of ideas, thoughts, feelings, imaginations .... his views of external things, his judgments upon life .... the exercises of his depth of his sagacity, all these innumerable, and incessant creations, the very production and throbbing of his intellect does he image forth ........ in a corresponding language............' (Newman.)

మఱియు నొకమహామహుని కావ్యమునందు, కర్తయొక్క అంతశ్శుద్ధి ప్రకటీకృతమగుచుండును. కవి యంతశ్శుద్ధి గలవాడైననే యాతని గ్రంథము చిరస్థాయి యగును. కవి యొకటి తలంచుచు, వేఱొక్కవస్తువు నుద్బోధించిన, నాగ్రంథ మచిరకాలముననే పతనోన్ముఖ మగును. 'కవి' యను నామమున కర్హులగువారి గ్రంథములలో వారి యంతశ్శుద్ధి యనుగుణమును పొడసూపుచుండును కావుననే, 'without sincerity no vital work in literature is possible' అని Hudson పండితుండును, 'that virtue of originality that we strive after is not newness...........it is only genuineness!' అని Ruskin పండితుడును నుడివిరి.

ఇంతియకాక, ఉత్తమగ్రంథమునం దవశ్యముగా ధర్మ మేదో యొకవిధమున

నుద్బోధింపబడియుండవలయును. బ్రహ్మవాది యైన గురుప్రదేశముద్రం బట్టి, యేశ్రుతివాక్యముల బల్కుచుండునో, తదర్థ మేవిధమున నైనగాని గ్రంథమునం దాపాదింపఁబడి యుండవలయును. మోక్షమార్గము నెఱుకపరచు నీ తత్త్వబోధ మావశ్యకము గావుననే,

'No poem ever makes me respect its author, which does not in some way convey a truth of philosophy' అని Lowell పండితుడును, 'A good book is the precious life-blood of a master spirit enbalmed and treasured up on purpose to a life beyond life' అని Milton మహాశయుడును నుడివిరి.

ఇట్టిగుణముల నన్నింటిని గల్గియున్న గ్రంథమే యుత్తమగ్రంథము. ఇది శాశ్వతముగా నుండుటయేకాక వాఙ్మయమున నగ్రస్థానము నలంకరించును. ఈదృశగ్రంథకర్తయే మహాప్రతిభాశాలియును 'కవి' యను నామార్హుండును. ఇట్టివారు దేశమున వెలయుట దుర్ఘటము. వీరలే దేశోద్ధారకులును, మార్గదర్శకులును.

'A poet's greatness must ultimately depend upon the greatness of his subject-matter, the power of thought which he brings to bear upon it, and his moral strength and influence' అని Hudson అనునతడు చెప్పినట్లుగ, కవియొక్క ఆత్మీయతయు, అంతశ్శుద్ధియు, కథావస్తువును, కావ్యము నున్నతస్థితిని బ్రాపింపజేయును. అంధమున నిట్టి గుణసంపన్నమగు కావ్యములలో భాగవత మొకటి. ఆంధ్రభాగవత కర్తయగు పోతన యంతశ్శుద్ధియు, నిష్కల్మషభక్తియు, గ్రంథస్థమైన విషయగాంభీర్యమును నీగ్రంథమున కాంధ్ర వాఙ్మయమున నున్నతస్థాన మొసంగినవి.

సంస్కృత భాగవతము వైష్ణవధర్మపరమని నానుడి. పోతనకుమాత్రము శివ కేశవు లిరువురును సమానులే. విష్ణువుమాత్రమే సర్వాంతర్యామియనిగాని, విష్ణువే పరమాత్మ యనిగాని, విష్ణునికన్న శివు డధముడనిగాని, పోతన యభిమత మెంతమాత్రమును గాదు. హరిహరు లిరువురును పోతన దృక్పథమున సమానులే యని యనుట క్రిందిది నిదర్శన మొక్కటియే చాలును. కృతిపతినిర్ణయము జేయుచు :-

" చేతులారంగ శివునిఁ బూజింపఁడేని,
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని,
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని,
కలుగ నేటికిఁ దల్లులకడుపుఁ జేటు "

అని శివకేశవుల కిరువురకు నభేదవృత్తిని గల్పించెను. శివుని బూజింపుచు హరికీర్తి నుడువవలయునట! ఇంత పరిపక్వ మనస్కుడు తిక్కనగాక వేఱొక్కడు గలడే! పోతన యిట్టియోగి గనుకనే రామకృష్ణులకుగూడ నేకవృత్తి నాపాదించెను. శ్రీరామనామాంకితముగా భాగవతము దెనుంగుజేయ నిశ్చయించుకొని, " నేను నాచిత్తంబున రామ

చంద్రుని సన్నిధానంబుఁ గల్పించుకొని" అని వ్రాసి, వెంటనే షష్ఠ్యంతముల కుపక్రమించి,

"హరికి నందగోకులవి
హరికిఁ జక్రసమీరదైత్యసం
హరికి,..........
....................."

అని నాల్గుపద్యముల జెప్పి, యందు శ్రీకృష్ణుని ప్రతిపాదించెను. శ్రీరాముని కంకితముగా వ్రాయ నిశ్చయించి, శ్రీకృష్ణునకు సమర్పించుటలో, పోతనకు పరమాత్మ విషయమై కల భావము తేటపడగలదు. ఇతని దృష్టిలో పరదైవ మొక్కండే. ఇది గజేంద్ర మోక్షఘట్టమున విస్పష్టముగా గానవగును. "ఊహకలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్, మహా-మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక, సం-దేహముఁ బొందు దేహిక్రియ" నున్న యా కరిరాజస్తవమంతయు పరమాత్మపరముగా నున్నదేగాని, యే సాకారుడగు శివునో, కేశవునో నిర్దేశింపదు.

పరమేశ్వరుడును, అనాదిమధ్యలయుండును, ఆత్మభవుండును, 'లోకంబులు, లోకేశులు-లోకస్థులుఁ దెగిన తుదిన లోకంబగు పెం-జీఁకటికవ్వల...నేకాకృతి వెలుఁగు'నట్టి పరమాత్మునే పోతన ధ్యానించెను. ఈశ్వరుడు 'నర్తకునిభంగి పెక్కగు-మూర్తులతో' నాడజాలువాడు గనుకను, 'అఖిలరూపముల్ దనరూపమైనవాఁడు' గనుకను, శివకేశవుల కెట్టి భేదమును లేదనుట పోతన కభిమతము.

ఇట్టులయ్యును, దక్షయాగ సందర్భమున పోతన శివదూషణ జేసెనని కొందఱ అభిప్రాయపడుట నిక్కువముగా విచారకరమే. ఏలయన మహాకవి పాత్రోచితముగ సంభాషణ నెఱపునేగాని యిచ్చవచ్చినరీతిని సంభాషింపజేయడు. ఇప్పట్టున క్వాచిత్కముగా శివదూషణ యున్నను, నది శివద్వేషియగు దక్షునిచే ననిపించెనేకాని వేఱొకనిచే ననిపించలేదు. శివద్వేషియగు దక్షుడు శివుని నిందించిన, నం దేమివింత గలదు? అటుల జేయకున్న కథౌచితి విధ్వంసమగును. ఇంత మాత్రముననే పోతన శివద్వేషి యనినపక్షమున, హిరణ్యకశిపుచే విష్ణుని నిందింపజేసిన యీతడు విష్ణుద్వేషి యనికూడ ననవలసి వచ్చును. రాజసూయయాగ సభాభవనంబున శిశుపాలునిచే శ్రీకృష్ణుని నిందింపజేసిన తిక్కన శ్రీకృష్ణద్వేషియని యనవలసివచ్చును. ఇంతకును దక్షయాగసందర్భముననే, పోతన హృదయము వ్యక్తము కాకపోలేదు. దక్షుని శివదూషణానంతరము, సతీదేవిముఖమున పోతన యిట్లుగా వ్రాసెను:

"పరఁగఁ జితాగ్నిభస్మనృక
పాలజటాధరుఁడుం బరేతభూ
చరుఁడు పిశాచయుక్తుఁ డని
శర్వు నమంగళుఁగాఁ దలంప రె
వ్వరు నొకఁ డీవుదక్క మఱి
వాక్పతిముఖ్యులు నమ్మహాత్ము న
చ్చరణ సరోజరేణువులు
సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్."

మఱియు,

"వెలకొని ధర్మపాలన వి
నిర్మలు భర్గుఁ దిరస్కరించు న
క్కలుషుని జిహ్వఁ గోయఁదగుఁ
గా కటుసేయఁగ నోపఁడేని దాఁ
బొలియుట యొప్పు రెంటికిఁ బ్ర
భుత్వము సాలమిఁ గర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁ
బాడి యటందురు ధర్మవర్తనుల్."

ఈ రెండుపద్యములయందును పోతనకు శివునిపై గల భక్తివిశ్వాసములు సువ్యక్తములైనవి. "చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, ......కలుగనేటికి తల్లుల కడుపుచేటు" అని యనునంతటి శివపూజా తత్పరుడు శివుని దూషించెననుట, పోతనహృదయము నెఱుంగ రామిని దెల్పును.

ఈమహాయోగి భక్తిమార్గమే ముక్తిమార్గమని నమ్మియుండెను. పోతనవంటి మహాకవి, యట్టిభక్తుఁడు, మరల బుట్టు టరిది. నిజమగు కవి తనస్వభావానుగుణమగు విషయమునే వర్ణింపబూనుకొనును. అనగా, కవి స్వభావమునకు సరిపోవు విషయమునే కవి వ్రాయ నుద్యుక్తుడగును. కవి వ్రాసిన కావ్యమునుబట్టియే వాని స్వభావాదుల మనము గ్రహింపగలము. రాజ్యతత్త్వవేత్త గనుకనే, తిక్కన భారతమును దెనిగించెను. వీరశైవుడు గనుకనే పాల్కురికి సోమనాథుడు బసవ పురాణము వ్రాసెను. అటులనే, పోతన పరమభాగవతశిఖామణి యగుటంజేసియే, భాగవతమును దెనిగించెను. ఈతడు భాగవతము వ్రాయుటకు వేఱొక్క కారణముగూడ గలదు.

"హరినామస్తుతి సేయుకావ్యము సువ
ర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సర
స్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచి
త్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవ
త్కాకోలగర్తాకృతిన్."

వెండియు:—

"అపశబ్దంబులఁ గూడియున్ హరిచరి
త్రాలాపముల్ సర్వ పా
ప పరిత్యాగము సేయుఁ గావున హరిం
భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు న
శ్రాంతంబుఁ గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యు లౌదురుగదా
తత్త్వజ్ఞ చింతింపుమా!"

అని నారదుడు పరాశరాత్మజునితో జెప్పినట్లుగ, తనభావమునే పోతన వ్యక్తపరచెను. ఇట్టి స్వభావముగలవాఁ డగుటచేతనే భాగవతమువంటి యుత్తమ గ్రంథమును వ్రాయ నుద్యుక్తుడయ్యెను. "It has been often said that a man of genius sometimes is such in virtueof combining the temperament distinc ive of his nation with some gift of his own"—అనగా, ప్రతిభా

శాలియగు నాతడు, స్వజాతిస్వభావముతో, స్వీయస్వభావమునుగూడ నొకప్పుడు సమన్వ యించుచుండును—అని 'Jebb' అను విమ ర్శకు డనినట్లుగ పోతనభక్తి, గ్రంథమునుండి యవిభాజ్యమగు నొక మహాశక్తియై,యనుక్షణ మును మనమనముల చకితము గావించు చుండును.

ఈ భాగవతశిఖామణికి పరమాత్మునిపై భక్తితోపాటు, పరమాత్ముని మాయయందు గూడ నత్యధికవిశ్వాసము గలదు. గ్రంథము నందు అచ్చటచ్చట నీ మాయావిషయమై ప్రత్యేకముగ కవిచెప్పినట్లు, పరికించి చూచిన సువ్యక్తమగును. ఈజగమంతయు నీమాయచే నిలిచియున్నదని యీతని నిక్కంపు దలంపు. భక్తిపారవశ్యమున కుంతీదేవి శ్రీ కృష్ణుని పరదైవముగా నెంచి, సకలవిధముల నుతి యించుచుండగా, నద్దానిం గ్రహించి, "గోవిం దుండు మాయానిరూఢ మందహాస విశేషం బున మోదంబు నొందించి రథారూఢుండై, కరినగరి కరిగె" నని వ్రాసెను. కుంతీదేవి మానసికపరిస్థితిని మార్చివేయుటకై శ్రీకృ ష్ణుడు మాయచే నామెను మోహితజేసెను!

ఇటులనే క్రీడామనుజబాలకుండైన యీ శ్వరుని ముఖమునందు, "జలధిపర్వతవనభూ గోళ శిఖితరణి, శశివిక్పాలాది కరండంబైన బ్రహ్మాండంబునుం గాంచి, దిగ్భ్రమం జెంది, యాబాలుని పరమేశ్వరుంగాఁ దలంచుచున్న యశోదయం దా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన ;

జడనుపడి యెఱుక సెడి యా పడఁతుక సర్వాత్ముఁడనుచుఁ బలుకక యత గొడుకని తొడపై నిడుకొని [నిం కడువేడుకతోడ మమత గావించె..."

ఇటులనే యనేకస్థానంబులయందు పర మేశ్వరుండు మాయచే జగంబుల నేలుచుండె నని పోతన వ్యక్తపఱచెను. శ్రీకృష్ణునిశక్తిని బరిశీలించుటకై గోవత్సములను, గోపబాలకు లను బ్రహ్మ యంతర్ధానము నొందించిన, శ్రీ కృష్ణుండు మాయాగోవత్సగోపబాలకుల సృజి యింపం గాంచి, ససంభ్రమంబుగ శౌరికి మ్రొక్కి— బ్రహ్మ స్తుతియించుచు :

"మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ..." అని యనెను. మాయనే మాయాన్వితగా జేయజాలువాడు పరమేశ్వ రుడని పోతన యభిమతము.

ఇంక, గోపికావస్త్రాపహరణసందర్భమున పోతన మూలానుసారముగా వ్రాయక కొన్ని కొన్ని యనుచితవర్ణనలను 'సంబోధనము లను' జేసెనని కొంద అభిప్రాయపడుదురు. ఐనను, ఈఘట్టము వేదాంతము నుద్బోధించు చున్నదనువిషయము నిర్వివాదమును, సర్వ మతసమ్మతమును. గోపికలు యోగులా? లేక "హరి పూజార్థము పుట్టుడు - సురకన్యలు భూమియందు సుందరతనులై" యని భాగవ తమునసే యున్నయట్టులు సురకన్యలా యను వాదమును, వస్త్రము లజ్జానావరణములా

యనువిషయమును, శ్రీకృష్ణునిప్రాయ మా కాలమున కెంత యనుచర్చ యటుండనిచ్చి నను, గోపికలకు శ్రీకృష్ణుడు తత్త్వబోధ చేసెననియు, మమకారమును త్యజించునటుల నొనర్చెననియు విస్పష్టము. గోపికలకు నైజ దేహములపై గల యభిమానమును విచ్ఛేదము గావించి, యహంభావమును నిర్మూలము చేసి, మమకారము విధ్వంసము గావించుటకు పన్నినపన్నాగమే కాని వేఱొండు కాదు.

"వచ్చెదము నీవు పిలిచిన
నిచ్చెద మేమైనఁగాని యెటుఁ జోరుమనినం
జొచ్చెదము నేఁడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుముకృష్ణా!"

అని శరీరాభిమానముల నింకను త్యజింపక ప్రార్థించుచున్నవారిని, శ్రీ కృష్ణుడు నిర్దేశించి 'మీయంబరంబు లిచ్చెదఁ - దోయంబులు వెడలి రండు' అని యనియె. 'ఎట్టకేలకు చిత్తంబులఁ గట్టిపఱచుకొని కరసంఛాదితపంచాయుధగేహలగుచు, ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని, మందగమనలు తోయంబుల వెడలిన', భగవంతుం డంతటితో జాలింపక, 'ఇంతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి-చేరి పుచ్చుకొనుఁడు చీరలు సిగ్గు వో-నాడ కేల' యని వారల మందలించెను. మానినుల కింతకన్న నెక్కుడు పరిహాసమయముగలదా? విగతవస్త్రలై పురుషుని చెంగట నుండుట కియ్యకొనని మానవతులు దిగంబరలై తోయముల వెడలివచ్చి చివరకు చేతుల నెత్తి మ్రొక్కిరి. ఇప్పుడుగదా తనువులపై నభిమానము సంపూర్ణముగా బోయినది!

" The naked soul must follow the naked 'Jesus' " అనగా 'దిగంబరుడగు జీవుడు, దిగంబరుడగు ఏసును జెందవలయు' నని యొక క్రైస్తవ వేదాంతి చెప్పినట్టుగ సర్వాంతర్యామియగు భగవంతుని ముంగట, దిగంబరులుగ నుంటకు సిగ్గేల? భగవానుడు సర్వాంతర్యామి యని తెలిసికొనినపిమ్మట నీ సిగ్గునకు తా విసుమంతయు లేదు. అభిమానమున కవకాశ మావంతయు లేదు. కావుననే కృష్ణుడు గోపికలతో:

"శృంగారవతులార సిగ్గేల మిముఁగూడి
పిన్ననాఁటనుగోలెఁ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాఁడ
నేను జూడనిమర్మ మెద్ది గలదు?"

అని మమకారకారణమగు సిగ్గును విడనాడు డనియె. అపుడు గోపికలు: "ఫాలతటన్యస్త కరాబ్జలై మ్రొక్కిరి". అప్పటికిగాని మమకారము సంపూర్ణముగా విసర్జింపబడలేదు. సిగ్గు సంపూర్ణముగా దూరీకృత మయ్యెను. స్వాభిమానము కూకటితోగూడ నిర్మూలింపబడెను. అపుడుగదా, "యంబరములు గృపాలుఁడు హరి యిచ్చె, భక్తపాలకుఁ డగుటన్!"

ఇట్టి మహాయోగమును బోధింప నిచ్చితుడై శ్రీకృష్ణుం డటుల నొనర్చెనేకాని తుచ్ఛకామియైకాని, జారుడైకాని, యటుల

వస్త్రముల నపహరింప లేదనుట యథార్థము. తనయభిమతమును శ్రీకృష్ణుడే వ్యక్తపరచి యుండగా నింతయేల? గోపకాంతల చెంతకు నుద్ధవుని బంపుచు, శ్రీకృష్ణుడు:

"లౌకిక మొల్లక నన్నా
లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును
నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్"

అని యనెను. గోపకాంతల 'లౌకికమునుండి' విముఖులఁ గావించుటకును, 'ప్రపన్నల' నొనర్చుటకును, చేసినయుపాయమేగాని వేఱుగాదు. భక్తాగ్రేసరుడగుపోతనచే పరమాత్ముడుగా భాగవతమున నిరూపింపబడిన శ్రీకృష్ణున కట్టి హేయభావముల నాపాదించుట కేవలము భ్రమ. ఈదురూహ ప్రథమమున పరమతస్థులకును, తదనుకరణమే పరమావధిగాగల స్వమతస్థులకును గూడ గల్గినది. కాని, యిది బలాత్కల్పితమయ్యును పొందకున్నది.

మఱియు, భక్తి యనునొక మహాశక్తి యాదినుండి యంతమువఱకును నీగ్రంథమును ప్రభాభాసితము జేయుచున్నది. కవి యెపుడును గ్రంథమునందలి యొకయుత్తమపాత్రతో నైక్యముపొందుచుండును. స్వాభిప్రాయముల నెల్ల నా పాత్రచే ననిపించుచుండును. కవిస్వభావమంతయు నాపాత్రయందు ప్రతిబింబితమగును, 'The personality of the poet reflects in one of his characters' (Ruskin) అనగా, కవియొక్క ఆత్మీయత లేక అంతరంగికస్వభావము, కవికృతగ్రంథమందలి పాత్రలలో ద్యోతకమగుచుండును. కవిస్వభావమున కనుగుణమగుస్వభావముగల పాత్రతో కవి యేకీభవించును. మహాభారతమున ధర్మరాజుతో నన్నయ యభేదవృత్తి బొందెను. తిక్కన, శ్రీకృష్ణునితో నైక్యముబొందెను. అనగా, తిక్కనస్వభావము శ్రీ కృష్ణునియందెక్కువగా దెలియ నగును. కృష్ణపాత్రను పోషింపుచు, తిక్కన, స్వాభిప్రాయములను, నిజ స్వభావమును, కృష్ణున కాపాదించును. ఇతనిస్వభావమునకు శ్రీకృష్ణపాత్రపోషణమన ఉల్లాసకర మగునది. కనుకనే, శ్రీ కృష్ణుని తిక్కన యనన్యసామాన్యముగా చిత్రించెను. అటులనే, పోతన భక్తుడగుటంజేసి భాగవతమునందలి భక్తులతో నేకీభవించును. శ్రీకృష్ణభక్తుల చిత్రించునప్పుడును, పరమేశ్వరుని సంస్తుతించునపుడును, పరంధామునిలీలల గానము సేయునపుడును, పోతనకుగల యుత్సాహము, మహత్త్వము, కవిత్వపటుత్వమును, రసానంద దాయియగు శైలియు నింకొకరికి దుర్లభములు.

భక్తివిషయము వ్రాయునపు డెల్లను, పోతన తన్మయుడై వాణీప్రసాద లబ్ధకవిత్వముతో పద్యము నిట్టె వ్రాసివేయును. అపుడాయనదృక్పథమున, నాదివ్యమూర్తి తాండవమాడుచున్నట్లుగ వర్ణించి, మన మనోనయనములకు గోచరమగునట్లు చిత్రించును. శ్రీకృష్ణునిం గానక, వెదకికొనుచు కృష్ణు జేగిన దిక్కు మొగంబై చనిచని, భూతలంబున

మనోహరంబులగు హరిచరణంబుల చొప్పు గని గోపకాంతలు:

"ఈచరణంబులే యిందునిభానన,
సనకాదిమునియోగసరణి నొప్ప,
నీపాదతలములే మెలనాఁగ, శ్రుతివధూ
సీమంతవీథులఁ జెన్నుమిగులు
నీపదాబ్జంబులే యిభకులోత్తమయాన,
పాలేటిరాచూలి పట్టుకొమ్మ
లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ,
ముక్తికాంతా మనోమోహనమ్ము
లీయడుగులరజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు వహాళిదిశలఁ దాల్తురు..."

అని యనుమాటలు పోతనవే. పోతన మనోగతములగు భావముల గోపికలచే ననిపించెను. ఇచ్చట, కవి భక్తులగు గోపకాంతలతో నైక్యము బొందెను.

ఇటులనే పోతన యక్రూరునితో తన్మయుండగును. వీరిరువురయందును భక్తిసమాన ధర్మము. కవితో సమానధర్ములగువారిని, కవి చక్కగా జిత్రింప గలడని యింతకుమున్నే వ్రాసియుంటిని. కాళిందీహ్రదమునం దక్రూరుడు గ్రుంకులిడి, యందు పరమేశ్వరుని గాంచి 'మ్రొక్కి భక్తి సంభ్రమంబు లగ్గలంబుగ, గద్గదకంఠుఁడై దిగ్గనం గరంబులు ముకుళించి', భక్తిరసపూరితమగు నొక మహాదండకమున నీశ్వరుని వినుతించెను. హృదయమునందు భక్తి పొంగి వెల్లివిరియునపుడు, చిన్న చిన్న పద్యములుగాక, యొక గొప్పదండక మప్రయత్నముగ వచ్చెను. ఇట్టి దండకములు భాగవతమునం దంతటను రెండుస్థలములమాత్రము గానవచ్చుచున్నవి. మైత్రేయుడు విదురునకు సృష్టిక్రమము నెఱింగించునపుడును, అక్రూరునకు కాళిందీ హ్రదమున శ్రీకృష్ణదర్శనమైనపుడును. ఈ భాగవతశిఖామణి అక్రూరునితో నైక్యము నొందియుంటచే, నీ దండకమత్యద్భుతముగా నుండి, మనలనుగూడ భక్తిరసమున ముంచివేయుచున్నది. ఇచట పోతనకు భక్త్యావేశము గల్గినదనుట నిస్సందేహము.

పోతనసర్వమును భక్తియే యని చెప్పుటకింకొక్కయుదాహరణము చాలును. భీష్ముడీ యవతార సమాప్తిని జెందునపుడు, శ్రీకృష్ణుని ముంగటగని, చేసిన స్తోత్రము శరీరమును పులకాంకితము సేయుచున్నది. భీష్ముని వలెనే పోతనగూడ శరీరత్యాగము సేయునపుడు శ్రీకృష్ణునిలీలల నన్నింటి నొక్కమారుగ స్మరించి:

"మాధవుని యుజ్జ్వలరూపము సూడ్కితీవలం-జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలిం జనకుండ నేత్రముల్-గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగ......"

యోగికైవడి నిశ్చలమనస్కుఁడై:

'ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా
నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహా
లీలన్ నిజోత్పన్న స

స్వకదంబంబుల హృత్సరోరుహములన్
నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచునుండు నట్టిహరి నేఁ
బ్రార్థింతు శుద్ధుండనై.'

అని పరమాత్ముని ధ్యానించుచు, నుత్తమ గతులఁ బడసియుండును!

పోతనవలె సహజపాండిత్యమును, ధారాశుద్ధియుగల్గి, భక్తునయిన మహాకవి మఱి యవతరించుట దుర్ఘటము. ఈకృతపుణ్యుని గ్రంథమునందలి, యేయొక్క విషయము నెత్తి వ్రాయ నుద్యమించినను నది యొకగ్రంథము కాకమానదు. విషయము విపుల విమర్శాకాంక్షియైనను, విస్తరభీతిచే కొన్నివిషయముల మాత్రమే, దశమస్కంధముపై నెక్కువగా నాధారపడి, నానేరిచినంతవట్టు వ్రాసి, యీయోగీశ్వరుని మనసా యొక్కసారి ధ్యానించి, దీనిని ముగించుచున్నాను.

---

# ఆపువ్వే-ఆనవ్వే

కవికొండల వేంకటరావుగారు

( గీతిక )

ఆపువ్వే నిక్వెట్టాకుంటే
చూపులో చోద్దెం లేదు—
ఆనవ్వే నివు నవ్వాకుంటె
అనుకో అవకాశం లేదు.

i. మెడలో నీ కున్నదల్లి
నల్లపూసాల వెలితి
బిళ్లదారాపుబోచ—ఆపువ్వే.

ii. నడలో నీ కున్నదల్లి
కాయాగాసీన వ్రేళ్ల
మాయమట్టెల రవ్వ—ఆపువ్వే.

iii. ఇలలో నివు కట్టిందల్ల
మూరాతక్కువ ముదుక
గోరంచో గవ్వంచో చెల్ల—ఆపువ్వే.

iv. బంగారుపువ్వా కాదు
బంతీ పువ్వేను పచ్చ—ఆపువ్వే.

v. సిగ చుట్టి సిగలో గాదు
అగపడ్డ పాటూగానె—ఆపువ్వే.

vi. నట్టింటా పండక్కి కాదు
పట్టప్ప దుత్తిన దారి—ఆపువ్వే.

---

# అప్పకవీయము : యతిప్రాసలు

దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

నేఁటికాలమున నాంధ్రచ్ఛందోగ్రంథములలో నెల్ల గౌరవస్థానము నలంకరించి యెన్నికెక్కినది యప్పకవీయ మొక్కటియే. ఇటీవలి కవు లందఱును సామాన్యముగ నిద్దానినే ప్రమాణముగ నంగీకరించుచున్నారు. కాని యప్పకవి తాను ఛందోగ్రంథమును రచింపవలెనను తలంపున నిద్దానిని వ్రాసినట్లు లగపడదు. ఏమన నాంధ్రశబ్దచింతామణి యను నన్నయకృత వ్యాకరణము సంస్కృత రూపమున నుండ నద్దానిని భగవదాజ్ఞానుసారము తెనిఁగించి పలువురకు సుబోధముచేయ తలపెట్టెనని యాతని గ్రంథమువలన సర్వులకు విదితమే యగుచున్నది. అట్లయ్యు వ్రాసినంతలో ఛందోవిషయ మెక్కుడుగాను, పూర్వలక్షణ కర్తలకంటె విశేషముగాను నుంటచే నిద్దానిని ఛందోగ్రంథముగానే పరిగణింపుచున్నారు. దీని తృతీయాశ్వాసమున "ఆద్యో ఐళిర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు" అనెడి సూత్రమునకు విపులవ్యాఖ్య రచింపఁబడి యతిప్రాసల విషయమై విపులముగఁ జెప్పఁబడినది. ప్రకృతమున వీనిని గుఱించి నా యభిప్రాయములఁ గొన్నింటి నెల్లడింతును.

ఈ యతిప్రాసల విషయమున నప్పకవి పూర్వలాక్షణికుల యతిసంఖ్యలఁ జెప్పుచు "విశ్రమంబు లేను విరచింతు నాలుగుపదులమీఁద నొకటి" అని తాను ౨౧ యతులఁ జెప్పియున్నాఁడు. బాగుగ విచారించిన వీనిలో కొన్ని గతార్థములు కాఁదగియున్నవి. అట్టివాని నీ క్రిందఁ బొందుపఱతును.

౧. ఈతఁడు ముపిభక్తియతియనియు, ముకారయతియనియు రెండు యతులను జెప్పియున్నాఁడు. భాషాపరిణతిచే నాయా ముపర్ణకములు పు, బు లుగా మారుచుండుటచే యీ యతిని జెప్పుటకు బీజము. ఈ రెంటిలో ముపిభక్తియతి యనిన పున్నపుంసక తత్సమాంధ్రదేశ్యశబ్దముల తుదను కలయు ముకారమునకు పు, ఫు, బు, భు–లు యతి నందునని చెప్పియున్నాఁడు. లక్ష్యపద్యమును జూడ ఒ ఓ లతోఁ గూడిన ప ఫ బ భ లుగూడ నీ ముకారముతో యతిఁ జెందవచ్చునని తేలుచున్నది. ముకారయతి యనఁగా ఉ ఊ లతోఁ గూడిన ప ఫ బ భ లు శబ్దవిష్ఠముకారముతో యతి నందు నని చెప్పియున్నాఁడు. ఏతద్వ్యతిరేకముగా లక్ష్యములుగూడ లేవు. దీనినిబట్టి చూడ, విభక్తి ముకారముతో ఒ ఓ లతోఁ గూడిన ప ఫ బ భ లు గూడఁ జెల్లు ననియు, శబ్దస్థ ముకారమున నట్లు చెల్ల వీలు లేనట్లును స్పష్టపడుచున్నది. కాని విభక్తిశబ్దవిష్ఠము లగు నెల్ల ముకారములతోను ఉ ఊ ఒ ఓ లతోడఁ గూడిన ప ఫ బ భ లు యతి నందుచున్నట్లు కవిప్రయోగముల తెలియుచున్నది. ఇట్లనుకొన్నను ఏయచ్చులతోఁ గూడినను పవర్గమునకే గాని ముకారమునకుఁ గూడునా? అనువిషయ మీతఁడు చెప్పియుండలేదు. చూడుఁడు—

"మ్రొక్కులు గైకొను సమస్త-భువనాధీశా!"

సు. సా.

"పొలుపుగ మితి లేనిమాడ్కి-మొలబంగై—"

రామ. భూ.

ఇట్టి ప్రామాణికులప్రయోగము లెన్నో యున్నవి. ప్రకృతమున నీ శ్రమ నంతను వీడి ఉత్వోత్వవిశిష్ట ముకారమునకు తాదృశ ప ఫ బ భ లు యతి నందునని చెప్పిన సర్వలక్షణ సమన్వయముగ నుండెడిని. ఇట్లు చెప్పుకొన ముపిభక్తియతి మాననగును. మఱియు విభక్తి ముకారమునకు శబ్దస్థ ముకారమునకు భేద మేమియు లేకున్నను నీతఁ డిట్లు భేదము కల్పించినఫల మంతగా కానుపింపదు. లక్షణకర్తలలోఁ బ్రథముఁడైన కవిజనాశ్రయుఁడుగూడ,

క. "పోలఁగ పుష్పంబులకు మా
పోలికవడి శిలమల్ల-మున కెన యనఁగన్
శీలం బుల్లం బనఁగా
భూలోకం బమర లోక-మున కెన యనఁగన్."

అని మకారమాత్రమునకు పవర్గు చెల్లునని చెప్పియున్నాఁడు. అప్పకవి స్పష్టప్రతిపత్త్యర్థము విభేదించి చూపెను గాని, యీరెంటుయతులు నొక్కటియే గాని మువిభక్తియతి యనవసరము.

౨ మఱియు ఋజుయతిసందర్భమున హ, య లు పరస్పరము యతిఁ జెందునని చెప్పియున్నాఁడు. ఇయ్యది సరసయతియం దంతర్భావ మందును. అసలు యతివిషయమున హ, య ల కచ్త్వమే గాని హల్త్వము లేదని ఋత్వసంబంధయతిసందర్భమున,

"సారిది కాదులఁ గల వర్గుసుదుల కెల్ల
ఋత్వమిత్రంబులగు నమ్మ లెనయ నైనఁ
జెల్లు యహలును స్వరమైత్రిఁ జెందునపుడు
వెలయు నివి.............."

అని చెప్పియునాఁడు. అనఁగా హ, య లు తత్సజాత్యస్వరయుతము లగుతఱి నని యర్థము. అప్పుడు వీని హల్త్వ మవివక్షితము. ఇతరలక్షణకర్తలు గూడ నీరెంటికి నచ్త్వ మిచ్చి,

"అయహలు చఛజఝశషసలు
నయసంయుతనణలు............
..........................ని
శ్చయముగ వళ్లయ్యె............."

అని పరస్పరము అయహలు యతి నందునని చెప్పియున్నారు. మఱియు హరిదలమ్=అరదళము, హంసః=అంచ, ఇత్యాదులందు హకార మచ్చగుటచేతను, పది + ఆఱు = పదియాఱు, నా + అది = నాయది, ఇత్యాదులం దకారము యకారరూపము నందుటచేతను పైహయల కచ్త్వము స్పష్టము. కాన సరసయతి లక్షణపద్యమున "హయ లత్వమునకు" అనుచోట ఇతరలక్షణకర్తల వలె "అయహ"లు పరస్పరము యతిఁ జెందునని చెప్పకొన్న పైఋజుయతి గతార్థము కాఁగలదు.

3. మఱియు ప్రత్యేకయతి సందర్భమున, అ ఇది మొదలగు పదములు మఱియొక పదముతో కలిసి నప్పుడు హల్లునకును, కలయక యడాగమము వచ్చి నపు డచ్చునకును యతి నిలుపనగునని చెప్పియున్నాఁడు. స్వరప్రధానయతి చొప్పున నుత్తరపదాద్యచ్చు సంధివశమున లోపించెను గాన నద్దానికే యతి నిలుపవలసినన్యాయ మంచె నట్లు నిలుప వీలు లేదని నియామకమువలన కాంబోలు నిద్దానికి నామధేయము పెట్టియుండును. కాని "చేతి + ఇది=చేతిది" అనియున్నపుడు "తి" అనుదానికి యతి నిలుపునపుడు వర్గప్రాణియతులలో నెద్దియో యొకటి యగుటచేతను, "చేతియది" అని యున్నపుడు యకారమునకే యతి నిలిపిన సరసయతియం దంతర్భవించుటచేత నీయతిప్రాముఖ్య మంతగా కనుపట్టదు. మఱియు పూర్వకవిప్రయోగముల నప్పకవి చూపించి యుండనందునఁ గూడ నిద్దాని ప్రాశస్త్య మంతగాఁ గానుపింపదు.

౪. మఱియు నేకతరయతి సందర్భమున సాధురేఫమును శకటరేఫమును సవర్ణము లయ్యును యతి చెందరాదని చెప్పియున్నాఁడు. అసలీరేఫశకటరేఫలయతిప్రాసలవిషయమున పూర్వకవు లెం రింతపట్టుదల నూని చెప్పినట్టు లగపడదు. కాని యేదోనియమ మూహించి యీరెంటికిని యతిప్రాసలు చెల్లవనెనో తెలియకున్నది. ఈనియమము బట్టి యనేకు లిట్టిప్రయోగముల సాధ్యమైనంతలో దిద్దివేచి యున్నారు అప్పటికిని కొన్ని మిగిలిన వానికి రత్నాకరాదినిఘంటుకర్తలు ద్వైరూప్యముల కల్పించి యున్నారు. కేవల ముచ్చారణలోను, పూర్వవాఙ్మయములోను భేదము లేని వీని నిట్లు భేదించిన మహాత్ము లెట్టి ప్రయోజనముల నొడిగట్టిరో తెలియదు. రేఫశకటరేఫములకు యతిప్రాసలలో సంబంధము కూడదని బోరునపాలముకెక్కి వేసి చెప్పినయప్పకవియే కొన్నిపట్ల వీనిని వాడినట్లును, వానిలో కొన్నిటికి పాఠాంతరములు లేవ నియుఁగూడ పీఠికాకారులు ఘంటాపథముగఁ జెప్పియున్నారు. మఱియు ప్రాచీనప్రమాణకవుల గ్రంథములలో ననేకప్రయోగము లున్నవి. చూడుఁడు—

పారిజాతాపహరణము, తృతీయాశ్వాసము, ౪౯-వ పద్యమున—కందము.

నృసింహపురాణము, ద్వితీయాశ్వాసము, ౫౬-వ పద్యము : రేఫద్వయప్రాసయతి.

భాగవతము— (ధ్రువోపాఖ్యానము) ౯౯-వ పేజీ, ౧౧౦-వ పద్యము: రేఫద్వయప్రాసము.

భాగవతము— (ధ్రువోపాఖ్యానము) ౫౯-వ పేజీ, ౭౧-పద్యము; ౬౯-పద్యమునఁ గూడను.

చంద్రికాపరిణయము, ద్వితీయాశ్వాసము, ౨౬-వ పద్యము : ప్రాసము, వృత్తము.

చంద్రికాపరిణయము, ద్వితీయాశ్వాసము, ౬౦-వ పద్యము : ప్రాసయతి, రేఫద్వయానకు.

మనుచరిత్ర, ౯౯-పే. ౧౨-వ పద్యము; తృతీ. ౧౯-పద్యము : యతిప్రాసములు రెండును.

కళాపూర్ణోదయము, తృతీ. ౨౪౫-పద్యమునఁ గూడఁ గలదు.

శృంగారశాకుంతలము, ద్వితీ. ౧౧౫-పద్యము : రేఫద్వయమైత్రి గలదు.

ఇంక ననేకప్రబంధములఁ గలవు. ఉన్న నేమి? విమర్శకమహాశయులు, లక్షణకర్తలు గూడ తామేసిద్ధాంతముల మనమున నిడికొనిరో యామార్గము వీడక నందిని పంది చేయ నెంచిన వారి నెవ రడ్డుదురు? కానిచో,

"శబ్దశాసనముఖకవీశ్వరకృతప్ర
బంధముల లక్ష్యములు కనుపట్టుకతన."

"క్రమత శబ్దానుశాసన ప్రభృతి పూర్వ
కవిజనంబులకృతుల లక్ష్యములు కలిమి"

"...గ్రంథము లెల్లను
వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్."

అని యాశ్వాసమున కైదేసిసారులు తనయుత్కర్షను కొనియాడుకొన్న యప్పకవి రామరాజు వసుచరితమందలి రలయతినియమము గాని, కళాపూర్ణోదయమందలి ౫౩. ౧౦౫. గల రలప్రాసమును గూర్చి గాని, నృసింహపురాణమందలి తృతీ. ౧౫౫ప. గల రలప్రాసమును గూర్చి గాని యిసుమంత లక్షణమును కల్పింపఁ గలిగెనా? లేదు. పట్టుదలయే ప్రధానము గాన నవి చెప్పలేదు. ఈతని దృక్పథమున పైవారికృతులు తాను ప్రమాణముగా గ్రహించిన గౌరన, ఘల్లన, ఎల్లన మొదలగువారి చాటుధారలపాటి చేసినవి కావు. ఇది తప్పక యప్పకవి సాహసించె ననుదానినే తెలుపుచున్నది. అథవా యీయతిని చెప్పఁ దలకొన్న, లఘ్వలఘురేఫములు పరస్పరము యతి నందరావని చెప్పిన చాలును. తాను జెప్పిన ప్రాణియతి రీతి నేయక్కరమున కాయక్షరమే నిలుపుకొనవచ్చును. యతినియతినియమమున తాను జేసిన నియమమురీతి నందముగ నుండెడిది. యతి కూడదను నిషేధవాక్యముగూడ నొకయతిగా నంగీకరింప ననవసరము. ఇట్టి సంఖ్యాబాహుళ్యార్థమే యనఁదగును. ఆధునికకవులలో ననేకులుగూడ నీనియమమును పాటింపకుండుట తద్గ్రంథముల విశదముచుచునే యున్నది. ప్రాచీనుఁడగు కవిజనాశ్రయుఁడుగూడ నీయతి కూడునని చెప్పిన ట్లితఁడే యొప్పుకొని,

"వికటకవులు కొన్ని వింతల కల్పించి
కవిజనాశ్రయమున కలిపినారు"

అని చెప్పుచు నామతమును ఖండించియున్నాఁడు. చూడుఁడు :—

"నణ లను రెండక్కరముల
కును వడి ప్రాసంబు పెట్టుకొనవచ్చుఁ గృతిక్
విను రఱల కిట్లు పెట్టం
జను........................ .........."

ఇయ్యది నేఁటి పరిషన్ముద్రితప్రతులలో కనఁబడుట లేదు. ఆధునికులలోఁ గొందఱు కవిజనాశ్రయమందలి ఎక్కటియతిసందర్భమున చెప్పిన లక్షణమును "మరయలవ" అనెడిచోట "మరఱలవ" అని దిద్ది యీ రేఫద్వయమైత్రిని వారించిరి గాని కవిమతము రేఫద్వయమైత్రి యంగీకరించినట్లే తేలుచున్నది.

౫. అభేదయతి సందర్భమున "వబయో రభేదః" అనుటవలన, వబ-లడ-లళ లు తమలో తాము యతిబం

భము నందుని చెప్పియున్నాఁడు. వబలకుఁ జెల్లుబడి యభేదవర్గయతిలో నంతర్భావము. దానిలక్షణ మేమన, వకారము ప ఫ బ భ ల తో యతి నందుట, వీనిలో పై యక్కరము లున్నవి గాన వీనిని మరల విడఁదీయుట యనవసరము. ఇఁక ల ర లకు, ల ళ లకుఁ దానిచ్చిన లక్ష్యము లన్నియు రూపాంతరములు గలవియే గాని స్వచ్ఛములైనవి గావు. చూడుఁడు :—

"...ఇతఁ, డే కడలక జలధి పవ్వ-ించె ననఁగ..."

ఇచ్చట పవ్వళించె నను క్రియకు 'పవ్వడించె' నని రూపాంతర మున్నది. ఇఁక ల ళ ల కాదెపర్వము నందుఁ జెప్పిన లక్ష్యములందలి పదముకూడ "మిలిత" అనెడి లఘులకారరూపముతో నున్నది. ఇంతియె గాక సంస్కృతవర్ణసమామ్నాయమందు ళకారము గూడ లేదు. ఇట్లే యప్పకవి యుదాహరించిన "కాళ" ఇత్యాదులు లకార విశిష్టములుగా కూడ నున్నవని యెఱుఁగునది. అట్లయిన పై రేఫ శకటరేఫల విషయమున రూపాంతరము లంగీకరింపక యిట్టివాట్ల రూపాంతర సహాయమున నీ యతిని త్రోసివేయుట కూడునా యని చదువరు లనక మానరు. కాని దానికి సమాధాన మల్పము. ర ఱ ల విషయము నవముం త్రోపు కలిమి యగు తెనుఁగు భాషాసంబంధమైనది. ల ళ డ ల విషయము ప్రాచీన మైన సంస్కృతభాషాసంబంధము. మఱియు నియ్యది వేదకాలమునుండియు వచ్చుచున్న భేదమే గాన తత్తత్సంపర్భముల నియ్యది గ్రాహ్య మని నా యభిప్రాయము. చూడుఁడు—

"రుమ్పామి, లుమ్పామి; ఇరయః, ఇలయః; ఇరజ్యంతి, ఇలజ్యంతి"—ఇట్టి వైదిక ప్రయోగములు ర ల ల కభేదమును చాటుచున్నవి.

"అగ్ని మీళే, ఈడే; ఈనుషే, ఈళ్హాషే" ఇత్యాదిప్రయోగములు డ ళ ల కభేదమును చాటుచున్నవి. మఱియు ప్రాకృత వ్యాకరణమునఁగూడ "డోలః" అనెడి సూత్రముచే డలల కభేదాధ్యవసాయ మున్నటులు స్పష్టము. కాన పై యప్పకవి యుదాహరణపద్యస్థ పదములు తద్రూపముల వీకి రూపాంతర ములుగానే ప్రయోగముల నున్న వనుకొన్న శ్రమ తగ్గును. కాన యభేదయతి యనవసరము.

౬. మఱియు సూక్ష్మవిశ్రాంతి సందర్భమున "శషస" లన్యోన్యము యతిఁ జెందవచ్చు నని చెప్పియున్నాఁడు. ఇయ్యదిగూడ సరసయతివలన గతార్థమగును. ఎట్లన, కవిజనాశ్రయరీతిని, "చ ఛ జ ఝ శ ష స" లన్యోన్యము యతిసాధర్మ్యము నందవచ్చు నని యే యీతఁడుగూడఁ జెప్పియున్నాఁడు. కాన మరల శ ష స లను వీనినుండి విడఁదీసి కల్పనాంతరము చేయుట యముఖ్యము. అసలీ యతికి బీజ మేమన నా వర్ణము లుచ్చారణములో కించిద్భేదముగా పలకబడుచున్నను, "ఖరిచ వావసానే. ఝలాంజశు ఝశి, ఝలాంజశోంతే; ఆదేశప్రత్యయయోః. వ్రశ్చ భ్రశ్చ...షః" ఇత్యాది సూత్రోపనిర్దిష్ట మగు పరిణతి నందుటయే. మఱియు, తద్భవరూపమున, ఆశా-ఆస; ఇచ్ఛా-ఇచ్చ; వేష-వేస; దశా-దెస ఇత్యాదులలోఁగూడ నాయా రూపముల నందుటయే కారణము. మఱియు ప్రాకృతాదిభాషలలోఁగూడ, "శషోస్సః", "శ్చత్సప్సాం ఛః" ఇత్యాదు లీ నియమమునే తెలుపుచున్నవి. కాన పైఁ జెప్పిన యక్కరము లన్నియు సరసయతిరీతిని పరస్పరము యతిని బొందుచుండ సూక్ష్మవిశ్రాంతి యనునది యనవసరము.

౭. అంత్యోష్మసంధివడి విషయమున,—

"...............అని యిట్లు వర్గహల్లు
పొల్లులకు పై హకారము పొందునపుడు
...............అంత్యోష్మసంధి విరమ
ణాఖ్యచే దాని కియ్యదియైన చెల్లు"

అని చెప్పియున్నాఁడు. అనఁగా కచటతప వర్గీయ వ్యంజనాక్షరము లన్నియు (అనునాసికములు తక్క) హకారాదిపదములతోఁ గలియునప్పుడా హకారమునకును బైకలసి రూపటిన వర్గీయవ్యంజనమునకును గూడ సాజాత్యములు యతిగా నిలుపవచ్చు నని యర్థము. లక్ష్యము చూడుఁడు :

"కైరవకామధు-గ్ఘరవాహకవికుంఠ
హైరణ్యగర్భవా-గ్ఘరిసబృంద."

పైలక్ష్యమున "కామధుక్ + హర" అనియు, "వాక్ + హరి" అనియును ఛేదము. ఇట్టిపట్టుల సంధి పాణినీయరీతిని వికల్పము. "ఝయో హోఽన్యతరస్యామ్" అని యుండుటచే హకారమునకు యతి నిలిపినచోట సంధ్యభావమును, సర్ణీయవ్యంజనమునకు యతి నిలిపినచోట సంధివివక్షయుఁ జేసిన నీ యతి ప్రత్యాఖ్యానయోగ్య మగును. ఇట్టి వివక్షవలన ఛందమున గణభంగము గాని ఛందోభంగము గాని వాటిల్లదు. ఉచ్చారణలో మాత్రము కొంత కష్టము లేకపోలేదు; అయినను ప్రక్రియాలాఘవ మూహ్యము. దిద్దినపుడు లిపి యీరీతి నుండును: "వాగ్ఘరిః" అనెడిచోట "వాగ్హరిః" అని యుండును. మఱియు నిట్టివి పూర్వకవిప్రయోగములలో లేమిఁ గాఁబోలు లక్ష్యముల నిచ్చియుండలేదు. కాన నీ యతిగూడ ననవసరము.

౮. పైరీతినే వికల్పవిరమణము గూడ తీసి వేయవచ్చును. "గూఢపాన్మదవిహార" ఇత్యాదిస్థలములలో "యరోఽనునాసికేఽనునాసికో వా" అనెడి పాణినీయసూత్రముచే, సంధి వైకల్పికము గాన, సంధిని వివక్షావివక్షాధీనము చేసిన, నియ్యాది ప్రాణియతియం దంతర్భావ మందును. అట్టితఱి,

"నందసుకుమార గూఢపా-న్మదవిహార
దళితశిశుపాలగోత్రభి-న్మణివినీల"

అని నకారమునకు నకారమును, దకారమునకు దకారమును ప్రాణియతిచొప్పున సరిపోవును. ఇట్టితఱి ఛందమున కేభంగమును రాదు గాన నియ్యతి గూడ ముఖ్యముగా నుండ తగినది కాదని నానమ్మకము. మఱియు "మయటి నిత్యం వాచ్యమ్" అనెడి వార్తికమువలన, "చిన్మయమ్" అని రూప మొక్కటియే యగుచుండ నప్పుడిద్దానికి యతివిషయ మీయతి దిగువఁ జెప్పవలసిన యగత్యము లేదు—ఇతర యతిలో నంతర్భావమే గాన.

ఇఁక నుభయయతుల సందర్భమున నప్పకవి యనవసరమయిన వన్నియుఁ జెప్పి నామము లంకించి యున్నాఁడు. సామాన్యముగ నేకపదభ్రాంతిజనకములగు సమాసస్థలములమాత్రమే యాభ్రాంతినివారణార్థ ముభయమునకు యతి నిలుపవచ్చునని, యాయా సమాసముల పదద్వయ మిమిడియున్నదనియుఁ జెప్పిన యుక్తముగా నుండెడిది. మఱియు నితర పూర్వలాక్షణికులు చెప్పియున్న యఖండయతి నంగీకరించినచో వీనిలో కొన్ని ప్రత్యాఖ్యానయోగ్యము లగును. అయఖండయతి నీతఁ డంగీకరింపక పోవుటచే వాని కన్నిటికి వేరువేరు నామధేయములఁ బెట్టి గత్యంతరము కల్పింపవలసి వచ్చినది. చూడుఁడు. యుష్మదస్మచ్ఛబ్దయతి సందర్భమున నీశబ్దములతో పై నజాదిపదములు కలయునపు డచ్చునకును హల్లునకును గూడ యతి నిలుపవచ్చునని చెప్పియున్నాఁడు.

౯. ఉ :—"అతిపావన మయ్యె నస్మ-దన్వయ మెల్లన్." ఇచ్చట "అస్మత్ + అన్వయము" అని యుండ నుత్తరపదాద్యచ్చు సంధివశమున కలిసిపోవ నద్దానికే యతి నిలుపఁబడెను గాన నప్పోచ నియ్యాది స్వరప్రధానయతియం దంతర్భవించును.

"ధర్మతనయ యుష్మ-దాజ్ఞానిగళ విని
బద్ధమయ్యుఁ జిక్కు..వడియెఁ గాక."

ఇచట యతిస్థానముల యందలి హల్సాజాత్యముండి యొకచోట యుష్మత్ + ఆజ్ఞా అని దకారోత్తరవర్తి యకారము విలుగుచుండి పదాద్యస్థ ధకారముపై నున్న యచ్చు విలుగకుండుటచే నియ్యాది యన్యలక్షణకర్తలు చెప్పిన యఖండ యతియం దంతర్భవించును. ఇట్లే యఖండ యతి నంగీకరించిన కొన్ని గతార్థము లగును.

౧౦. మఱియు దేశ్య నిత్య సమాస విరతి ప్రసంగమున నాయా సమాసములఁ గల అజ్ఝల్లులు రెండును యతి నంది పన్నునని చెప్పి తాను చెప్పిన దేశ్యసమాసముల కన్నిటికి నుదాహరణ నిచ్చియున్నాఁడు. అందు నొక యుదాహరణను చూచుకొందము.

"...ఉ, కన్గొని తద్వన మెల్ల నద్రువ-నార్చుచు కడిమిన్."

ఇచ్చట "ఉత్కృ + అలు" అని సమాసాంతర్భూతాచ్చకును, "అగ్రువర్ + ఆర్చుచు" అనెడి విగ్రహస్థాచ్చునకును యతి నిలుపఁబడెను గాన నియ్యది స్వరయతియం దంతర్భావము నందును.

"......ఉ, కృ రభసంబుమై నడర-కవ్వడి."

ఇచ్చట సమాసస్థ కకారమునకు యతిగా కకారమే నిలుపఁబడినది. ఇది హల్లు కుదాహరణము. మఱియు పై రీతినే యిచ్చటఁగూడ నొకచో ఖండముగాను మఱి యొకచో నఖండముగాను నుంటచే నిదిగూడ నఖండ యతియం దంతర్భావ మందును. తక్కిన ప్రయోగములు గూడ నన్నియు నీరీతినే చూచుకొన్న సరిపడును. కొందఱీ "యతు" అను నాశార్థకధాతువునకు ప్రత్యేక ప్రయోగము లేమి పదత్వసిద్ధి కలుగదని యనుకొందురు. ప్రయోగము లుంటచే నాసందేహ మనవసరము

౧౧. ఇట్లే నిత్యయతియు, ౧౨. విభాగయతియు, ౧౩. నామాఖండయతియు, ౧౪. రాగమసంధి యతియుఁ గూడ గ్రాహ్యములు. ఈ యతు లన్నియుఁ బ్రత్యాఖ్యానయోగ్యములే యని గ్రహించునది. రాగమయతిసందర్భమున ఆలను పదము మొదల వచ్చు రాగమునకే యతి నిలుపుపక్షమున నుభయము చెల్లుననియే గాని మఱే విషయమును చెప్పియుండలేదు. కాని "వాలు + అమ్మ = వాలురమ్మ" మొదలగు నాచ్ఛిక సమాసముల నిత్యముగా ప్రాప్తించు రాగమునులమాట తలపెట్టలేదు. అట్టివి యతిస్థానముల వచ్చిన నుభయమున నేల నిలుపరాదు? అతని సమాసములలోను, పైచోటను వచ్చిన రాగమును సమమే గాని దానివలన ఫలాధిక మేమియు లేదే? శాస్త్రకర్త వీనిని గ్రహింపలేదు గదా యని విడుచుట అంత సమంజసముగా లేదు. మఱియు కాకుస్వరయతిగూడ పై రెండు యతులలోను నంతర్భవించుటకు సందియము లేదు.

అప్పకవి తాను చెప్పిన యతులలోఁ బసునేను వఱకు గతార్థము లైనవి. ఉభయయతులవిషయమై యఖండయతి నంగీకరించిన నెంత గ్రంథము తగ్గునో యాతఁ డూహింపక వట్టి పట్టుదలనె ప్రధానముగఁ దీసికొని ప్రతిజ్ఞాభంగము రాకుండ గ్రంథమును విస్తరించినాఁడు. లేనిచో భాషాసముద్రమున కాదిభూత మైన భారతమందును, మఱియు ననేక గ్రంథరాజములయందును అఖండయతులు గల ప్రయోగము లనేకము లుండ వాని కన్యథా కల్పన చేయు నేల? తావన్మాత్రమే గాక యన్యలక్షణకర్తలు తమ గ్రంథములలో భారతోద్ధృతములను నఖండయతుల నుదాహరింప నవన్నియు తప్పులనియు, తాను దివ్యచక్షుస్సులతో తేఱిపాఱఁజూచిన అత్యంతప్రాచీన శిథిలీభూత తాళపత్రమాతృకలలో నట్లు పాఠములు లేవనియు, పూర్వులమాయకత్వమున తెలియక తప్పుల నుదాహరించి రనియు దూషణపరముగా తనయాధిక్యమును వెల్లడించి వానిని తద్భిన్నములుగా దిద్దినాఁడు. అట్లు చేసినఁ గాని తనమతప్రకారము ౪౧ యతియు సరిపడదు. సరిపడినఁ గాని పూర్వగ్రంథకర్తల కీర్తి తాహరింపఁజాలఁడు. ఇంతియె గాని యఖండయతి నంగీకరించినఁ గల తప్పేమో? దాని యందుఁ గల శ్రుతికటుత్వ మేమో? అట్లంగీకరించినచో గణాధిదేవత క్రోధోద్రిక్తయై మనగొంతుల కొఱుకునో? తెలియఁజెప్పనే లేదు. హల్సాజాత్య ముండి యొకచోట స్వరము విఱిగి మఱియొకచోట విఱుగకున్నంత మాత్రముననే ఈ యతి త్యాజ్య మైనచో నిఁక తద్భవాదియతులలో వర్ణములకు పోలికయే లేనప్పుడు, బాహ్యప్రయత్నసాదృశ్యమైన లేనప్పుడు నియ్యదిమాత్ర మెట్లు యతులలో పరిగణింప తగునో తెలియదు. తనస్వరూపమునే నమ్మనితఱి తనయపత్యమును మాత్ర మెట్లు నమ్మనగును? మఱియు నీయతిప్రాస లనునవి మనపూర్వులు బంధించిన చివుకుతాళ్ల బంధనలే గాని పరమేశ్వర ప్రోక్తములు గావు. పూర్వ మున్న యతిసంఖ్యను ఇప్పటియతిసంఖ్యను పరిగణించిన పైవిషయము సుబోధమై యెవరిచ్చన వారు నుడువుచుండి రనుట స్పష్టమగును. ప్రధానమగు రసము లేనితఱి కావ్యమున ప్రతిపద్యమునందును మైలురాళ్లవలె యతిప్రాసల నిలిపినంత నా ప్రబంధరాజము చిరస్థాయి యగునా? అప్పకవివంటి మహాశయు లున్న దాని నేతావా నస్య చేయుదురేమో? మఱి యొకమాట. "యతి ర్విచ్ఛేదసంజ్ఞకః" అనెడి వాగ్రత్నమును శిరసా

వహించి రసము భ్రష్టము కాకుండ సంస్కృతమున గ్రంథముల వ్రాసిన కాళిదాస భవభూత్యాదుల కేమైన కించిత్తు లోటు వాటిల్లెనా? వాటిల్లునా? మఱి యేభాషలోనైన నిట్టినిబంధము లుండియుండెనా? అట్టితఱి నీ తెనుఁగు భాషయందే యిట్టినియమము లుండ పనియేమి? మనపండితులయు, పూర్వకవులయు, తదనుసారులయు కటాక్షవీక్షణమే గాని మఱేమియు కాదు. మఱియు విమర్శకాగ్రేసరులగు శ్రీయుత వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులవారుగూడ తమ వసుచరిత్ర విమర్శనమందు యతులవలనఁ గలుగు కవిత్వనష్టములఁ జెప్పియున్నారు చూడుఁడు:

"ఆంధ్ర పద్యవాఙ్మయమునకుఁ బ్రాసవిశ్రమనియమ మలంకారార్థమే కల్పింపఁబడినను కొన్నియెడల నది శోభావహము గాక శోభాభంజకమే యగుచున్నది.

'శబ్దార్థయోరస్థిరా యే ధర్మాశ్శోభాతిశాయినః
రసాదీనుపకుర్వంతో ఽలంకారాస్తేఽంగదాదివత్'

అను విశ్వనాథపంచాననుని సూక్తిచొప్పున నలంకారము లస్థిరములై యుండఁగా శబ్దాలంకారములవంటివే యైన యీప్రాసవిశ్రమము లేల నియతములై యుండవలెనో తెలియకున్నది. మఱియు నివి దుర్ఘటము లగుటచే నక్షరముల పరస్పరసంబంధ మీవిషయమున నంగీకరింపఁబడుట నివి కల్పించుటలోఁ గల యుద్దేశము విధ్వస్తమే యగుచున్నది. మఱియు నీ నియమము కవిత్రయమువారి పద్యములందు సైతము అనేకస్థలములందు వ్యర్థపదప్రవేశమునకు బీజమగుచున్నది."

కాని మహాశయు లెంద ఱెంత చెప్పినను నాదరము జనింపలేదు. రావు సాహెబ్ గిడుగు వేంకటసీతాపతిగారు అప్పకవీయపీఠికలో నీయఖండయతిని గుఱించి నిరాటంకముగా వ్రాసియున్నారు. అనేక అఖండయతుల నిచ్చియున్నారు. కాన పైయఖండయతి నంగీకరించిన కొన్ని యుభయయతులు తీసివేయవచ్చును. ఈ యతుల విషయమున నప్పకవి చెప్పిన వానిలోఁ గల నా భేదాభిప్రాయమునే చెప్పితిఁ గాని యన్యము గాదు.

---

# మాతృపూజ

కవిభూషణ, కవిరాజ, శ్రీ రాజా వత్సవాయ వేంకట నీలాద్రిరాజుగారు

వ్రాలక మాతృధారుణికి వ్రాలి వసీరమ చేయు పూజలో
జా లసిపించుకోవు శుకసంచయ చంచుపుటీ పతత్పత
ద్బాలరసాలసాల తరుపాంతలతాంత నితాంతవాంత మా
ధ్వీలహరీ పచేళిమ, భిదేళిమ దాడిమబీజరాజముల్.

---

# జైన సంస్కృతవాఙ్మయము

యస్. శ్రీకంఠశాస్త్రిగారు, యమ్. ఏ.

శ్రీ వర్ధమాన తీర్థంకర నిర్వాణానంతరము జైన సిద్ధాంతగ్రంథజాలమందు ముఖ్యముగ ద్వాదశాంగములు, ద్వాదశోపాంగములు, దశపఇన్నములు, ఆరు ఛేదసూత్రములు, నందిసూత్రములు అను యోగద్వారసూత్రములు, నాలుగు మూలసూత్రములు ప్రచారమున నుండె నని శ్వేతాంబరులు చెప్పుదురు. దిగంబరమతము ప్రకారముగా ప్రాచీనసిద్ధాంతగ్రంథము లన్నియు నశించినవి. క్రీస్తుపూర్వము 3౩-వ సంవత్సరముముంగు భద్రబాహు శ్రుతకేవలి యాజమాన్యమున పాటలీపుత్రమునందు గ్రంథము లన్నియు క్రోడీకరింపబడె ననియు, ఆసమయమున "దృష్టివాద" మను అంగము నశించెననియు ఐతిహ్యమున్నది. పిదప ద్వాదశాబ్దక్షామము వచ్చి భద్రబాహువు తన శిష్యులగు చంద్రగుప్తాదులతో దక్షిణాపథమునకు వచ్చి కర్ణాటకదేశమున కల్బప్పు(కటవప్ర-శ్రవణ బెళగొళ) మునందు బహుకాలము నివసించి యాస్థలమునందే దేహత్యాగము చేసెను. దక్షిణదేశమున జైనమతప్రవేశమునకు ఇదే మొదలు. డా. ఫ్లీటుగారు ఈ భద్రబాహువు శ్రుతకేవలి భద్రబాహువుగాదనియు, చంద్రగుప్తుడు మౌర్యుడు గాక ఆచారాంగధరు డగు రెండవ భద్రబాహు శిష్యుడగు గుప్తిగుప్తుడనియు అభిప్రాయపడిరి. అయినే, జైనేతిహాసములందు శ్రుతకేవలియే దక్షిణాపథమునకు వచ్చినట్లు చెప్పుటచే వారి వాదము సమ్మతము కాదు. చక్రవర్తియగు చంద్రగుప్తుడు జీవితాంతమునందు ఐహికవ్యాపారములు త్యజించి సన్యాసము స్వీకరించుటయందు విశ్వాసవిరుద్ధాంశము లేమియు లేవు. దిగంబర శ్వేతాంబరు లిట్లు భిన్నశాఖ లయినది క్రీస్తుపూర్వము నాల్గవ శతాబ్దమునందు.

దక్షిణదేశమునందు కూడ క్రీస్తు శకము రెండు మూడవ శతాబ్దములవఱకు జైనాచార్యులు మాగధి, అర్ధమాగధి మొదలగు ప్రాకృతభాషలందే గ్రంథరచనము చేయుచుండిరి. క్రీస్తుశకము ౭౯-వ వత్సరమునందు అర్హద్బల్యాచార్యుడు మూలసంఘమును నాల్గువిభాగములుగా విభజించెను.

"అర్హద్బలి స్సంఘ చతుర్విధంస
శ్రీకుందకుందాన్వయమూలసంఘమ్
కాలస్వభావా దిహ జాయమానం
ద్వేషేతరాల్పీకరణాయ చక్రే.

సితాంబరాదౌ విపరీతరూపే
బలే విసంఘే వితనోతి భోధమ్
తత్సేననంది త్రిదివేశసింహ
సంఘేషు యస్తం మనుతే కుదృక్సః.

సంఘేషు గచ్ఛ వళిత్రయేణ
లోకస్య చక్షుషి భిదాజుషి నందిసంఘే
దేశీగణే ధృతగుణేఽన్విత పుస్తకాచ్ఛ
గచ్ఛేంగుళీశ్వరవళి ర్జయతి ప్రభూతా."

అనంతరము జైనాభాసములగు శ్వేతాంబర యాపునీయక ద్రావిడాదులగు సంగడములు ప్రసిద్ధికెక్కెను.

"కియత్యపి తతో కాలే ఽతీతే శ్వేతాంబరో ఽభవత్
ద్రావిడో యాపునీయశ్చ కేకీ సంఘశ్చ మానతః.

కేకిపింఛో శ్వేతవాసాః ద్రావిడో యాపునీయకః
నిఃపిచ్ఛశ్చేతి పంచైతే జైనాభాసాః ప్రకీర్తితాః."
(ఇంద్రనంది నీతిసారము.)

కుందకుందాచార్యుడు (క్రీ. శ. ౯) అనేకాభిధానములు ధరించియుండెను.

తతోఽభవత్ పంచసునామధామా
శ్రీపద్మనంది ర్మునిచక్రవర్తీ.

ఆచార్యః కుండకుందాఖ్యో
వక్రగ్రీవో మహామతిః
ఏళాచార్యో గృధ్రపింఛః
పద్మనంద్తీతి తన్యతే.

ప్రాభృతసారము, సమయసారము, ప్రవచనసారము, రయణసారము, ద్వాదశానుప్రేక్ష అను గ్రంథములనీతడు రచించెను. ప్రాభృతసారమునకు టీకవ్రాసిన బాలచంద్రుడు, ఆగ్రంథము శివకుమారుడను రాజుకొరకు రచియింపబడెనని చెప్పెను. బహుశః ఈరాజు శాతవాహన వంశీయుడగు స్కందశ్రీ,అథవా శివశ్రీ శాతకర్ణి యని యూహింప వచ్చును. ఈ గ్రంథములన్నియు ప్రాకృతభాషయందే వ్రాయబడెను. ఈఏళాచార్యుడే తమిళభాషయందు కురళ్ నీతిగ్రంథము వ్రాసి తనశిష్యుడగు తిరువళ్లువర్ అనువాని కిచ్చెనని కొందరూహించెదరు. అయితే కురళ్ గ్రంథము బహుశః ఏడవశతాబ్దమందు కామందకి, శుక్ర నీతిగ్రంథము లాధారముగా వ్రాయబడియుండుటచే ఈఏళాచార్యుడు కుండకుందుడు కాడు, ద్రావిడ సంఘమునకు చేరిన మరియొక ఏలాచార్యుడు. నార్తార్కాటునందు హేమగ్రామము (పొన్నూరు) నందు నివసించి, నీలగిరియందు జ్వాలామాలినీపూజావిధానమును విధించెను. ఇతడే తిరువళ్లువర్ గురువయి యుండును.

కుండకుందుడు ఆకాశగమనము చేయుచుండెననియు, ఒక శిలాసరస్వతి విగ్రహమును మాటలాడునట్లు చేసినందుకు కుండకుందాన్వయమూలసంఘమునకు సరస్వతీ అథవా పుస్తకగచ్ఛమని నామము వచ్చెననియు ఐతిహ్యమున్నది.

రజోభిరస్పృష్టతమత్వ మంత
ర్బాహ్యేపి సంవ్యంజయితుం యతీశః
రజఃపదం భూమితలం విహాయ
చచార మన్యే చతురంగుళం సః.

ఇదివరకు జైనగ్రంథములన్నియు ప్రాకృతమందే వ్రాయబడెను. క్రీస్తుశక ప్రథమద్వితీయ శతాబ్దములందు బ్రహ్మసూత్రాది బ్రాహ్మణగ్రంథములు వ్రాయబడుటయే కాక, అశ్వఘోష నాగార్జునవసుబంధ్వాది బౌద్ధభిక్షువులచే మహాయాన గ్రంథములు సంస్కృతమందు రచియింపబడెను. ఇట్లు సంస్కృతము ప్రబలింపగా జైనాచార్యులును సంస్కృతమునందే గ్రంథములను వ్రాయ నారంభించిరి. ఉమాస్వామ్యాచార్యుడు (అథవా ఉమాస్వాతి) బహుశః బ్రహ్మసూత్రముల ననుకరించి తత్త్వార్థాధిగమసూత్రములను వ్రాసెను.

ఉమాస్వామ్యనంతరము ముఖ్యుడయినకవి సమంతభద్రాచార్యుడు ఇతడు బహుశః కర్ణాటకదేశమున నాగరఖండమునందు జనించెను. భరతఖండసమస్త ముఖ్య పట్టణములందు సంచరించి, వాదులను జయించి విఖ్యాతి గాంచెను.

"కాంచ్యాం నగ్నాటకోఽహం మలమలినతను
ర్లాంబుసే పాండుపిండః
పుండ్రాండ్రే శాకభోజీ దశపురనగరే
మృష్టభోజీ పరివ్రాట్,
వారాణస్యా మభూవం......
రాజన్య స్త్రాస్తిశక్తి స్స వదతుపురతో
జైన నిర్గ్రంథవాదీ.

పూర్వం పాటలపుత్రమధ్యనగరే
భేరీ మయా తాడితా
పశ్చాన్మాళవ సింధు ఠక్కవిషయే
కాంచీపురే వైదిశే,
ప్రాప్తోఽహం కరహాటకం బహుభటై
ర్విద్యోత్కటం సంకటం
వాదార్థీ విచరా మ్యహం నరపతే
శ్శార్దూల విక్రీడితమ్.
అవటుతట మటతి ఝటితి
స్ఫుట పటువాచాట ధూర్జటేరపి జిహ్వా,
వాదిని సమంతభద్రే
స్థితవతి తవ సదసి భూప కాస్థాన్యేషామ్."

సమంతభద్రుడు గంధహస్తి మహాభాష్యమును, ఆప్తమీమాంస (అథవా దేవాగమస్తోత్రము)ను, కొన్ని స్తోత్రములను వ్రాసెను. ఆప్తమీమాంసాగ్రంథము

దిగంబర గ్రంథములందు ప్రశస్తమయినది. దీనిమీద వ్యాఖ్యానములు ప్రసిద్ధులగు పూజ్యపాద, అకళంక, ప్రభాచంద్ర, మాణిక్యనంద్యాదులచే వ్రాయబడుటయే గాక, మీమాంసకుడగు కుమారిలునిచే సమంతభద్రుని వాదములకు సమాధానము చెప్పవలె నని ఆప్తమీమాంస యందలి ప్రత్యక్షైకాంత, అవినాభావ, నిత్యత్వైకాంత, క్షణికైకాంత, అద్వైతైకాంత, అంతరంగార్థైకాంత, బహిరంగార్థైకాంతేత్యాది వాదములు నిరసింపబడి, అనైకాంతమతము అథవా స్యాద్వాదమతము స్థాపింపబడి యున్నది. సమంతభద్రుడు వైద్యవ్యాకరణ జ్యోతిషగ్రంథములు వ్రాసెనని ఇతరగ్రంథములవలన తెలియుచున్నది.

ద్రవిడసంఘ అరుంగళాన్వయమున సింహనంద్యాచార్యుడు గంగరాజగు మాధవునికి పట్టాభిషేకము జేసెను. ఆతని యనంతరము వక్రగ్రీవుడు అథశబ్దమునకు ఆరుమాసములు వ్యాఖ్యానముచేసి పరవాదుల నోడించెను. శంకరాచార్యులు బ్రహ్మసూత్రభాష్యమునందు అథశబ్దమునకు ఆనంతర్యార్థము చెప్పి అధికారార్థము నిరాకరించిరి. బహుశః వృత్తికారులగు బోధాయన, ద్రమిడాచార్యాదుల కాలమునందే ఈ వక్రగ్రీవు డుండెను.

"వక్రగ్రీవమహామునే ర్దశశతగ్రీవో ఽప్యహీంద్రో యథాజాతం స్తోతు మలం వచోబలమసౌ కింభగ్నవాగ్మివ్రజమ్,
యో ఽసౌ శాసనదేవతాబహుమతో హ్రీవక్రవాదిగ్రహ గ్రీవో ఽస్మిన్నథశబ్దవాచ్యమవదన్మాసాన్సమాసేనషట్."

పూజ్యపాదునికి దేవనంది, జినేంద్రబుద్ధి యను నామాంతరములుండెను. వనదేవతలచే ఈతని పాదములు పూజింపబడుటచే పూజ్యపాదుడనియు, బహుప్రతిభాశాలి యగుటచే జినేంద్రబుద్ధి యనియు పేర్కొనబడెను.

"యో జీవనంది ప్రథమాభిధానో
బుద్ధ్యా మహాత్మా స జినేంద్ర బుద్ధిః,
శ్రీపూజ్యపాదో ఽజని దేవతాభిః
యత్పూజితం పాదయుగం యదీయమ్."

ఇతని గ్రంథములు:—

"జైనేంద్రం నిజశబ్దభాగ మతులం
సర్వార్థసిద్ధిః పరా
సిద్ధాంతే నిపుణత్వ ముద్ధకలితాం
జైనాభిషేకః స్వకః,
ఛందస్సూక్ష్మధియం సమాధిశతకం
స్వాస్థ్యం యదీయం విదాం
ఆఖ్యాతీహ స పూజ్యపాదమునిపః
పూజ్యో మునీనాం గణైః."

జైనేంద్రవ్యాకరణము, శబ్దావతార న్యాసము, సర్వార్థసిద్ధి సమాధిశతకము, జైనాభిషేకము, చికిత్సాశాస్త్రము గాక, సిద్ధప్రియస్తోత్రము, శాంత్యష్టకము, చతుర్వింశతితీర్థంకరస్తుతి ఇత్యాదిగ్రంథములను వ్రాసెనని తెలియవచ్చుచున్నది. అష్టవ్యాకరణములందు జైనేంద్రము ముఖ్యమయినది. కాశికా కారులుగూడ ఈ వ్యాకరణము నుంచి సూత్రముల నుదాహరించియున్నారు. శబ్దావతారము పాణినివ్యాకరణమునకు టీకారూపముగా నీతని శిష్యుడగు దుర్వినీతు డను గంగరాజు బోధనార్థముగా వ్రాయబడెను. హెబ్బట తామ్రశాసనమునందు దుర్వినీతుడు పూజ్యపాదుని శిష్యుడనియు, దుర్వినీతుడే శబ్దావతారకారు డనియు చెప్పబడినది. పూజ్యపాదుని "లక్షణ" ములు ఇట్లు కీర్తింపబడినవి.

"ప్రమాణ మకళంకస్య పూజ్యపాదస్య లక్షణమ్,
ద్విసంధానకవేః కావ్యం రత్నత్రయ మపశ్చిమమ్."

దేవనందిశిష్యు డగు వజ్రనంది దక్షిణమధుర యందు (క్రీ. శ. ౫౨౬) ద్రావిడసంఘమును స్థాపించెను.

"సిరిపుజ్జపాదసీసో దావిడసంఘస్సకారగో వుత్తో,
ణామేణ వజ్జనందీ పాహుణవేదీ సుఅహాసత్థో."

"పంచ స ఏ ఛవీసే విక్కమరాయ స్స మరణపత్తస్స,
దక్ఖిణమహురాజాదో దావిడసంఘో మహామహో."

వజ్రనంది నవస్తోత్ర మను గ్రంథమును రచించెను.

"నవస్తోత్రం తత్ర ప్రసరతి కవీంద్రాః కథమపి
ప్రమాణంవజ్రాదౌ రచయతరన్నందిని ముదౌ,

నవస్తోత్రం యేన వ్యరచి సకలార్హత్ ప్రవచన
ప్రపంచాంతర్భావప్రవరణవరసందర్భసుభగః."

అనంతరము సుమత్యాచార్యుడు సుమతిసప్తకమును రచించెను. ఈ సుమతిసప్తకము తెలుగు సుమతి శతకముకంటె వేఱు. చింతామణియనువాడు చింతామణి కావ్యమును, శ్రీవర్ధదేవుడు చూడామణి కావ్యమును వ్రాసిరి. శ్రీవర్ధదేవుడు దండిసమకాలీనుడై (క్రీ.శ.౬౧౦) ఆకవిచే నిట్లు స్తుతిగాంచెను.—

"య ఏవ ముపశ్లోకితో దండినా—
జహ్నోః కన్యాం జటాగ్రేణ బభార పరమేశ్వరః,
శ్రీవర్ధదేవ సంధత్సే జిహ్వాగ్రేణ సరస్వతీమ్."

సిద్ధసేనదివాకరుడను జైనాచార్యుడు మయూర బాణుల (౬౨౦ క్రీ. శ.) సమకాలీనుడై కల్యాణమందిర స్తోత్రమును రచించెను. జినసేనుడు ఆదిపురాణమునందిట్లు చెప్పుచున్నాడు.—

"ప్రవాదికరియూథానాం కేసరీ నయకేసరః,
సిద్ధసేనకవి ర్జీయాత్ వికల్ప నఖరాంకురః."

ఇతడు బహుశః వరాహమిహిరునిచే పేర్కొనబడిన జ్యోతిష్కుడగు సిద్ధసేనుడగునో, కాదో నిర్ధరించుటకు ప్రబల నిదర్శనములు లేవు.

బహుశః ఇదేకాలమునందు శ్రీదత్త, యశోభద్ర, జటాచార్య, (కథాలంకారకర్తయగు) కాణభిక్షుకాది పండితు లుండిరని ఆదిపురాణమువలన నూహింపవచ్చును. శ్రీదత్తుడు జల్పనిర్ణయమును వ్రాసెనని విద్యానందుని తత్త్వార్థశ్లోకవార్తికము తెలియజేయుచున్నది.

"ద్విప్రకారం జగౌ జల్పం తత్త్వప్రాతిభగోచరమ్,
త్రిషష్టే ర్వాదినాం జేతా శ్రీదత్తో జల్పనిర్ణయే."

జైననైయాయికులందు భట్టాకలంకుడు ప్రసిద్ధికెక్కినవాడు. కాంచియందు హిమశీతలుని యాస్థానమున బౌద్ధులను వాదములో జయించెను. (క్రీ. శ. ౬౮౨) ఇతడు కుమారిల, శంకరాచార్య, ప్రభాకర, మండనమిశ్రాదుల సమకాలీనుడు. కుమారిలుడు ఈతని వాదములను నిరాకరించెనని శాంతరక్షితుని తత్త్వసంగ్రహమువలన దెలియవచ్చును. అకళంకుడు బహుశః రాష్ట్రకూటరాజగు సాహసతుంగుని యాస్థానమునందుండియుండును. ఇతని వైదుష్య మిట్లు కీర్తింపబడినది:

"తారా యేన వినిర్జితా ఘటకుటీ
గూఢావతారాసమం
బౌద్ధై ర్యోధృతపీఠపీడితకుదృ
గ్దేవాత్త సేవాంజలిః,
ప్రాయశ్చిత్తమి వాంఘ్రి వారిజరజః
స్నానంచ యస్యాచరత్
దోషాణాం సుగత స్స కస్య విషయో
దేవాకళంకః కృతీ.

య స్యేద మాత్మనో౽నన్యసామాన్య నిరవద్య విద్యావిభవోపవర్ణన మాకర్ణ్యతే:

రాజన్ సాహసతుంగ సంతి బహవః
శ్వేతాతపత్రా నృపాః
కింతు త్వత్సదృశా రణే విజయిన
స్త్యాగోన్నతా దుర్లభాః,
తద్వ త్సంతి బుధా న సంతి కవయో
వాదీశ్వరా వాగ్మినో
నానాశాస్త్రవిచార చాతురధియః
కాలే కలౌ మద్విధాః.

రాజన్ సర్వారిదర్ప ప్రవిదళనపటుః
త్వం తథా౽త్ర ప్రసిద్ధః
తద్వత్ ఖ్యాతో౽హ మస్యాం భువి నిఖిలమదో
త్పాటనః పండితానాం,
నోచే దేషో౽హ మేతే తవ సదసి తదా
సంతి సంతో మహాంతో
వక్తుం య స్యాస్తి శక్తి స్స వదతు విదితా
శేషశాస్త్రో యది స్యాత్.

నాహంకార వశీకృతేన మనసా
న ద్వేషిణా కేవలం
నైరాత్మ్యం ప్రతిపద్య నశ్యతి జనే
కారుణ్య బుద్ధ్యా మయా,

రాజ్ఞః శ్రీహిమశీతలస్య సదసి
ప్రాయో విదగ్ధాత్మనాం
బౌద్ధౌఘాన్ సకలాన్ విజిత్య సఘటః
పాదేన విస్ఫాటితః."

ఇట్లకళంకుడు బౌద్ధాదులను వాదములో జయించినను పరమత సహిష్ణుడయి యుండెనని క్రిందిశ్లోకము చెప్పుచున్నది.—

"యో విశ్వం వేదవేద్యం జననజలనిధే
ర్భంగినః పారదృశ్వా
పౌర్వాపర్యావిరుద్ధం వచన మనుపమం
నిష్కళంకం యదీయమ్,
తం వందే సాధువంద్యం సకలగుణనిధిం
ధ్వస్తదోషం ద్విషంతం
బుద్ధం వా వర్ధమానం శతదళనిలయం
కేశవం వా శివం వా."

ఇతని గ్రంథములు అష్టశతీ, లఘీయస్త్రయ, స్వరూప సంబోధన, న్యాయవినిశ్చయ, అకళంకాష్టకాదులు. ప్రమాణప్రమేయవిచారమందు జైనులకు ఈ గ్రంథములు ముఖ్య మయినవి.

అకళంకుని శిష్యులందు విమలచంద్రుడు ప్రసిద్ధుడు. ఇతనికి పాత్రకేసరి, విద్యానంది (అథవా విద్యానంద) అను నామము లుండెను. అహిచ్ఛత్రమునందు బ్రాహ్మణ మతమును త్యజించి జైను డాయెను. బహుశః రాష్ట్రకూటుల రాజధాని యగు మాన్యఖేటమునందు పరవాదులను జయించెను.

"విమలచంద్రమునిర్గురు
ప్రశమితాఖిల వాదిమదంపదమ్,
యది యథావ దవైష్ణవపండితైః
నను తదాన్వవదిష్యత వాగ్విభోః.

తథాహి—యస్యాయ మాసాదితపరవాదిశోకః పత్రాలంబనశ్లోకః.—

పత్రం శత్రుభయంకరోరు భువన
ద్వారే సదా సంచరన్
నానారాజకరీంద్రబృంద తురగ
వ్రాతాకులే స్థాపితమ్,
శైవాన్ పాశుపతాన్ తథాగత సుతాన్
కాపాలికాన్ కాపిలాన్
ఉద్దిశ్యోద్ధృతచేతసా విమల చం
ద్రాశాంబరే ణాదరాత్.

..................................

మహిమా సపాత్రకేసరి
గురోః పరం భవతి యస్య భక్త్యాసీత్,
పద్మావతీసహాయా
త్రిలక్షణకదర్థనం కర్తుమ్."

ఈ త్రిలక్షణవాదముచే పాత్రకేసరి, ధర్మకీర్తి త్ర్యంశ హేతువాదమును నిరాకరించెను. ఈ త్రిలక్షణ వాదము శ్లోకవార్తికమందు, శాంతరక్షితుని తత్త్వసంగ్రహమునందు నుక్తమయినది.

"నాన్యథాఽనుపపన్నత్వం యత్ర తత్ర త్రయేణ కిం?
అన్యథాఽనుపపన్నత్వం యత్ర తత్ర త్రయేణ కిమ్?"

విమలచంద్రపాత్రకేసరి గ్రంథములు-అష్టసహస్రి, తత్త్వార్థశ్లోక వార్తికాలంకారము, ఆప్తపరీక్ష, పత్రపరీక్ష, ఇత్యాదులు. వీనియందు శబర, ఉపవర్ష, భర్తృహరి, సురేశ్వర, ధర్మకీర్తి, ఉద్యోతకర, కుమారిల, ప్రభాకర, వరాహమిహిరాదుల మతములే కాక, పురుషాద్వైతము, జాతివాదము, నిరాలంబవాదము, వృధవైశేషిక, బ్రహ్మాద్వైత, పాశుపత, సాంఖ్య, వైష్ణవ మతములు పరీక్షింపబడినవి. ఇట్లు విద్యానంది, సురేశ్వరాచార్యులు, సర్వజ్ఞాత్మ, ధర్మకీర్తి, భర్తృహరి వీరి సమకాలీనుడై యుండి బ్రహ్మసూత్రములందలి జైనమత నిరసన సూత్రములకు ప్రతిగ్రంథములను వ్రాసి స్యాద్వాదము నుద్ధరించెను. (Annals; Bhandarkar Oriental Institute, Vol. xii, p. 1.)

విద్యానంది సహాధ్యాయులగు మాణిక్యనంది (రత్ననంది) పద్మనంద్యాచార్యులు పరీక్షాముఖ సూత్రములను ఏకత్వసప్తతి గ్రంథములను రచించిరి. వీరిశిష్యుడగు ప్రభాచంద్రుడు బాల్యమున అకళంకు నాశ్రయించి యుండెను.

"బోధః కోప్యసమః సమస్తవిషయం
ప్రాప్యాకలంకం పదం
జాతస్తేన సమస్తవస్తు విషయం
వ్యాఖ్యాయతే తత్పదమ్,
కిం నశ్రీగణభృజ్జినేంద్రపదతః
ప్రాప్తప్రభావస్స్వయమ్,
వ్యాఖ్యాత్యప్రతిమం వచో జినపతేః
సర్వాత్మ భాషాత్మకమ్."

ఇతఁడు ధారా నగరమున భోజరాజు నాస్థానమున నుండెనని కొన్ని గ్రంథములు చెప్పుచున్నవి. అయితే అనేక నిదర్శనములచే బహుశః క్రీ. శ. ౮-వ శతాబ్దమం దుండెనని నిర్ధరింపవచ్చును. ఇతఁడు తనగురువుల నిట్లు స్తుతించినాఁడు:

"గురుః శ్రీనందిమాణిక్యో నందితా శేషసజ్జనః,
నందకా ద్దురితైకాంత రజాగమమతార్ణవః.

శ్రీపద్మనంది సిద్ధాంతి శిష్యోఽనేకగుణాలయః,
ప్రభాచంద్ర శ్చిరం జీయాత్ రత్ననందిపదే రతః.

గంభీరం నిఖిలార్థగోచర మలం
శిష్యప్రబోధప్రదమ్
యద్వ్యక్తం పద మద్వితీయ మఖిలం
మాణిక్యనంది ప్రభోః,
తద్వ్యాఖ్యాత మదో యథావగమతః
కించి న్మయా లేశతః
స్థేయా చ్ఛుద్ధధియాం మనోరతియుతే
చంద్రార్క తారావధి.

మోహధ్వాంతవినాశనో నిఖిలతో
విజ్ఞానశుద్ధిప్రదో
మేయానంతవిభోః విసర్పణపటు
ర్వస్త్వూక్తిభాభాసురః,
శిష్యాబ్జప్రతిబోధనః సముదితో
యోఽద్రేః పరీక్షాముఖా
జ్జీయా త్సోఽత్ర నిబంధ ఏష సుచిరం
మార్తాండతుల్యోఽమలః."

ప్రభాచంద్రుడు న్యాయకుముదచంద్రోదయము, ప్రమేయకము, మార్తాండము నను గ్రంథములను వ్రాసెను. ఇదిగాక శాకటాయనజైన వ్యాకరణమునకు న్యాసమును రచించెను.

"చిత్రం ప్రభాచంద్ర ఇహ క్షమం యాం
మార్తాండ వృద్ధౌ నితరాం వ్యదీపాత్.

......న్యాయకుముద చంద్రోదయ కృతే నమః,
శాకటాయన కృతన్యాస సూత్రకర్త్రే వ్రతీంద్రవే."

శాకటాయను డమోఘవర్ష నృపతుంగుని యాస్థానమున నుండి తన వ్యాకరణమునకు తానే అమోఘవృత్తిని వ్రాసెను. ఆ గ్రంథమునందు నృపతుంగుడు "దేవు" డని సంబోధింపబడినాడు. ఇట్లు ముఖ్యముగ జైనేంద్ర శాకటాయన వ్యాకరణములు కర్ణాటకదేశమునందే రచింపబడెను.

రాష్ట్రకూట చక్రవర్తి యగు అమోఘవర్షుడు స్వయముజైనుడయి జైనపండితులకు ప్రోత్సాహమిచ్చెను. కొంచెము పిదప గోవిందుని కాలమున ప్రథమ జినసేనుడు క్రీ. శ. ౭౮౩-వ సంవత్సరమునందు హరివంశ పురాణమును, వర్ధమానపురమునందలి పార్శ్వనాథ జినాలయమున పూర్తి చేసెను.

"శాకే ష్వబ్దశతేషు సప్తసు దిశం
పంచోత్తరే షూత్తరాం
పాతీంద్రాయుధనామ్ని కృష్ణనృపజే
శ్రీవల్లభే దక్షిణాం,
పూర్వాం శ్రీమదవంతి భూభృతి నృపే
శ్రీవత్సరాజోఽపరామ్
సౌర్యాణా మధిమండలం జయయుతే
వీరే వరాహోఽవతి.

కల్యాణైః పరివర్ధమానవిపుల
శ్రీవర్ధమానే పురే
శ్రీపార్శ్వాలయ నన్నరాజవసతౌ
పర్యాప్త శేషః పురా,
పశ్చాద్దోస్తటికాప్రజాప్రజనిత
ప్రాజ్యార్చనా వర్చనే

శాంతే శాంతిగృహే జినేశ్వరచితో
వంశో హరీణా మయమ్."

హరివంశ గ్రంథాదియందు వీరసేన గురు, అరిష్టనేములను గీర్తించినాడు. బహుశః ఈ వీరసేనుడు రెండవ జినసేనునిచే గొనియాడబడినవాడే యగును.

"శ్రీవీరసేన ఇత్యాత్త భట్టారక పృథుప్రథః,
స నః పునాతు పూతాత్మా కవిబృందారకో మునిః.
లోకవిత్త్వం కవిత్వంచ స్థితం భట్టారకే ద్వయమ్,
వాఙ్మితా వాగ్మితా యస్య వాచా వాచస్పతేరపి."

అమోఘవర్ష నృపతుంగుడు స్వయం జైనుడు. కన్నడమున కవిరాజమార్గమును, సంస్కృతమున ప్రశ్నోత్తరరత్నమాలికను రచించెను. బాల్యమున శాకటాయన మహావీరులశిష్యుడు. మహావీరాచార్యుడు విద్యానందుని శిష్యుడు గణితసార సంగ్రహమును రచించెను.

"విధ్వస్తైకాంతపక్షస్య స్యాద్వాదన్యాయవేదినః,
దేవస్య నృపతుంగస్య వర్ధతాం తస్య శాసనమ్."

ఇదేకాలమున ఉగ్రాదిత్యుడు కల్యాణకారకమను వైద్యగ్రంథమును వ్రాసెను. అమోఘవర్షుని గురువగు రెండవజినసేనుడు ఆదిపురాణము, పార్శ్వాభ్యుదయము, జయధవళ, జినేంద్రస్తుతి, వర్ధమానపురాణము అను గ్రంథములను రచించెను. పార్శ్వాభ్యుదయమునందు కాళిదాసుని మేఘసందేశవాక్యములను సమస్యాపూర్తి క్రమముగా పార్శ్వనాథుని చరిత్రము వర్ణింపబడినది.

"యస్య ప్రాంశునఖాంశుజాల విసర
ద్ధారాంత రావిర్భవత్
పాదాంభోజరజః పిశంగముకుట
ప్రత్యగ్రరత్నద్యుతిః,
సంస్మర్తా స్వ మమోఘవర్ష నృపతిః
పూతోఽహ మద్యే త్యలం
స శ్రీమా జ్జినసేనపూజ్యభగవ
త్పాదో జగన్మంగలమ్."

రాష్ట్రకూట ద్వితీయకృష్ణునికాలమున జినసేనుని శిష్యుడగు గుణభద్రుడు ఉత్తరపురాణము, ఆత్మానుశాసనము, జీవంధరచరితము ఇత్యాది గ్రంథములను బంకాపురమునందు రచించెను.

"ధర్మః కశ్చి దిహాస్తి నైత దుచితం
వక్తుం పురాణం మహత్
శ్రావ్యః కింతు కథా త్రిషష్టిపురుషా
ణామ్ చరిత్రార్ణవః,
కోఽప్యస్మిన్కవితాగుణోఽస్తి కవయోఽ
ప్యేత ద్వచోఽజ్జాలయః
కోఽసౌ యత్ర కవిః కవీంద్రగుణభ
ద్రాచార్యవర్యః స్వయమ్."

శ్రీపాలత్రైవిద్యుడు, లోకసేనుడు ఈకాలముననే యుండిరి.

కృష్ణరాజు సంబంధి యగు గంగబూతుగ, రాచమల్ల, మారసింహులు జైనులు. వాదిఘంఘళముంజళార్యుడనువాడు బ్రాహ్మణమతమునువిడిచి జైనుడయి చక్రవర్తి కటకమునందు రాజునకు, మారసింహునికి గురువుగా నుండెను. దండి కావ్యాదర్శమున కొక్కవ్యాఖ్యను, జ్యోతిషగ్రంథమగు లఘుమానసమును వ్రాసెను. కృష్ణరాజు నాస్థానమున పరవాది మల్లుడు జయముగాంచెను.

"ఘటవాది ఘటాకోవిదః కోవిదాం ప్రవాక్,
పరవాది మల్లదేవో దేవఏవ న సంశయః.

యే నేయ మాత్మనామధేయ నిరుక్తి రుక్తా నామ పృష్టవంతం కృష్ణరాజం ప్రతి.—

గృహీతపక్షాదికరః పరః స్యాః,
తద్వాదినః తే పరవాదిన స్స్యుః,
తేషాం హి మల్లః పరవాది మల్లః
తన్నామ మన్నామ వదంతి సంతః."

మారసింహుని సేనాపతియగు చాముండరాయడు కన్నడమున చాముండరాయ పురాణమును, సంస్కృతమున చారిత్రసారమును, వీరమార్తాండి అను వ్యాఖ్యను వ్రాసెను. శ్రవణబెళగుళమున గొమ్మటవిగ్రహమును స్థాపించి గొమ్మటరాయడను బిరుదు వహించెను. ఈతని

గురువులు నేమిచంద్ర, అజితసేన, జినసేన భట్టారకులు. నేమిచంద్రుడు చాముండరాయ బోధనార్థము గొమ్మటసారము, కర్మకాండము ఇత్యాదిగ్రంథములను రచించెను.

"గొమ్మటసంగహసుత్తం
గొమ్మటసిహరువరి గొమ్మటజిణోయ
గొమ్మటరాయవిణిమ్మియ
దఖ్ఖిణ కుక్కుటో జిణోజయఉ.

గొమ్మటసుత్తల్లిహణే-గొమ్మటరాయేణ యా కయా దేసీ
సారాఓ చిరం కాలం-ణామేణ య వీరమత్తండీ."

ఇదేకాలమున ఆర్యసేన, అజితసేన, అభయనంది, ఇంద్రనంద్యాచార్యు లుండిరి. ఇంద్రనంది జ్వాలామాలినీ కల్పము, సమయభూషణము మొదలగు గ్రంథములు వ్రాసెను. రాష్ట్రకూట కృష్ణుని సామంతుడగు అరికేసరి పుత్రుడు నాగరాజు నాస్థానమున సోమదేవుడు యశస్తిలకచంపూగ్రంథమును క్రీ. శ. ౯౫౩ నందు రచించెను.

రాష్ట్రకూట సామ్రాజ్యపతనానంతరము కల్యాణిచాళుక్యులు జైనపండితులను పోషించిరి. శ్రుతబిందు, కర్మప్రకృతి, శ్రీపాలత్రైవిద్యులు గ్రంథములు వ్రాసిరి. ఆహవమల్ల ఇటీవబెడంగునికాలమున వీరనంది చంద్రప్రభచరితను రచించెను. ఇమ్మడి జయసింహుని యాస్థానమునందు హేమసేనవిద్యాధనంజయుడు, వాదిరాజు, వాదీభసింహ ఒడయదేవులు ప్రఖ్యాతిగాంచిరి.

"తర్కే వ్యాకరణే కృతశ్రమతయా
ధీమత్తయాఽప్యుద్ధతో
మధ్యస్థేషు మనీషిషు క్షితిభృతా
మగ్రే మయా స్పర్ధయా,
యః కశ్చి త్ప్రతివక్తి తస్య విదుషో
వాగ్గేయభంగం వరం
కుర్వేఽ వశ్యమితి ప్రతీహి నృపతే
హే హైమసైనం మతమ్."

దయాపాలుడు రూపసిద్ధి యను వ్యాకరణ గ్రంథమును రచించెను. వాదిరాజు ఇట్లు స్తుతింపబడినాడు:

"త్రైలోక్యదీపికా వాణీ
ద్వాభ్యా మేవోదగా దిహ,
జినరాజత ఏకస్మాత్
ఏకస్మాత్ వాదిరాజతః.

ఆరూఢ్యాంబర మిందుబింబరచితౌ
త్సుక్యం సదా యద్యశః
ఛత్రం వాక్చమరీజరాజిరచయోఽ
భ్యర్ణం చ మత్కర్ణయోః,
సేవ్యః సింహసమర్చ్యపీఠవిభవః
సర్వప్రవాదిప్రజా
దత్తోచ్చై ర్జయకార సారమహిమా
శ్రీవాదిరాజో విదామ్.

శ్రీమచ్చాళుక్యచక్రేశ్వర జయకటకే
వాగ్వధూజన్మభూమా,
నిష్కాండం డిండిమః పర్యటతి పటురవో
వాదిరాజస్య జిష్ణోః,
జహ్యుద్యద్వాదదర్పో జహిహి గమకతా
గర్వభూమా జహీహి
వ్యాహారేర్ష్యో జహీహి స్ఫుట మృదుమధుర
శ్రావ్యకావ్యావలేపః.

పాతాళే వ్యాళరాజో వసతి సువిదితం
యస్య జిహ్వాసహస్రం
నిర్గంతా స్వర్గతోఽసౌ న భవతి ధిషణో
వజ్రభృ ద్యస్య శిష్యః,
జీవేతాం తావదేతౌ నిలయబలవశా
ద్వాదినః కోత్ర నాన్యే
గర్వం నిర్ముచ్య సర్వం జయిన మినపభే
వాదిరాజం నమంతి.

వాగ్దేవీం సుచిరప్రయోగ సుదృఢ
ప్రేమాణ మన్యాదరాత్
ఆదత్తే మమ పార్శ్వతోఽయ మధునా
శ్రీవాదిరాజోమునిః,
భోభో పశ్యత పశ్య తైష యమినాం
కిం ధర్మ్య ఇత్యుచ్చకైః

# తిరుపతి చిత్రములు

(శ్రీ యమ్. డి. సౌందరరాజన్ తీసిన ఫొటోలు)



౧. పాపనాశన తీర్థము



౨. చంద్రగిరిత్రోవలోని కొలను



3. శ్రీ వేంకటేశ్వరాలయము



౪. స్వామి పుష్కరిణియందలి మంటపము



౫. గరుడసేవ

అబ్రహ్మణ్యపరాః పురాతనమునే
ర్వ్యాఖ్యాతయః పాంతు వః."

అయితే లకులీశ్వరపండితుడను వాదిరుద్రగణుడు వాదిరాజ, వాదీభసింహ, అభయచంద్రులను జయసింహుని యాస్థానమున నోడించెనని చెప్పుకొనియున్నాడు.

'వాదీభసింహ శరభం
వాదిరాజముఖముద్ర నయవాది దిశాపట్టమ్
అకళంక త్రిపురదహన
త్రిణేత్రం అభయచంద్రకాలానలమ్.'
(Sk. 126, E. C. VII.)

వాదిరాజు న్యాయవినిశ్చయ వివరణము, ఏకీభావ స్తోత్రము, యశోధర్మచరితము, పార్శ్వనాథచరితము మున్నగు గ్రంథములను రచించెను.

"శ్రీమత్సింహమహీపతేః పరిషది
ప్రఖ్యాత వాదోన్నతిః
తర్కన్యాయతమోపహోన్నతగిరిః
సారస్వత శ్రీనిధిః,
శిష్యః శ్రీమతిసాగరస్య విదుషాం
పత్యుః తపశ్శ్రీభృతాం
భర్తుః సింహపురీశ్వరో విజయతే
స్యాద్వాదవిద్యాపతిః."
(న్యాయవినిశ్చయ వివరణము.)

"లక్ష్మీవాసే వసతి కటకే కట్టగాతీరభూమౌ
కామావాప్తి ప్రమదసుభగే సింహచక్రేశ్వరస్య,
నిష్పంతోయం నవగససుధా స్యంది సింధుప్రబంధో
జీయాదుచ్చైర్జినపతిభవ ప్రక్రమక్రాంతపుణ్యః."
(పార్శ్వనాథ చరితము.)

వాదీభసింహుడు గద్యచింతామణిని నక్షత్రచూడామణిని వ్రాసెను. ఇతనికి ఒడయదేవుడని బిరుదుండెను.

"శ్రీమద్వాదీభసింహేన గద్యచింతామణిః కృతః
స్థేయా దొడయదేవేన చిరా దాస్థానభూషణః
స్థేయా దొడయదేవేన వాదీభహరిణా కృతా
గద్యచింతామణి ర్లోకే చింతామణిరివాపరః."

శ్రీవిజయుడు గంగరాజుచే బూజితు డాయెను. ఇతనిపాండిత్య మిట్లు వర్ణింపబడినది :

"గంగావనీశ్వర శిరోమణి బద్ధసంధ్యా
రాగోల్లసచ్చారునఖేందులక్ష్మీః,
శ్రీశబ్దపూర్వ విజయాంత వినూత్ననామా
ధీమా నమానుషగుణోఽప్రతిమ ప్రమాంశుః.

యద్విద్యాతపసః ప్రశస్త ముభయం
శ్రీహేమసేనే మునౌ
ప్రాగాసీ త్సుచిరాభియోగబలతో
నీతం పరా మున్నతిం,
ప్రాయః శ్రీవిజయే తదేత దఖిలం
తత్పీఠికాయాం స్థితే
సంక్రాంతం కథ మన్యథా నతిచిరా
ద్విద్యావృగీదృక్ సః."

హొయ్సళవినయాదిత్యుని పోషణయందు అవిద్ధకర్ణ పద్మనంది, రత్ననంది, కమలభద్ర, కనకసేన వాదిరాజ, దయాపాల పండిత, శాంతిదేవు లుండిరి. శాంతిదేవు డిట్లు కీర్తింపబడినాడు :

"యస్యోపాస్య పవిత్రపాద కమల
ద్వంద్వంనృపో హొయ్సళో
లక్ష్మీం సన్నిధి మానయ త్స వినయా
దిత్యః కృతాజ్ఞాభువః,
క స్తస్యార్హతి శాంతిదేవయమినః
సామర్థ్య మిత్థం తథే
త్యాఖ్యాతుం విరళాః ఖలు స్ఫురదురు
జ్యోతిర్దశాః తాదృశాః.

స్వామీతి పాండ్య పృథివీపతినా విస్పష్ట
నామాప్తవృష్టివిభవేన నిజప్రసాదాత్,
ధన్య స్స ఏవ ముని రాహవమల్లభూభృత్
ఆస్థానికా ప్రథితశబ్ద చతుర్ముఖాఖ్యః."

విష్ణువర్ధనునికాలమున గుణసేన, అజితసేన, శాంతినాథ, సరస్వతీముఖముకుర, ప్రభాచంద్ర, కుమారసేన, మల్లిషేణ మలధారి, నరేంద్రసేన, నయసేన, జినసేన iii.

ఇత్యాదులు గ్రంథములను రచించిరి. జినసేనుడు అలంకారచింతామణిని; మల్లిషేణ మలధారి మహాపురాణమును, సాగరకుమారచరిత్రను వ్రాసిరి. ఈ ప్రథమ మల్లిషేణుడు క్రీ. శ. ౧౦౮౭ లో నుండెను. రెండవ మల్లిషేణుడు క్రీ. శ. ౧౧౨౮ నం దుండెను.

హొయ్సళరాజ్యానంతరము విజయనగరసామ్రాజ్యమున కృష్ణదేవరాయల యాస్థానమునందు అభినవవాది విద్యానందుడు పరవాదుల నోడించి, రాయలచే జయపత్రమును గొనెను. శ్రీరంగరాయలకాలమందు భట్టాకలంకుడు ప్రసిద్ధికాంచెను.

ఇట్లు రెండువేలేండ్ల నుంచి యనన్యపాండిత్యవిలసితులగు జైనాచార్యులు మతగ్రంథము లనేకముగా రచించినదే గాక, వ్యాకరణ, జ్యోతిష, వైద్య, అలంకారశాస్త్రగ్రంథములను వ్రాసి గీర్వాణవాణినలంకరించిరి. రామానుజ, వీరశైవ, మాధ్వమతములు పదుమూడవశతాబ్దమునుంచి ప్రబలించి క్రమముగా జైనమతమునకు రాజపోషణమును దప్పించినందున జైనసాహిత్యము క్షీణించెను. మన సంస్కృతపండితులు బ్రాహ్మణ సంస్కృతగ్రంథములకే ప్రాశస్త్య మిచ్చి జైనసాహిత్యమును కన్నెత్తి చూడకయుండుట కేవల విషాదకరము. పైని వివరించినట్లు జైనులుకూడ సంస్కృతసాహిత్య వ్యవసాయము చేసినందున ప్రతి సంస్కృతపండితుడు తదుత్తమ గ్రంథావలోకనము జేయు టావశ్యక మని నామనవి.

---



సూర్యుడు

ఛాయాచిత్రకారుడు: శ్రీ వి. యస్. గోపాలదేశికాచారిగారు.

# మాయావిలాసము – ప్రభులింగలీల

బండారు తమ్మయ్యగారు

మాయన్ మాయలఁ బెట్టి, గొగ్గయను సన్మానించి, ముక్తాయికిన్
శ్రేయః ప్రాప్తి యొసంగి, రామయఁ గృపన్ జేపట్టి నిష్కర్మచ
ర్యాయుక్తిం బసవేశ్వరాదులను లింగైక్యానుసంధానులం
గా యోజించిన యల్లమప్రభుని వేడ్కం గొల్తు నశ్రాంతమున్.

భారతి భాద్రపదమాస సంచికలో బ్రహ్మశ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు, గంజాముజిల్లా పర్లాకిమిడి తాలూకా, తులగాము గ్రామ వాస్తవ్యుఁడగు తులగాన నీలకంఠకవి రచించిన "మాయావిలాసము" అను నముద్రిత గ్రంథమును గూర్చి వ్యాసము వ్రాయుచు నందలి యితివృత్తమును గుఱించి యిట్లు లిఖించిరి:—

"మాయావిలాసము నాలుగాశ్వాసముల శృంగార ప్రబంధము. కథ శైవపురాణములలోని యల్లముఁడను శివభక్తుని జితేంద్రియత్వమును, మహిమను వర్ణించునది. కథానాయకుఁడు మాత్రమే ప్రసిద్ధుఁడు కాని మిగిలిన పాత్రములన్నియుఁ గవికల్పితములే."

శాస్త్రిగారు కథానాయకుని ప్రసిద్ధి నాతని నామమునుబట్టి వినుటయేకాని దానిని తెలియించు సుప్రసిద్ధ గ్రంథమును దిలకించినట్లు కానరాదు. అల్లమునిలీలలను వర్ణించు ప్రఖ్యాతాంధ్రగ్రంథము ప్రభులింగలీల. అదియే నీలకంఠకవి రచించిన మాయావిలాసమునకు మూలము. అందలి కథైకదేశమును మాత్రము గయికొని యాతఁడీ ప్రబంధమును రచించినట్లు తోఁచుచున్నది. ఇందలిపాత్రములు శాస్త్రిగారు సెలవిచ్చినట్లు కవికల్పితములు గావు. అన్నియు మూలగ్రంథములోనివే. మూలకథ నెట్టిమార్పును లేకయే కవి యనువదించినాఁడు. వర్ణనావిశేషములు మాత్రమే కవిప్రజ్ఞావిలసితములు. శాస్త్రిగారి హెచ్చరిక ననుసరించి గ్రంథము నెవరైన ముద్రించెడివో వారి కుపకరించుటకయి మూలగ్రంథమగు ప్రభులింగలీల చరిత్ర మించుక వివరించుచున్నాఁడ.

ఆంధ్రభాషయం దున్న ప్రభులింగలీలలు రెండు. ఒకటి పిడుపర్తి బసవకవి పుత్రుఁడు సోమనాథకవి రచించిన ద్విపదకావ్యము. రెండవది సోమనాథుని తమ్ముఁడు పాలనార్యుని కుమారుఁడు పిడుపర్తి బసవప్ప రచించిన యైదాశ్వాసముల పద్యకావ్యము. *

గ్రంథమందు వర్ణింపఁబడిన యల్లమప్రభువు క్రీ. శ. 1160 ప్రాంతమున బసవేశ్వరుని కాలమున నెలసిన యొక నిర్వికార నిర్గుణమూర్తి. కన్నడములో "అల్ల" "ఇల్ల" యనునవి శూన్యార్థవాచకములు. అరబ్బీ భాషయందలి "అల్లా" శబ్దముగూడ నిట్టిదే.

అల్లమప్రభునకు మాయాకోలాహలుఁ డనుబిరుద మున్నది. కన్నడములో నీతఁడు రచించినట్లుగా శూన్య సంపాదనము, మంత్రమాహాత్మ్యము, షట్స్థల వచనములు, మంత్ర గోప్యపదములు, సృష్టివచనములు, బెడగిన వచనములు, కాలజ్ఞాన వచనములు, ప్రభుదేవర కందములు మున్నగు కృతులు గానవచ్చుచున్నవని కర్ణాటకకవిచరిత్ర నుడువుచున్నది.

---

* ఇందులో మొదటిదియే మొదట వెలసినది. అది 1918 సంవత్సరములో శ్రీ ముదిగొండ శంకరారాధ్యుల వారిచే వరంగలులో ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది. రెండవది యంతకుముందే 1901 సంవత్సరములోఁ దప్పులతడికగాఁ జెన్నపురిలో వంకాయల కృష్ణస్వామి సెట్టిగారిచేఁ బ్రకటింపఁబడినది. ఈరెండును గూడ మరలఁ బరిశుద్ధముగఁ బునర్ముద్రణము నందినట్లు గానరాదు.

పిడుపర్తి సోమనాథకవి తాను రచించిన ప్రభులింగలీలకు మూలము కన్నడములో చామరసు అను కవీంద్రుఁడు రచించిన గ్రంథమని తన కావ్యాంతమున నిట్లు వివరించినాఁడు:—

"సదమలపదవేది చామరసాదిఁ
పదములు వెయినూట పదునొకొండింటఁ
బ్రభులింగలీల యిర్వదినైదు గతుల
నభినవంబుగఁ జెప్పె నది తెనుఁగునను
పిడుపర్తి సోమనాభిధుఁడఁ జెప్పితిని
పుడమి భక్తుల కర్థములు తేటపడఁగ."

కన్నడ ప్రభులింగలీలకర్తయగు చామరసు క్రీ. శ. 1460 ప్రాంతమువాఁడని Rev. Kittel దొరగారు తమ కర్ణాట నిఘంటువునందు లిఖించిరి. పిడుపర్తి సోమనాథకవి క్రీ. శ. 1520 ప్రాంతమువాఁడని నా యభిప్రాయము.

ప్రభులింగలీల శివానుభవజ్ఞులకు నమృతప్రాయమైనది. వేదాంతగ్రంథములలో దీనిని మించినది లేదని పలువురు తత్త్వజ్ఞుల యభిప్రాయము. పిడుపర్తి సోమనాథకవి గ్రంథావతారికలోని యీక్రిందిపంక్తుల వలన గ్రంథప్రాశస్త్యము చదువరుల కించుక గోచరము కాఁగలదు:—

"ప్రభులింగలీలకుఁ బ్రతిఁ జెప్ప నరిది
యభవుభక్తిస్థితి కది యాలవాలఁ
మజ్ఞానతమమున కదియె దీపంబు
విజ్ఞానమున కది విహరణసీమ
అది షట్స్థలజ్ఞప్తి కావాసభూమి
అది శివయోగ విద్యానిధానంబు
సదమలసౌభాగ్య సదనంబు నదియుఁ
జిదచిద్వివేకవిశేషంబు నదియు
* * * *
మఱి యిది యొకకావ్యమాత్రంబు గాదు
వఱలెడు గురుమహేశ్వర లింగమూర్తి
లీలావిహారంబు లెస్సగా భక్త
లాలింపఁ డిందు మోక్షావాప్తి యగును
ప్రొద్దుపోకకు విని పోయెదు పట్టి
సుద్దులు గావు విశుద్ధులై విన్నఁ
దనుమనోధనముల తను లూడ్చి శివుని
నెనయ మహోపాయ మిది యని వినుఁడు
అన్నదమ్ములును బోట్లాడిన సద్దు
లెన్నెదుకథలు గా వింతులతోడి
విషయభోగంబుల వెతల వర్ణింప
విషమకావ్యము గాదు వివరించి చూడఁ
గడుపుకక్కుర్తికిఁ గర్మకాండంబు
తడయక పెట్టుతంత్రంబును గాదు
రణ మిందు నంతఃకరణములతోడ
ఘనశక్త్యతోడి సంబంధంబు సురత
మల చిదాకాశమయత్వంబు తృప్తి
విలసిల్లు నీకృతి వేడ్కతో వినుఁడు
సచ్చరిత్రుల సుప్రసంగంబు గాని
నిచ్చ నిచ్చలు జన్మనీరధిం గూలి
పొరలుచు దరిఁ జేరఁబోలేని హీన
నరకీటకముల వర్ణన మిది గాదు
కర్మాంధకార సంగతిఁ జిక్కి శైవ
ధర్మం బెఱుంగక తమ యిచ్చ నడచు
దుర్మదాంధులఁ జెప్పు దుష్కథ గాదు
నిర్మలశివభక్తి నిశ్రేణి మఱియు
భుక్తిముక్తుల నిచ్చు పుణ్యాపణ్యంబు
భక్తు లాలింపుఁ డీప్రభులింగలీల."

ఈగ్రంథమందలి భాగములకు గతులని పేరు. మూల గ్రంథమగు కన్నడకావ్యమును సోమనాథుని ద్విపద కృతియుఁ గూడ నిరువదియైదు గతులుగా రచింపఁబడినవి. వాని నామముల నిట నుదాహరించెదను. అందువలన నాయా గతులయందలి విషయములను స్థూలముగా నెఱుంగ నగును. 1. స్తుతి, 2. కైలాసవర్ణనము, 3. మాయపుట్టుక, 4. ప్రభువు విటవేషమున వచ్చుట, 5. మాయ నాడించుట, 6. విమల వచ్చుట, 7. ప్రభు వద్భుశ్య మగుట, 8. మాయ పార్వతియొద్దకుఁ బోవుట, 9. ప్రముఖులు వచ్చుట, 10. అక్కమహాదేవి

కథ, 11. గొగ్గయ్యకథ, 12. ముక్తాయికథ, 31. సిద్ధరామయ్యకథ, 14. ప్రభువు కళ్యాణపట్టణమునకు వచ్చుట, 15. మరుళశంకరునికథ, 16. ఇష్టలింగగతి, 17. అక్కమహాదేవిగతి, 18. ప్రాణలింగగతి, 19. గోరక్షుని గతి, 20. మునులగతి, 21. శూన్యసింహాసనగతి, 22. ప్రభువు శూన్యసింహాసనం బెక్కుట, 23. ఆరగింపు, 24. భావలింగగతి, 25. వీరశైవమహిమ. ఇందు మొదటి యొనిమిది గతులందలి కథను మాత్రము గయికొని నీలకంఠకవి తన "మాయావిలాసము"ను రచించినట్లు గానవగును. అల్లముని లోఁగొనలేక మాయ హతాశయై యవతారము చాలించి కైలాసమునకుఁ బోయిన తరువాత జరిగిన యల్లముని లీలలను నీలకంఠ కవి తన గ్రంథమున వర్ణింపలేదు. ఆతఁడు రచింపనెంచిన దొక్క మాయావిలాసమె కదా!

పార్వతియొక్క తామసికకళవలన మమకారుఁడను రాజునకు మోహినియను భార్యయందు మాయ జనించినట్లే యీశ్వరుని సాత్వికకళవలన నిరహంకారునకు సుజ్ఞాని యనెడు సుదతియందు అల్లముఁడు జనించెను. పెక్కుపాట్లఁబడియు మాయ యతనిని నిర్జింపఁజాలక వెడలిపోయిన కథ మాత్రమే "మాయావిలాసము"న నీలకంఠకవిచే వర్ణితము యినది. తరువాతికథయే ప్రభులింగలీలలో ముఖ్యమయినది. పెక్కురు భక్తులను వారి యజ్ఞానాహంకారములను బోనడంచి శివానుభవ రహస్యములను బోధించి యల్లముఁడు వారిని తరింపఁజేసిన విధము లవశ్యము గ్రహింపఁదగినవి. ఈ వ్యాసారంభమున నున్నపద్యము వీరశైవ ప్రపంచమున వాడుకలోనున్న యల్లమప్రభుని చాటుస్తుతి. దానిలో నాతని ముఖ్యలీలలు సంగ్రహముగాఁ జేర్కొనఁబడినవి.

"కథానాయిక పుట్టినయూరగు బసవశీపురంబును మధుకేశ్వరావాసమగు ముఖలింగమును గవి నివాసగ్రామమునకు దగ్గఱగానే యున్నవి." అని కూడ శ్రీసాంబమూర్తిశాస్త్రిగారు మాయావిలాసమందలి కథ కవికల్పితమే యను తమ యభిప్రాయమునకు సాధకముగాఁ గాఁబోలు వ్రాసినారు. కాని యీపురముయొక్క పేరు కూడ మూలగ్రంథములోనిదే యని మనవి చేయుచున్నాఁడ. వంశధారా నదీతీరమున ముఖలింగ క్షేత్రమందలి శివుఁడు మధుకేశ్వర నామమునఁ బరఁగుట సుప్రఖ్యాతమే. కాని దొరతనమువారు ప్రకటించిన "Alphabetical list of villages in the Districts and Taluks of the Madras Presidency" అను పుస్తకములో పర్లాకిమిడి తాలూకాలో బసవశియను గ్రామము నాకుఁ గానరాలేదు. అది యేదయిన ప్రధాన గ్రామమునకు శివారు గ్రామమయి యుండవచ్చుగదా. ఇంతకు మూలగ్రంథమగు కన్నడప్రభులింగలీలలోను, పిడుపర్తి సోమనాథుని ద్విపదకావ్యములోను గూడ నీబసవశీపురము మేరుపర్వతమునకు దక్షిణదిగ్భాగమున నున్న బెళ్లువలిసీమలోనిదని చెప్పఁబడినది.

"హరుఁడు వెల్లుగఁ బంప నమరోరగములు
పరిణామవార్తలు పచరింపుచుండఁ
దగినశైలమునకు దక్షిణమందుఁ
దగుబెళ్లువలిసీమ తనరారు నందు

*　*　*

ఆదేశమధ్యంబు నందుఁ జందురుని
మేదురకళలెల్ల మిళితమై యుండు
సదనమో కాక విశ్వంభరారమణి
వదనమో యన బసవశి యనుపురము."

మూల గ్రంథకర్తయగు చామరసు కర్ణాటుఁడుగాన నీ బెళ్లువలిసీమ, బసవశిపురము, మధుకేశ్వరాలయము నన్నియుఁగూడఁ గర్ణాటదేశమందలివేమో యని నా యనుమానము. అల్లముఁడు సంచరించినదిగూడ శ్రీశైల ప్రాంతముననేగదా. విజ్ఞులావిషయమును నిర్ణయింతురుగాక.

పాలకురికి సోమనాథుని ద్విపదబసవపురాణమునకు సంస్కృతభాషలోఁ బరివర్తన మేర్పడి వ్యాసప్రణీతమని లిఖింపఁబడినట్లు పిడుపర్తి సోమనాథుని ద్విపదప్రభులింగలీలకుఁగూడ నొక పరివర్తన మేర్పడి సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పినట్లు భవిష్యత్పురాణములోనిదిగాఁ జేర్కొనఁబడినది. దానిని షోలాపుర

వాస్తవ్యులును లింగాయతశ్రేష్ఠులు నగు కీ. శే. శ్రీ వారధి మల్లప్పగారి ద్రవ్యసాహాయ్యమున దేవనాగర లిపిలో మణూరు మఠాధ్యక్షులగు శ్రీమల్లికార్జునశాస్త్రి గారు ప్రకటించినారు. దానినిబట్టి తెనాలి వాస్తవ్యులు శ్రీయులగు చంద్రమౌళి శాస్త్రిగారు లోకవచనకావ్య మను సంగ్రహముగా రచించి 1922 సంవత్సరములోఁ బ్రకటించిరి. సంస్కృత బసవపురాణము స్కందాగ స్త్య సంవాదరూపమున రచింపఁబడి శ్రీబాదరాయణ మహర్షి ప్రణీత మని యుద్ఘాటింపఁబడినను నందలి యంత స్సాక్ష్యమును బట్టి యాగ్రంథము ఏలూరునందలి కందు కూరువారను నారాధ్య బ్రాహ్మణవంశ్యు లెవరో దానిని రచింపించియుందురని యేర్పడును. వివరములు వలయువారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి బసవ పురాణపీఠికను గాని, యాసంస్కృతగ్రంథమును గాని చూడఁదగును. గ్రంథప్రాశస్త్యమునో, ప్రామాణ్యమునో యుద్దేశించి యాధునిక రచనములయెడ నిట్టికల్పనలు గూర్పఁబడుట శోచనీయము. ఏగ్రంథమునకయినను ప్రాశస్త్య మందలివిషయాదులనుబట్టి యేర్పడును గాని యది సంస్కృతభాషలో నున్నంతమాత్రమునఁ గాని, పూర్వులపేరఁ బ్రకటితమయినంతమాత్రమునఁ గాని గలుగ నేరదు.

"పురాణమిత్యేవ న సాధు సర్వమ్,
న చాపి కావ్యం నవమి త్యవద్యమ్"

అను శ్రీ కాళిదాససూక్తి యెంతయు సత్యసమ్మ తము. ఈక్రింది సంగతులవలన భవిష్యత్పురాణాంతర్గత మని ప్రకటింపఁబడిన సంస్కృత ప్రభులింగలీల, పిడు పర్తి సోమనాథుని యాంధ్ర ద్విపదకావ్యమును బట్టి వెలసిన నవీనగ్రంథమని సువ్యక్తము కాఁగలదు పిడు పర్తిసోమనాథుఁడు తన గ్రంథమును నెల్లూరు రామలిం గయ్య యను వైశ్యశిఖామణి ప్రేరణమువలన నాతని దీక్షాగురుఁడగు సిద్ధవీరదేశికుని స్తుతిపూర్వకముగ రచించి నాఁడు. గ్రంథావతారికను గూడఁదగును. మఱియుఁ బ్రతి గతిమొదటనుగూడ నాతనిఁ బేర్కొనుచు వచ్చి నాఁడు. మచ్చున క్రిందిపాదములు చిత్తగింపుఁడు:

"శ్రీసిద్ధ వీరదేశిక చక్రవర్తి
భాసురపదపద్మ భజనాభిరతులు,
పరభవంబులఁ బాఱఁబట్టి చిత్తాది
కరణంబులకు శుద్ధి గావించి మీఁద
మరణబాధలఁ బాసి మమతలఁ గోసి
పరమపరానందభరితులై నిత్య
ముక్తి గోరెడువారు మోహారిజిష్ణులు
భక్తు లాలింపుఁడీ ప్రభులింగలీల."
(2-వ గతి ప్రారంభము.)

ఈ సిద్ధవీరదేశికుఁ డెవరో తెలియక కాఁబోలుఁ బాపము సంస్కృత ప్రభులింగలీలకర్త కూడఁ దన గ్రంథాధ్యాయముల మొదట నాతనిని బేర్కొనుచుఁ దన రహస్యమును బట్టబయలు చేసికొన్నాఁడు. మచ్చున కొకటిరెండు తావులుమాత్ర ముదాహరించెదను:—

"శ్రీ సిద్ధవీర గురుపాద పయోజభక్త్యా
నిర్ధూత సంసృతిభయాః పరమానుభావాః,
శృణ్వంతు సర్వమునయ స్స్మృతిసౌఖ్యశీలాం
భక్తాః పదార్థవిమలాం ప్రభులింగలీలామ్.

శ్రీసిద్ధవీర గురుపాద సరోజయుగ్మే
భక్త్యా వినిర్జిత మహోర్జిత మోహపాశాః,
ముక్తీచ్ఛయా పరవిరక్తిపథం ప్రయాతాః
శృణ్వంతు సన్మునివరాః ప్రభులింగలీలామ్."

ప్రభులింగలీలాచరిత్ర విషయమున సత్య మందలి యభిమానముచే నిట్లు వ్రాయవలసి వచ్చినందులకుఁ బెద్ద లాగ్రహింపకుందురు గాక యని ప్రార్థించుచు నీవ్యాస మును ముగించుచున్నాను.

---

## ఉపహతి

పాటిబండ మాధవశర్మగారు

ప్రత్యగుదన్వదున్నతతరంగ మొకండు పురః కకుప్ప్రియా
పత్యము మ్రింగి త్రేన్చినది బంధురగాఢ తమస్సులన్ శుగు
న్నత్య ధరీకృతాశయుఁడ నావిపులాశ్రుకరాళ మైన హృ
త్సత్యపథమ్మునన్ బొడువఁజాలకపోయె నొకండు చుక్కయున్.

చాలితవిద్యుదక్షము దిశాప్రతిరోదితకర్కశారవో
ద్వేలము నైన యాప్రళయ భీషణతామసి యంబుముజ్మహో
త్తాలవినీలకైశికవితానమునన్ నను గప్పి కొంచు నా
భీలగళమ్ము నెత్తి విలపింపఁదొడంగె నిరంతరాశ్రువుల్.

బిరబిర జారిపోయినవి వెన్నెలయున్ జలియున్ దమంత శై
శిరచరమమ్మునందు వికసించిన లేఁతచివుళ్ల మెక్కి బొం
గురువడినట్టి గొంతు శ్రుతిగూర్చుచు నేమెలమావిమీఁదనో
పరభృత మొండు నైజమధువర్షిగళమ్మున సన్నసన్నగా—

తీయఁగ కూనరాగములు తీయఁగసాగెను, అంతలోన నే
యే మడనుండి వచ్చినదో యీ విలయాశనిఘోష; పాప మా
కోయిలపాట పొట్ట నిడుకొన్నది! యెన్నఁటికైనఁ గల్గునే
ఆయుషరుద్ధకంఠమున కంతటితీయఁదనమ్ము జన్మకున్.

నవనవహృష్యమాణ సుమనస్సుపరిమళితమ్ము, మల్లికా
సనమధురమ్ము, జీవితవసంతము రాకయు మున్న, ఈయకా
లవిలయకాలభీకరవలాహకలాస్యము విక్రమించె! ఇం
తవిషమమైన యీ బ్రతుకునన్ సుఖ మే మిఁక చూడఁగోరెదన్.

("మధుకణములు" నుండి.)



పూలబేరము

చిత్రకారుడు : కే. విశ్వనాథముగారు.

# సంస్కృత నాటకము

అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు, ఎం. ఏ.

## ౧. ఉత్పత్తి విచారము

గీర్వాణ వాఙ్మయమునందు దృశ్యకావ్యముల కున్న ప్రాధాన్యము చాల అధికమయినది. ప్రాపంచికవిఖ్యాతి నందిన శాకుంతలాదినాటకములవలననే గీర్వాణలౌకికవాఙ్మయముయొక్క గొప్పతనము లోకమునకు వెల్లడియయినది.

ఇట్టి గీర్వాణదృశ్యకావ్యముయొక్క ఉత్పత్తినిగుఱించి విచారింపఁబూనుకొన్నచో, ప్రప్రథమముననే రెండుప్రశ్నలు బయలుదేరుచున్నవి. గీర్వాణనాటకోత్పత్తి స్వతంత్రముగ నైనదా? లేక గ్రీకు మున్నగు పాశ్చాత్యదృశ్యవాఙ్మయసంపర్కమువలన నుద్భవమైనదా? అను నీ రెండు ప్రశ్నములకు సమాధాన మిచ్చుటలోనే సంస్కృతనాటకోత్పత్తివిచార మంతయు నిమిడియున్నది. సుప్రసిద్ధులగు ప్రాచ్యపాశ్చాత్యపండితు లీవిషయమున నుభయథా అభిప్రాయపడుచున్నారు. తమకుఁ దమకు లభించిన సాధనోపకరణములచేఁ దమతమవాదముల సిద్ధాంతీకరించుచున్నారు. వీబరు మొదలగు విద్యాధికులు గ్రీకుపరిచయమే భారతీయనాటకోత్పత్తికిఁ గారణమని నిర్ణయించుచుండ, కీత్తుమహాశయుఁడాదిగాఁ గల్గు ఆధునికతరవిమర్శకులు గీర్వాణనాటకము స్వతఃసిద్ధమయినదే యని వాద మొకటి నెలకొల్పి స్థిరపఱచుచున్నారు.*

### ‘ నాట్యవేదకథ ’

ఈసిద్ధాంతములమాట నటుంచి, మునుముందు నాట్యానుశాసకుఁడైన భరతమునిప్రోక్తమగు నాట్యవేదకథను గూర్చి యాలోచింపవలసి యున్నది. సాంప్రదాయికమగు నీ ఐతిహాసిక సిద్ధాంతము నాట్యశాస్త్రారంభముననే యిటులు చక్కఁగ వివరింపఁబడి యున్నది:

“ పూర్వం కృతయుగే విప్రా
వృత్తే స్వాయంభువేఽన్తరే,
త్రేతాయుగే సంప్రవృత్తే
మనో ర్వైవస్వతస్య చ.

గ్రామ్యధర్మే ప్రవృత్తే తు
కామలోభవశంగతే,
ఈర్ష్యాక్రోధాది సంమూఢే
లోకే సుఖితదుఃఖితే.

దేవదానవగంధర్వై
ర్యక్షరక్షోమహోరగైః,
జంబూద్వీపే సమాక్రాంతే
లోకపాల ప్రతిష్ఠితే.

మహేంద్రప్రముఖై ర్దేవై
రుక్తః కిల పితామహః,
క్రీడనీయక మిచ్ఛామో
దృశ్యం శ్రవ్యంచ య ద్భవేత్.

నచ వేదవ్యవహారోఽయం
సంశ్రావ్యః శూద్రజాతిషు,
తస్మాత్ సృజాపరం వేదం
పంచమం సార్వవర్ణికం.

—నాట్యశాస్త్రము, ప్రథమ అధ్యా. ౮-౧౨ శ్లో.

ఇటు లందఱును బ్రహ్మదేవుని నాట్య వేదము కొఱకై ప్రార్థింపఁగా నాసృష్టికర్తయు,

“ సర్వశాస్త్రార్థసంపన్నం
సర్వశిల్పప్రవర్తకం,

* ఈవ్యాసములోఁ జాలవఱకు కీత్తుఅభిప్రాయములే గ్రహింపఁబడి ఆయనవాదమే అంగీకరింపఁబడుచున్నది.

నాట్యాఖ్యం పంచమం వేదం
సేతిహాసం కరో మ్యహం."
—ప్రథమ అధ్యా. ౧౫ శ్లో.

అని ప్రతిజ్ఞచేసి,

"ఏవం సంకల్ప్య భగవాన్ సర్వవేదా ననుస్మరన్,
నాట్యవేదం తత శ్చక్రే చతుర్వేదాంగ సంభవం.
జగ్రాహ పాఠ్య మృగ్వేదా త్సామభ్యో గీత మేవచ,
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణా దపి."
—౧-వ అధ్యా. ౧౬, ౧౭ శ్లో.

ఇట్లు నాట్యవేదమును సృష్టించి విశ్వకర్మచే నొకనాట్య మండప నిర్మాణము సేయించి, అందు భరతుని నీ నూతన నాట్యకళను ప్రదర్శించవలసినదిగా నాజ్ఞాపించినాఁడు. దేవత లందఱు నిందులకై మిగులఁ బ్రీతి నందిరి. భరతుఁడును 'ధ్వజమహ' మను నింద్రవిజయోత్సవసమయమందు, 'అమృతమంథన' మను నాటక మప్సరసలు, గంధర్వులు, నారదుఁడు మున్నగువారిచే నాడించినాఁడు. సురాసురుల కలహప్రదర్శనసమయమున, అసురులు తమపరాజయప్రదర్శనమును సహింపఁజాలక, దేవతలపైఁ దిరుగఁబడిరి. కాని వెంటనే యింద్రధ్వజముచే వారెల్లరును హతులయిరి. తత్కారణముచే దీనికి 'జర్జర' యనుపేరు వచ్చినది. తదాది, రాక్షసాద్యనిష్టకారుల ఉపద్రవమునుండి రంగస్థలమును రక్షించుటకై రంగాధిష్ఠానదేవత లేర్పాటుచేయఁబడినారు.

బ్రహ్మచే నిటులఁ గల్పింపఁబడి భూలోకమున భరతునిచేఁ బ్రవర్తింపఁజేయఁబడిన యీనాట్యవేదము యొక్క గొప్పతన మిట్లు తెల్పఁబడినది:

"నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకం,
లోకవృత్తానుకరణం నాట్య మేత న్మయా కృతం.
ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయం,
హితోపదేశజననం ధృతిక్రీడాసుఖాదికృత్.
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వి [నాం,
విశ్రాంతిజననం కాలే నాట్య మేత న్మయాకృతం."
—ప్రథమా. ౧౧౨-౧౧౫ శ్లో.

ఈరీతిదే నాట్యోత్పత్తినిగుఱించిన మఱియొకకథ ప్రచారములో నున్నది. సామవేదమునుండి సంగీతవిద్య నుద్ధరింపఁజేసి బ్రహ్మ తనశిష్యులగు భరత నారద రంభా హూహూ తుంబురులకు నేర్పెను. అటుపై నారు పరమప్రీతి గాంచి, మహాదేవు నెదుటఁ దమకౌశలముం బ్రదర్శించిరి. ఆతని మెప్పు వడసి యీ అయిదుగురు నైదుసంహితల రచించిరి. రంభ యొక్క సంహిత స్వర్లోకమునకును, భరతసంహిత భూలోకమునకును, తుంబురు హూహూకృత సంహితలు రసాతలమునకును జెందిపోయినవి. భరతుఁడు నాట్యమును, నారదుఁడు వాద్యములను, రంభ నృత్తమును బ్రవర్తింపఁజేసిరి.

ఈపైవర్ణనమంతయుఁ బరిశీలించినచో, నిదియెల్ల నొక అపూర్వకల్పన యనియు, మిగిలినవిద్యలతోపాటు నాట్యవిద్యకుఁగూడ సముచితగౌరవము నిలుపుటకై యొనర్చిన యేర్పాటు గాక వేరు కాదనియు పాశ్చాత్యు లభిప్రాయపడుచున్నారు. భరతునికాలమున నాట్యవిద్యకు నైచ్యము గలిగినది. నటులను, దదితరకళోపాసకులను బహిష్కరించుచుఁ గొన్ని ప్రామాణికశ్రుతివాక్యములు, శాస్త్రవాక్యములు బయలుదేఱినవి. నటవిటగాయకులు పంక్తిబాహ్యు లయినారు. ఇది విచారించి భరతుఁ డీమచ్చను బోఁగొట్టుటకై క్రొత్తపోకడ పోయినాఁడు. దీనికెల్ల బ్రహ్మముఖమునుండి తాను లభించిన దానిఁగా నిరూపించినాఁడు. ఈనాట్యమునకు వేదత్వసిద్ధికై వేదసార మం దున్నదను నభిప్రాయము సూచించినాఁడు. క్రొత్తగా రచింపఁబడిన యీనాట్యవిద్య యందు లోకమున కాదరము గల్గుటకై దీనిని పంచమవేదమని పల్కినాఁడు.

ఇట్టి ఐతిహాసికములవలన నాటకోత్పత్తివిచారమున మన కెక్కువ లాభింపఁబోదు. కాని దీనివలన నొకవిషయమమాత్రము తేలుచున్నది. నాటకోత్పత్తి చాల ప్రాచీనకాలముననే సంభవించినదనియు, దైవాంశసంభూతులగు మహర్షులచేఁ బ్రవర్తింపఁ జేయఁబడినదనియు మాత్ర మిందువలన విశదమగుచున్నది.

### స్వతః ఉత్పత్తి

ఇఁక నాటకముయొక్క స్వతంత్రోత్పత్తిని గూర్చి విచారింతము. నాటకమునకు ముఖ్యమయినవి సంవాదము, గానము, అభినయము, అనుకృతి. ఇందులో సంవాద గానము లతిప్రాచీనములైనవి. సంవాదము ఋగ్వేదమునుండి లబ్ధము. ఋగ్వేదములోని సంవాదసూక్తములఁ బరికించినచో, నాటకస్వరూపమునకు బీజావాప మచటనే జరిగినదని గోచరించుచున్నది. "యమయమీ సంవాదన", "సరమా-పణి", "ఇంద్ర-మరుత్", "పురూరవస్-ఊర్వశీ" ఇత్యాదులన్నియు నేతాదృశములే. యజ్ఞయాగాదులు సలుపు సందర్భమున నిరుకక్ష్యలుగా నేర్పడి ఋత్విగ్వర్గ మీసంవాదసూక్తములఁ బఠింతురని 'మోక్షుముల్లరు' (MaxMuller) పండితుఁడు తెలుపుచున్నాఁడు.

గానము సామవేదమునుండి గ్రహింపఁబడియున్నదని యిదివఱకే తెల్పఁబడినది. అనుకృతి మనుష్యునకు స్వభావసిద్ధము. పురుషశిశువు తండ్రిచేష్టలను, స్త్రీశిశువు తల్లికృత్యముల ననుకరింప యత్నించుట మన మహరహము గాంచుచున్నదేగదా! ఇఁక నాల్గవది అభినయము. ఇది యనుకృతి విశేషము. ఇందులోఁ బలుకు లేక కేవల మంగవిన్యాసముచేతనే అభినయించుట నృత్య మనఁబడును. అనుకృతి యన్ననో, అంగవిన్యాసవేషభాషాదులచే నొనరింపఁ బడును. ఇవన్నియు సంపూర్ణముగ సమకూరినచో నాట్యమని పేరు.

ఏతాదృశ నాటకోత్పత్తి కారంభదశ వైదికయుగమే యని విమర్శకుల యాశయము. మతేతరప్రతిపాదకములగు ఋగ్వేద సంవాదసూక్తములు సంవాదగర్భితము లగుటంజేసి నాటకమునకుఁ బ్రధానాంగమగు సంవాద మీసూక్తములలోనే బీజప్రాయముగా నున్నదని నిరూపింపవచ్చును. ఋగ్వేదములో వలెనే వేదాంతరములందుఁ గూడ నాటక చిహ్నములఁ గొన్నిటిఁ గాంచలేకపోము. యజుర్వేదములో మతవిషయమే ప్రధాన మగుటచేత, సోమక్రయము, సోమదేవతాకస్తుతి ఇత్యాదులలోఁ గాననగుచున్నవి కొన్ని నాట్యోత్పత్తి బీజములు. క్రత్వాచరణకాలమున ఋత్విక్కులు నానాదేవతాత్వము తమయం దారోపించుకొని తద్దేవతా విశేషములతోఁ దాము తాదాత్మ్య మంది, అచ్చట వ్యవహరించుచున్నారు.* ఇది గాక, యీయజుర్వేదములో నొకచోట శైలూషపదము ప్రయోగింపఁబడియున్నది. కాని యింతమాత్రాన నిది నటపర్యాయమే యని నిష్కర్షించుటకు వలనుపడదు.

సామవేదములోని ఋక్కులన్నియు గేయమానములగుచున్నవి. కావున నీనాఁటికి నాటకద్వితీయాంగమగు గానము సిద్ధించినదనియే చెప్పనొప్పు. అథర్వవేదములో "వాదిత్రములు, తాళాద్యనుసారముగ నృత్యము సల్పుట–" ఇత్యాదివిషయములఁగూర్చి ప్రస్తావన యుంటం జేసి, మంత్రయుగములోనే నాటకబీజములు సంపూర్ణముగ మొలకలెత్తినవని నిర్ణయించుటకు సాధ్యమగుచున్నది.

బ్రాహ్మణయుగములోని నాట్యక్రీడ లన్నియు మతవిషయకములే. ఈయుగములో స్తుతిపరములగు మంత్రములకుఁ బ్రాధాన్యము తగ్గి, క్రతువులకుఁ, దక్కుంగల యాగవిషయకకర్మలకుఁ బ్రాముఖ్యము హెచ్చినది. ఇట్టివైదికకర్మకలాపములోని కొన్ని క్రియావిశేషములయందు నాటకలక్షణములఁ బరికింపవచ్చునని అధునాతను లాశించుచున్నారు. ప్రాక్కాలికములగు నిట్టికర్మభేదములలో 'సోమక్రయము', 'మహావ్రతము' ముఖ్యములు. మొదటిదగు సోమక్రయవిధానములో సోమరక్షకులగు గంధర్వులయొద్దనుండి సోమమును బడయుటయే మరల ననుకరింపఁబడుచున్నది కావున నిది యొక నాట్యక్రీడావిశేషమే యనఁజెల్లుననియు, నిట సంపూర్ణ నాటకత్వసిద్ధి లేకపోయినను, నాటకముయొక్క తొలి యావస్థ గాంచవచ్చుననియును కీత్తుపండితుఁడు నొడువుచున్నాఁడు.†

---

*Cf. Skt Drama & Dramatists, By Kulkarni, page 4.

†కీత్తుసంస్కృతనాటకము, పుట ౨౩.

రెండవదియగు మహావ్రతమువిషయ మాలోచింతము. ఇది హేమంతకాలము గడచినతర్వాత, అనఁగా శిశిరదృతువునం దాచరింపఁబడు నొకవికృతియాగము. ఇందుఁ బ్రధానాంశ మొక ఆర్ద్రశ్వేతచర్మఖండము నిమిత్తమై శ్వేతవర్ణుఁడగు - వైశ్యునికిని,* నీలవర్ణుఁడగు నొకశూద్రునికిని జరిగిన కలహాంర్ణనము. సాంఖ్యాయనారణ్యకమున నీవిషయము కలదు. ఆర్యులకు ననార్యులకును గల విరోధభావము ననుకరించుటయే యిద్దానికి ముఖ్యప్రయోజనమని ఊహించుట సమంజసమే యగుచున్నది.

ఈమహావ్రతాచరణకాలమున వర్షాగమునార్థము కన్య లంద అగ్నిచుట్టుఁ జేరి నృత్యము సల్పుగురని యున్నది. ఈసందర్భమున నొక 'బ్రహ్మచారి మాగధుఁడు'ను, ఒక 'పుంశ్చలి' యుఁ బరస్పరము సంభాషించుకొనుట విమర్శింపవలసి యున్నది. ఈయిరువురును బహునీచమైన సంభాషణ మొనర్పుటయు, నతినీచముగఁ బ్రవర్తించుటయుఁ గూడ, వైదికక్రియాచరణమునందుఁగూడ సంవాదము లౌకికరూపము దాల్చుచున్నదనవచ్చును. వైదికవిధు లొనర్చుపట్టులనే గానము, నృత్యము, స్వేచ్ఛావృత్తిసంభాషణ మున్నగునంశములందింతటిఆసక్తి గలదని తేలుచున్నదిగదా! దీనివలన లౌకికక్రియలసందర్భమున, నాటకాంగభూతములగు నీగానాదులం దెంతటి కూడదర మాయుగములోనిజనులకుఁ గలదో ద్యోతకమగుచున్నదిగదా! ఆలోచించినచో నిట్టియెడ నకార్కలమున జానపదనాట్యక్రీడావిశేషము లున్నట్టు గోచరించుచున్నది. కాషీతకిబ్రాహ్మణము లోని నృత్తాదులప్రశంస యీ విషయమునే బలపఱచుచున్నది.

వైదికక్రియాదులం దిట్టి అతిమాత్రమగు నీచసంభాషణాదు లుంటచేతనే మహర్షు లిదియెల్ల త్రైవర్ణ్యము వారికిఁ గూడదని నిషేధించుట తటస్థించినది. పారస్కర గృహ్యసూత్రమే† యిం ప్రమాణము. భారతకాలమునాఁటికిఁ గూడ నృత్యనాట్యాదికళలపైఁ గల నీచదృష్టి నశింపలేదు. కనుకనే ద్రౌపది శైలూషిగాను, ‡ రాముఁడు జాయాజీవిగాను § నిందింపఁబడినారు.

సూత్రకాలము నాఁటికి నాటకరచనాభ్యాసము పరిపూర్ణమై, అతివిస్తారమయి కూడ నుండవచ్చును. కావుననే తన్నాటకరచనకు లక్షణనిర్వచన మావశ్యకమయి శైలాలి, కృశాశ్వ లను లక్షణరచయితలు బయలుదేతినారు. పాణినీయాష్టాధ్యాయియే నటశబ్దము మొదటిసారి దృశ్యమానమగుచున్న ప్రాచీనతమమైన గ్రంథము. ఈవ్యాకరణశాస్త్రమున రెండుచోట్ల నాట్య ముత్పన్నమైనదని నుడువుట కాధారములు లభించుచున్నవి. ఆ రెండుసూత్రములివి:

"పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః (శైలాలినో నటాః—కాముదివృత్తి)." ౪. 3. ౧౧౦.

"కర్మందకృశాశ్వాదిభిః (కృశాశ్వినో నటాః)." ౪. 3. ౧౧౧.

సుప్రసిద్ధ గీర్వాణభాషావేత్తయగు లెవీయను ఫ్రెంచి విద్యాధికుఁ డీసూత్రములు రెండును "కృశించిన అశ్వములు గలవాఁడు," "శిలలే తల్పముగఁ గలవాఁడు" అను నర్థములందుఁ బరిహాసరూపముగ రచింపఁబడినవే కాని తతోఽధికముగ నెద్దానిని దెలుపఁజాలవని వచించుచు నేతదనుగుణముగ శైలాలిబ్రాహ్మణ నామమును దృష్టాంతీకరించుచున్నాఁడు.♦ నిజ మాలోచించినచో

* ఈ మహావ్రతము తైత్తిరీయసంహితలోఁగూడ (ఆఱవకాండము) వర్ణింపఁబడియున్నది కాని, యిచ్చట చర్మనిమిత్తకలహము బ్రాహ్మణునికి శూద్రునకు ననియున్నది.

† ii. 7. 3.

‡ విరాటపర్వములో ౧౬-వ అధ్యాయము, ౪3 శ్లోకము.

§ "స్వయంతు భార్యాం కౌమారీం చిరమధ్యుషితాం సతీం,
శైలూషఇవ మాం రామ పరేభ్యో దాతు మిచ్ఛసి." — అయోధ్యాకాండ, 3౦-వ సర్గ, ౮-వశ్లోక.

♦ Sylvian Levi: Indian Theatre, page 300.

నీతనిమత మాదరణీయము కాదు. ఈ చెప్పఁబోవునదియే యిట్లనుటకు హేతువు.

పాణిని ప్రయోగించిన నటశబ్దమువలన విశేష జ్ఞానము లభించుటలేదని కీత్తుయొక్క ఉద్దేశము. దీనివలన నాటకోత్పత్తియే స్పష్టముగా నిరూపింపఁబడుచున్నదని నిష్కర్ష చేసి చెప్పుటకుఁ దగిన యాధారములు లేవని ఆతఁడు నుడువుచున్నాఁడు. కాని యీవిషయమున కీత్తు చాల పొరపాటుపడినాఁ డనక తప్పదు. పాణిన్యాచార్యుఁడు నటధాతువును రెండుమూఁడు పర్యాయములు పఠించియున్నాఁడు.

భ్వాదిగణము:

నట-నృత్తే (౩౧౦-వ ధాతువు).

నట-నృత్తే (౮౭౨-వ ధాతువు).

చురాదిగణము:

నట-అవస్పందనే (అవస్పందనం నాట్యం).

ఈ రీతిగ భ్వాదిలోని నటధాతువు నొకేయర్థమున రెండు పర్యాయములు ప్రయోగించిన దానిలోని విశేషము కౌముదీకారుఁ డిట్లు వివరించుచున్నాఁడు:

"నట-నృత్తే-ఇత్యమేవ పూర్వమపి పఠితం, తత్రాయం వివేకః: పూర్వం పఠితస్య నాట్యమర్థః; యత్కారిషు నటవ్యపదేశః; వాక్యార్థాభినయో నాట్యం. ఘటాదౌతు నృత్యం నృత్తం చార్థః; యత్కారిషు నర్తకవ్యపదేశః; పదార్థాభినయో నృత్యం, గాత్రవిక్షేపమాత్రం నృత్తం......"

దీనినిబట్టి యాలోచించినచో, పాణిని యుద్దేశములో నొక నటధాతువునకుఁ బ్రకృత విషయమగు నాట్యమనియే అర్థమయినట్టు లూహించుట కభ్యంతరమేమియు లేదని తెల్లమగుచున్నది. ఇట్టిచోఁ బైతద్ధిత సూత్రములు నటసూత్రకారుల నుద్దేశించియే చేయఁబడె ననుట నిర్వివాదాంశము.

పాణినికాలముకంటె నధికతరమైన నాటకోత్పత్తి పతంజలికాలమునఁ గానవచ్చుచున్నది. క్రీ. పూ. ౧౫౦ సం. నాఁటివాఁడగు పతంజలిమహాముని నాట్యప్రశంసయే గాక, "కంసవధ", "బలిబంధనమ్" అను రెండు ప్రదర్శనములఁగూర్చి కూడఁ బేర్కొనియున్నాఁడు. ఇది చూడుఁడు:

'లజ్‌రూప' విచారణసందర్భమున "పరోక్షేచ లోకవిజ్ఞాతే ప్రయోక్తు ర్దర్శనవిషయే" అనువార్త్తికముపై వ్యాఖ్యానము సేయుచు నీభాష్యకారుఁడు "జఘాన కంసం కిల వాసుదేవః" అని ఉదాహరించియున్నాఁడు.

ఇటులనే వర్తమానకాలవిషయ మాలోచించుచు "ఇహతు కథం వర్తమానకాలతా కంసం ఘాతయతి, బలిం బంధయతీతి, చిరహతేచ కంసే చిరబద్ధేచ బలౌ?" అని శంకించుకొని యిటులు నుడువుచున్నాఁడు:

"అత్రాపి యుక్తా; కథం? ఏతావ దేతే శౌభికానామ ఏతే ప్రత్యక్షం కంసం ఘాతయన్తి ప్రత్యక్షం చ బలిం బంధయన్తీతి. చిత్రేషు కథం? చిత్రేష్వపి ఉద్గూర్ణాని పతితాశ్చ ప్రహారా దృశ్యన్తే కంసస్య కృష్ణస్యచ. గ్రంథికేషు కథం, యత్ర శబ్దగ్రంథనమాత్రం లక్ష్యతే? తేఽపిహి తేషాం ఉత్పత్తిప్రభృత్యావినాశాత్ బుద్ధీ ర్వ్యాచక్షాణా సతో బుద్ధివిషయాన్ ప్రకాశయన్తి. అతశ్చ సతో వ్యామిశ్రాహి దృశ్యన్తే. కేచిత్ కంసభక్తా భవన్తి, కేచి ద్వాసుదేవభక్తాః. వర్ణాన్యత్వంఖల్వపి పుష్యన్తి. కేచిత్ కాలముఖా భవన్తి, కేచిత్ రక్తముఖాః."*

ఇది యెల్లఁ బరికించినచో నాటకోత్పత్తి సంపూర్ణవికాసము నందినదనియు, నాటకప్రదర్శనము త్రేధా జరుగుచుండెననియు బోధపడుచున్నది.

౧. ఇందులో మొదటిది శోభనికు లొనర్చునది. ఇదియే నటకులు పాత్రధారణ మొనర్చి నాటకమాడుట యనఁదగినది. ప్రకృతకాలమున గ్రామములలో నచ్చటచ్చట జరుగుచుండు వీథినాటకములు, వీథి భాగవతము వంటివని తలఁపవచ్చును.

* iii. అధ్యాయము, ౧ వ పాదము, ౨౬ వ సూత్రము.

౨. రెండవది చిత్రప్రదర్శనము. రంగులు వేసిన బొమ్మలచేఁ గథను బ్రదర్శించుట. ఇది మనము మామూలుగాఁ జూచుచుండు బొమ్మలాట వంటిదే.

3. గ్రంథికులు లేక పాఠకులు (కథకులు) ఒనర్చునది. వీరేవిధమగు నాంగికాభినయము లేకయే కేవలము కథలను బ్రేక్షకులయెదుటఁ బఠింతురు. ఇక్కాలమందలి జంగము కథ, వీరుల కథ, హరికథా కాలక్షేపము మున్నగు వానితోఁ బోల్పవచ్చును.

పై భాష్యభాగములోని శౌభికపదమునకు నాట్యమాడువారలకు నేర్పువారలనియు, తన్నటులు లొనరించు నభినయాదులను బ్రేక్షకలోకమునకు వివరించు వారలనియు నన్వయము సెప్పఁ గొందఱు యత్నించుచున్నారు. కాని అది యంత యుక్తియుక్తముగఁ గన్పట్టదు. ఏలన, నట్టియెడ "ప్రత్యక్షం కంసం ఘాతయన్తి" అని యున్నదానిలోని ప్రత్యక్షపదమునకు వ్యర్థతా దోష మంగీకరింపవలసి వచ్చుచున్నది.

ఈ పై వర్ణించిన రీతిగ మూఁడు విధములుగా నాట్యప్రదర్శనము జరుగుచుండెడిది. ఇంతియ గాక, నాట్యమొకవృత్తిగఁ బరిణమించినట్లు, ఆనటవృత్తి నాధారము చేసికొని కొందఱు జీవించుచున్నట్లు, మహాభాష్యములో నీక్రింది సూత్రములు నిదర్శనము లగుచున్నవి.

"నటస్య శ్రుణోతి గ్రంథికస్య శ్రుణోతి." ౧. ౪. ౨౯.

"అగాసీ న్నటః." ౨. ౪. ౭౭.

"నటస్య భుక్తం." ౨. ౩. ౬౭.

"నట మాఘ్నానః." ౩. ౨. ౧౨౭.

ఇట్లు నాటక మొకటి రచింపఁబడి, నటులచేఁ బ్రదర్శింపఁబడెడి కథావస్తువు ఐతిహాసికమో లేక ప్రాకృతగాథలనుండి గృహీతమో అయియుండెడిది. ఇట్టికథ నెద్దానినో గ్రహించి, ప్రదర్శనానుకూలమొనర్చి, క్రతువు లొనర్చుపట్టులందు గ్రంథికులు పఠించుటయో, శోభికులు లభినయించుటయో ప్రవర్తిల్లుచుండెడిదని మనము నిశ్చయింపవచ్చును.

పతంజలిమహాభాష్యము నాఁటికి భారతము సంపూర్ణముగఁ బరిణమించినది. ఈభారతములోఁగూడ నాటకస్వరూపసిద్ధి పరిపుష్టి నందిన దనుటకు నిదర్శనములు పెక్కు గనుపించుచున్నవి. హరివంశములోఁ 'కంసవధ,' 'ప్రలంబవధ,' 'చాణూరమర్దనము' అను నాటకములు అప్సరసలచేఁ బ్రదర్శితము లయినవనియుఁ, బ్రదర్శనానంతరము నారదుఁడు సత్యభామా కృష్ణార్జున బలరామపాత్రములలో నొకదానిని దా ననుకరించి సభ్యుల హాస్యరసమగ్నులఁ గావించెననియుఁ జెప్పఁబడి యున్నది. శ్రీరామాయణమునందు నటనర్తకప్రశంస మాత్రమే గాక, నాటకసమాజములగుఱించిన ప్రసక్తియుఁ గలదు.

"నారాజకే జనపదే ప్రఘూతనటనర్తకాః,
ఉత్సవాశ్చ సమాజాశ్చ వర్ధంతే రాష్ట్రవర్ధనాః."
—అయోధ్యా. ౬౭-సర్గ, ౧౫-శ్లో.

ఇదే గ్రంథములో వ్యామిశ్రకమునుగూర్చి ప్రసంగింపఁబడి యున్నది.* రామాయణవ్యాఖ్యాత వ్యామిశ్రకమన సంస్కృతప్రాకృతగర్భిత మయిన రూపకవిశేషమని వివరించుచున్నాఁడు.

ఇట్లు మహాభారతకాలమునాఁటికే నాటక సమాజము లుండుటయు, రంగస్థలముమీఁద జంతువుల మల్లయుద్ధప్రదర్శనములు జరుగుచుండుటయు నిర్ధారింపఁబడుచున్నది. దీనంజేసియే అశోకుఁడు తన స్తూపములందు వీనినెల్ల నిషిద్ధములుగా నిరూపించినాఁడు. ఈ దృష్టితో భాస నాటకములఁ బర్యాలోచించినచో నశోకుని నిషేధకారణములు పెక్కు లానాటకములందుఁ గానరాకపోవు.

## నాటకమునకును మతమునకునుగలసంబంధము

ఇప్పటికిఁ దేలిన దేమన, భారతీయ నాటక రచనాప్రకారము పతంజలి కాలమునాఁటికి, అనఁగా క్రీ. పూ.

* "శ్రైష్ఠ్యం శాస్త్రసమూహేషు ప్రాప్తో వ్యామిశ్రకేషుచ,
అర్థధర్మౌచ సంగృహ్య సుఖతన్త్రో న చాలసః." —అయో. ౧-సర్గ, ౨౭ వ శ్లోకము.

ద్వితీయ శతాబ్దమునందు, సంపూర్ణముగ సిద్ధించిన దను విషయము. ఈనాటక మెటువంటిది? దీనివిషయ మేమి? అని విచారింతము.

ఇట్టిస్థితిలో రచింపఁబడిన నాటకములు, ప్రదర్శింపఁబడిన నాటకములు పూర్తిగ మతసంబంధము కలిగినవే యని అంగీకరింపక తప్పదు. పైనఁ జేర్కొనఁబడిన కంసవధలోఁ బ్రాచీనకాలమునం దాచరణములో నున్న "ఆగ్రయణవిధి," "మహావ్రత" విధానము మున్నగు వైదిక క్రియాస్వరూపములలోని ప్రధానాంశములే రూపాంతరము చెందినట్లు పొడగట్టుచున్నదని తలంపవచ్చును. ఆలోచించినచో, నీకంసవధ నాటకములోని విశేషార్థము హేమంతము గతించుటయు, వసంత మరుదెంచుటయు, నిటులే మహావ్రతములోని శూద్రవైశ్య 'కలహము'లో శూద్రుఁడు పరాభూతుఁ డగుటయు, వైశ్యుఁడు జయించుటయు నని గోచరించుచున్నది.

ఇట్లు నాట్యకోత్పత్తిక్రమ మంతయు మతముపైననే విశేషముగ నాధారపడియున్నది. ఆరంభదశనుండియు నాటకము సుఖాంతముగ నుండుటయే ప్రధాన ధర్మ మయిపోయినది. జయ మెప్పుడును గృష్ణునిది గాని కంసునిది కాఁజాలదు. వైశ్యుఁడే గాని శూద్రుఁడు జయింపఁడు. మరణము ముఖ్యావసర మయినను, నాటకములో దుఃఖము పర్యవసింపఁగూడదు. మరణము ద్వారా సుఖము లభింపవలయును. ఇయ్యది భాసనాటకములలో బాగుగ సాధింపఁబడియున్నది. భరతునిలక్షణమునకు విరుద్ధముగ రంగస్థలముపై మరణము చూపింపఁబడియున్నను భాసనాటకములం దది సుఖాంతమే యగుచున్నది గాని దుఃఖహేతుక మగుటలేదు.

ఈమరణముగూడ భగవంతునివిరోధికే కలుగవలయును. ఒక్క 'ఊరుభంగ' నాటకముమాత్రము విషాదాంతముగఁ బరిగణింపఁబడుచున్నది; కాని "భగవంతునివిరోధికి మరణమే కలిగి, తదనంతర మంతయు సుఖోదర్కముగఁ బరిణమింపవలయును" అను నిట్టి ధర్మమే దృష్టియం దుంచుకొనినచో, భాసుని 'ఊరుభంగము' గూడ విషాదాంతము కాఁజాలదు. మరణమందిన దుర్యోధనుఁడు భగవంతుఁడగు శ్రీకృష్ణుని విరోధియే కదా!

నాటకము మతమునకు సంబంధించిన దనుటకింకొక ప్రమాణము విదూషకపాత్రమే. గీర్వాణ దృశ్యకావ్యములలోని విదూషకపాత్రను బరిశీలించినచోఁ బ్రాయికముగా రెండువిశేషములు గాన్పించును. విదూషకుని నిందాత్మక మగు సంభాషణ మొకటి. నాయిక యొక్క పరిచారికలలో నొకదానితో నేదో సంబంధము గల్పించుకొని, దానితో హాస్యప్రసంగము లారంభించుట రెండవది.

ఈయంశముతో వైదిక యుగములోని మహావ్రతాచరణసందర్భమునఁ బ్రవర్తించు నాగకబ్రహ్మచారిపుంశ్చలీసంభాషణాదుల సరిపోల్చి చూచినచో, ఈవిదూషకపాత్రమున కాబ్రహ్మచారి బ్రాహ్మణుఁడే ప్రకృతిభూత మయినవాఁడని స్పష్టమగుచున్నది కాదా! దీనికిఁ దోడుగ సోమక్రయ కలాపములోని శూద్రక పాత్రము యొక్క లక్షణములు కొన్ని యీ విదూషకునిలోనికి సంక్రమించి యున్నవని కొందఱు విమర్శకుల యభిప్రాయము.

ఏతాదృశవిదూషక పాత్రములోని నీచత మిగుల విశదపఱచుటకే విదూషకుని బ్రాహ్మణునిగాఁ జేసినైచుటయు, నీబ్రాహ్మణబ్రువుఁడు ప్రాకృతములోనే భాషించుటయుఁ బొసఁగుచున్నదని యూహ వొడము చున్నది.

ఇంత యేల? నాటకోత్పత్తి ప్రథమావస్థయందలి నాటకవస్తువులెల్ల శ్రీకృష్ణమతము (Krishna cult) నకు సంబంధించిన గాథలతో రచింపఁబడి యుండుటయే నాటకమునకు మతమే ఆధారమనుటకు ముఖ్యనిదర్శనము. అక్కాలపు నాటకములలోఁ గృష్ణుని బాల్యచరితమే ప్రధానేతివృత్తమై యుండెను. ఇందులకు భాసనాటకములే సాక్ష్యము. శౌరసేనీప్రాకృత మప్పటి నాటకములలో బ్రాధాన్యము వహించి యుండుటచేతను, శ్రీకృష్ణమతముగూడ విశేషముగ నాప్రాకృతములోనే ప్రచారితమయి యుంటచేతను, శ్రీ కృష్ణమతము బలముగా

నున్న తావులందే నాటకము పుట్టియుండవచ్చు ననుట యొప్పుచున్నది.

ఇటు లనుటచే, నాటకోత్పత్తివిషయమున శ్రీకృష్ణమత మొక్కటియే మిగులఁ బ్రాధాన్యము వహించినదనియు, శైవమునకును రామకథకును బ్రాముఖ్యము లేదనియు భావింపరాదు. శివుని లాస్యతాండవములు గూడఁ దగినంత ప్రాధాన్య మందినవి. భాసుఁడు వైష్ణవుఁడైనను, అనంతరనాటకకర్తలగు శూద్రకుఁడు, కాళిదాసు, భవభూతి—ఆదులు తమతమ నాటకప్రస్తావనలయందు శివభక్తినే నిరూపించియున్నారు. నాట్యశాస్త్రమునందును శివతాండవాదులు శాసింపఁబడినవి.

ఇటులనే రామలీలగూడ ముఖ్యమై యొప్పినది. పశ్చాత్కాలికనాటకములలో రామాయణము నాశ్రయింపని నాటకము లేనే లేదనవచ్చును.

నాటకము మతముపై నాధారపడిన దనుటకు మన మతమే గాక బౌద్ధమతముగూడ కొంత సాక్ష్యమొసంగుచున్నది. నాట్యము, చిత్రరచన, సంగీతము మొదలగు కళలయందు బౌద్ధుల కున్న అభిరుచియే యిట నిదర్శనము. నాట్యముగూడ బుద్ధుని అభిమానవిద్యలలో నొకటియని 'లలితవిస్తార' గ్రంథమునం దున్నది. మహావంశగ్రంథప్రకారము, ఉత్సవాదులయందు నాటకప్రదర్శనము లున్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 300 సం. చైనాభాషలోనికిఁ బరివర్తింపఁబడినఁ 'అవదానశతకము' లో, శోభావతీనగరాధీశుని కట్టెదుట, బుద్ధనాటక మాడివట్లు వ్రాయఁబడియున్నది. బింబిసారప్రభునిముందట నొక దక్షిణదేశపునటుఁడు బుద్ధుని జీవితనాటక మాడినట్లు తెల్పఁబడియున్నది. ఇట్లే విచారించినచో, "ఛోటా నాగపూర్" వద్దనున్న 'సీతాబెంగ' గుహలనూలమున, నాటకము బౌద్ధులయాదరణ మందినదనియు, అచ్చటి తోఁటలు నాటకప్రదర్శనప్రదేశము లయిన వనియు గోచరించుచున్నది.

(సశేషము.)

---

# నేను

కవిరాజహంస, బాలాంత్రపు వేంకటరావుగారు
(శ్రీ వేంకట పార్వతీశ్వరకవులలో నొకరు)

అక్షరమ! నీపదంబున నైక్యమగుదు;
పదమ నీయర్థసంపదఁ బ్రస్తరింతు;
అర్థమా! నీప్రభావంబు నధిగమింతు;
ఆద్యుఁడనో? కవినో? లోక మరయుఁగాక!

గురుపరధ్యానమే నాకు గుబ్బగొడుగు;
ఆత్మభావగుణమె నా కంగబలము;
ప్రకృతిపోషణమే నాకుఁ బరమధర్మ
మధిపుఁడనో? కవినో? లోక మరయుఁగాక!

నా మనోరథగతికి మాంద్యంబు లేదు;
నాప్రకాశ విస్తృతికి హైన్యంబు లేదు
నాప్రబోధాకృతికి దుర్దినంబు లేదు;
ఇనుఁడనో? కవినో? లోక మెఱుఁగుఁగాక!

తమము విరియింతు, నాశలఁ దళుకు లుంతు;
కలఁక లెడలింతు, లలితసత్కళల నింతు;
దోషము లడంతుఁ గువలయతోష మెంతు;
నిందుఁడనో? కవినో? లోక మెఱుఁగుఁగాక!

పలుకులా సత్యవాక్యసంభావనములు;
తలఁపులా నిత్యధర్మ సందర్శనములు;
చేతలా కృత్యభిమత సంజీవనములు;
అజుఁడనో? కవినో? లోక మరయుఁగాక!

---

# నాటకము

గూడూరు రాజేంద్రరావుగారు, యమ్. ఏ.

(తరువాయి)

## రంగము ౫.

మధ్యాహ్నం 3 గంటలు.

[ఒక పెద్దహోటల్ "విహారభవనము"లో నొక మేడపై గది. తోలుపెట్టెలు, కట్టినపక్కలు, ఖద్దరు కోట్లు, అంగవస్త్రములు పడవేసి యుండును. క్రొత్త చాపలు పరచియుండును. ఫలహారములు, కాఫీ గిన్నెలు చాపలపై నుండును. మతిపిల్లి, వదరువాయి, నల్లులతిట్టి, మరిద్దరు కూర్చుండియుందురు. బయట కిటికీలనుండి బడి పిల్లలు వీరిని అడవిమృగములను జూచినట్లు చూచుచు ఒకరితో నొకరేమో గుసగుసలాడుకొనుచుందురు. బయట వర్షము హెచ్చుచుండును.]

నల్లులతిట్టి

ఎవరురా అక్కడ పిల్లకాయలు. వెళ్లిపొండి. ఘాలి రానివ్వండి, చస్తున్నాము.

[పిల్లలు మాయమగుదురు.]

మతిపిల్లి

మూడుదినము లయిందబ్బా నిద్రబోయ్యి. ఒకటే రైలు ప్రయాణాలు. రాత్రిళ్లు నాటకాలు. మొన్న హైద్రాబాదునుండి మద్రాసు. నిన్న బెజ్వాడ. ఈ వేళ నెల్లూరు. అబ్బే రెచ్చెడ్ లైఫ్ రా!

వదరువాయి

(కాఫీ త్రాగుచు) అట్లాంటి ప్రయాణాలైతే నా కేమీ కష్టము లేదు గాని—నాది వెధవపొసిషన్. ఇంటివద్ద మా మదర్కి వచ్చే ప్రాణాలు పోయ్యే ప్రాణాలుగా వున్నాయి. డయేరియా. సిస్టర్ బిడ్డకు జబ్బుగా నున్నదని ఆవిడ వచ్చి మాయింట్లోనే మఖాం. చేతిలో దమ్మిడి లేదు. ఈమధ్య యెంగేజ్మెంట్సు బొత్తిగా లేని దొకటి. (రహస్యముగ) ఈదినం నెల్లూరికి రావడానికి రైల్వే ఫేర్సు లేక గార్డుచేత రూపాయ బెట్టి నెట్టుకవచ్చినా! అందులో వెధవదర్జా ఒక టేడుస్తుంది గా. పైస్టేషన్లో దిగి సెకండు క్లాసులో గూర్చొని వచ్చినా.

నల్లులతిట్టి

ఓహో: అదా కారణం తాము మాతోగూడ యెక్కకపోవడం? అది సరే, నీవు జెప్పడం రోలు బోయి మద్దెలతో మొఱబెట్టుకొన్నట్టుంది. ఇట్లాంటి డిఫికల్టీస్ అందరికీ సహజమే. దేహం జబ్బులంటే మఱి మనం జేసే దేముంది, వెధవఆంక్జయిటీ ఒకటి దప్పు. ఇక మనట్రబుల్సంటే అవి అందరికీ వుండేవే. మన కేమా తెలివితక్కువ దేవుడు లక్షలివ్వలేదే, ముద్దుకొడుకులకు లాగ. ఏదోఒక ఆర్టుచేతిలో వుంచాడు. మేక్ యువర్ వే అన్నాడు. మఱి సాగించాలి జీవిత యాత్ర. అన్ని గౌరవములు చూచుకోవాలి. మనీ ఆర్జించాలి. అదంతా నాకు సంతోషమే. నాకొచ్చిన పెద్దచిక్కేమిటంటే, బ్లడీ లిటిగేషన్. అవసరం బడ్డప్పుడెల్లా యెక్కడ బడ్తే అక్కడ వడ్డికి తెచ్చి పెట్టేశాను. ఇప్పుడు వారితో పష్టాష్టకం. ఒకటే అరెస్టు వారంట్సు. ఎటు బోవడానికి లేదు. ఎక్కడ జూదామన్నా యీడిస్ట్రెషన్. నిన్న బయలుదేరేసరికి కోర్టు అమీనాగా డొకడు తయారయ్యినాడు వాకిట,వారంటుతోటి. వాడికి ప్యాసిఫై జేదామంటే చేత కాసు లేదు. ఆవెధవ మఱి గట్టిగా కేకలేయడం ప్రారంభించాడు. చేయిచేయి కలిపేస్థితికి వచ్చింది. ఇంతలో ఫార్చునేట్గా, (మెల్లగా) సానిదుండ్లే, శారద, అది చేతిగాజు పంపింది. అది బట్టుకొని మనీ తెస్తాను వుండమని చెప్పి వాడికి జూపి సరాసరి రైలెక్కినాను. వా డింటి దగ్గర యేం గలభా జేస్తున్నాడో! మార్నింగే ముప్పయి రూపాయలైనా మనియార్డరు చేయాలి. లేకుంటే పరువు దక్కదు.

మడతపిల్లి

మన దురవస్థ లిట్లున్నాయా? ఆరాస్కెల్ పానం జూడండిరా. నూరు ముందు బెట్టేవరకు అడుగు కదల్పడు. ఎట్లో జరుపుకొంటూనే వున్నాడురా వాడు న్ను. మతి అమెచ్యూరనే లెక్క.

వదరువాయి

జరుపుకోవడ మేమిటి వాడిపాడె. ఆవిడవొచ్చి పెట్టెయ్యకపోతే వాడి జరుపుకోటం తెలిసిపోను. లక్కీ డాగ్. అది తటస్థమైనప్పటినుండే వాడివిజృంభణ. అదివరకు నాచుట్టు "పాతిక ఇప్పించవోయ్, నీ వెంట వస్తుంటా" నని తిరుగుతూండే వాడు. అయితే ఒక ప్రొఫెషన్‌లో వుండేవాళ్లము గనుక బయట వేసుకోరాదు గాని......

నల్లులతిత్తి

అట్లా జెప్పు: మనేమిట్రా వాడివజ్రా అని నా కర్థమయ్యేది గాదు. సరే సరే, అయితే......(తటాలున సంభాషణ ఆగును.)

[కార్యదర్శి రఘురామచౌదరి ప్రవేశించి]

రఘురామచౌదరి

ఏమండీ! బస పసతిగా వుందా? కాఫీ వచ్చాయిగదా: మరేమి కావాలి?

వదరువాయి

అన్ని సౌఖ్యంగా వున్నాయండీ. ఓ. కే. సైటు సీన్సు కొంత పల్లించుకొంటున్నాము.

మడతపిల్లి

వర్ష మీలా వుందే. కలెక్షన్లు యెట్లుంటాయో.

రఘురామచౌదరి

కలెక్షన్ కేమి లోటుండదు లెండి. మీ నలుగురి పేర్లు దెలిస్తే సరి, మావూరిలో యేమైనా వెయ్యింటికి తగ్గదు.

నల్లులతిత్తి

రఘురామయ్యగారు, యీలా దయచేయండి. ఒక మనవి. చాలనాళ్లనుండి తమతో హెచ్చరించాలని వుంది. నాకు పరిస్థితులు యింటిపద్ద సరిగా లేవండీ. ఈ నెలలోనే ఒక బెనిఫిట్ ప్లే అనుగ్రహించాలి ఈవూరిలో.

రఘురామచౌదరి

తమ కభ్యంతర మేమిటి? పైవారంలోనే కాని ద్దాము లెండి. మన దంతా హిస్ట్రియానిక్ అమెచ్యూర్సు కోఆపరేటివ్ యూనియన్ గదండీ.

[వదరువాయి, మడతపిల్లి కాఫీ డ్రాగుచు నవ్వుచుందురు.]

కూర్చున్న వారిలో ఒకడు

అడుగో అడుగో. అడుగోనండో పానంధోర వారు. టాక్సీకారులో సత్యభామలాగా దిగబడ్డాడు. చూడండి, చూడండి.

వదరువాయి

వచ్చాడూ? గుడ్ గాడ్.

[తెర జారును.]

## రంగము ౬.

సాయంకాలము ౫ గంటలు.

[ఆడ బడిపంతులు అనసూయమ్మగారియిల్లు. అనసూయమ్మ వయసు ౨౨ మొదలు ౨౫లోపల యెంతైన నుండవచ్చును. మల్లెపట్టుచీర గట్టుకొని, వెండ్రుకలు జారుముడి వేసి, బాడీజాకెటు తొడిగి కూర్చొనియుండును. కాళ్లకు జాంగ్రీగొలుసులు, చేతులలో నాలుగు రకముల బంగారు గాజులు, మెడలో నెక్ లేస్ వుండును. కండ్లద్దములు గోల్డుగోల్డు అంచులవి యుండును. మొగాన బొట్టు లేనందున పూర్వసువాసిని యను సంకోచమున కెడ ముండును. ఎదుట, పొరుగింటి రామలక్ష్మమ్మ, తల జెడిన ౩౫యేండ్ల ముద్దువంటి స్త్రీ, మాసిన యెఱ్ఱ గుడ్డ గట్టుకొని విస్తళ్లు గుట్టుకొనుచుండును. అనసూయమ్మ భగవద్గీత చదివి యర్థము జెప్పుచుండును. ఇల్లు పరిశుభ్రముగ నుండును. గోడలకు ఉల్లుతో గుట్టిన టాక్‌మహల్, హైకోర్టు, రామచిలుక పటములు తగిలించి యుండును. చిన్న నల్లమేజాపై నూలుతో

కుట్టుపని చేసిన రుమాలు పరచియుండును. దానిపై గ్రామఫోను పెట్టియుండును. వెనుకతట్టు దోమతెఱ మూసిన పెద్ద కమిజీమంచ ముండును. మఱియొకబల్లపై ఉల్లుతో నుట్టిన చిన్న సంచులు, మేజోళ్లు, సీమసున్నపు కోపులు పడియుండును. అనసూయమ్మ చాపపై దిండు నానుకొని కూర్చుని చదువుచుండును. రామలక్ష్మమ్మ తల వంచుకొని ఆకులు గుట్టుచు పిలిచినప్పుడు అనసూయమ్మవంక తల నెత్తి జూచుచుండును.]

అనసూయమ్మ

"నియతం కురు కర్మ త్వం" (అనుశ్లోకమును పెద్దగ జదివి, శంకరవ్యాఖ్యను తనలో చదివికొని)

కృష్ణపరమాత్మ ఇటుల జెప్పుచున్నాడు, ఫలాఫలములకు కారణభూతుడవు నీవు గావోయీ యని అర్జునునితో. కర్మమాత్రము చేయవలసినదే గాని దాని పర్యవసానముతో నీకు పని లేదు. అందుకు నే నున్నాను. చేయించువాడను నేను. చేయువాడను నేను. చేయబడు వాడను నేను. చేయబడినది నేను. నీ వెవ్వడవు. నే నెవ్వడను. నీవే నేను. నీవు అనుపదార్థము నిమిత్తమాత్రమైనది. కాబట్టి ఆలోచించవద్దు-అని. ఏమి రామలక్ష్మమ్మగారూ! వింటున్నారా?

రామలక్ష్మమ్మ

ఆహా! నిజమే గదమ్మ మరి ఆమాట!

అనసూయమ్మ

అయ్యో: అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడై ఆదిమధ్యాంతరహితుడైన పరమాత్మ జెబుతుంటే సంశయ మేమిటి మఱి. పని చేయుమన్నాడు. జయాపజయములు, గౌరవాగౌరవములు మన కవసరము లేదు. యెందులోనైనా అంతే గదటమ్మ మఱి, లోకములో ప్రవర్తించవలసిన మార్గము?

రామలక్ష్మమ్మ

అంతే, అంతే.

అనసూయమ్మ

నా విషయం జెబుతా ఉదాహరణంగా. నేనేదో సర్కారు వుద్యోగం జేస్తున్నా. నాకు గాని వెనవలంతా, "పసిది, ఉద్యోగం జేస్తుంది, బడి పంతులు పని" అని హేళనజేస్తారు, నేను వినేటట్టుగూడా. వీధిలో తుంటరిమూక "మాష్టర్" అని అరుస్తారు పరిహాసానికి. వారి కడుపు గాలింది లెమ్మనుకొని తల వంచికొని వెళ్లిపోతుంటాను లెండి.

రామలక్ష్మమ్మ

అంతే లెండి. కుక్కలు మొఱుగుతుంటే యేనుగుకు లక్ష్యమా?

అనసూయమ్మ

కాదటమ్మా మఱి. నేను చేసెపనులలో నా కేమి తప్పు కనిపించడం లేదు. పరోపకారార్థ మిదం శరీర మన్నారు. నాకు దెలిసిన నాలుగుముక్కలు ఆబిడ్డలకి చెబుతా. వారిని జూస్తుంటే నాకు నాబిడ్డలను జూచుకొన్నట్లే వుంటుంది. వారు గూడ నే నంటే యెంతో ప్రేమతో వుంటారు. తల్లినిలాగ భావించుకొని, "అమ్మా అమ్మా" అంటుంటే నా కెంతో ఆనందంగా వుంటుంది రామలక్ష్మమ్మగారూ!

రామలక్ష్మమ్మ

ఉండదమ్మా మఱి. అంతకంటె యెక్కు వేమి గావాలి మన పాడు జన్మాలకి.

అనసూయమ్మ

విషయం దెలిసినవా రెవరైనా ఉద్యోగస్తులు యెంత గౌరవిస్తారు! మొన్న వైస్‌ప్రెసిడెంటు వారి కొమార్తెకు ప్రయివేటు గావలెనంటే మాటాడుదామని వారింటికి వెళ్లాను. వారే బండి పంపారు లెండి. ఆయన ఒక్కరే వుండినారు. భార్య, కుమార్తె షికారు వెళ్లినారు వస్తారని కూర్చోమన్నారు. ఎంత మర్యాదమ్మా వారిది. ప్రొద్దుబోయిన తర్వాత వచ్చారు ఆడవారు, అంతవరకు వారు నేను మాట్లాడుతూనే వుండినాము.

రామలక్ష్మమ్మ

అభ్యంతర మేమి? గొప్పవారికి గొప్పబుద్ధే మరి.

అనసూయమ్మ

ఎందు కొచ్చిం దీపురాణ మంతాను?-ఆ, మరచినా. నా విషయం జెపుతుండినా గదూ ? అదే మరి. సాక్షాద్విష్ణువే యిట్లు కర్మ చేయమన్నాడని పురాణములు ఘోషిస్తుంటే—ఆవాకిలి ముందుకు వేయి రామలక్ష్మమ్మ, చినుకులు బడుతున్నాయి గాలికి —పురాణములు ఘోషిస్తుంటే, వీరి ఆక్షేపణ లేమిటమ్మా? నాకు చేతనైనపని యిది. మనస్సాక్షిగా జేస్తున్నాను. ఫలాఫలములు నేను కాంక్షించడమే లేదు. భగవంతునిమీద భారము వేసి చేస్తున్నా నన్నమాటే. బంధువులు గాదు, స్నేహితులు గాదు, యెవ రేమన్నా సరే.

రామలక్ష్మమ్మ

ఈ దినములలో ఆక్షేపణ ఏమిటిలే అనసూయమ్మా? నీయంతట నీవు కాలక్షేపము జేస్తున్నావు. మాగతి జూడు. ఈపాడువైధవ్యం సంప్రాప్తమైనప్పటి నుంచి ఆఒక్కపూట తిండికే నూరు మాటలూ, నూరు పొడుపులు, యెన్ని చాకిరీలు జేస్తున్నాను.

[ వాకిట మోటారుశబ్దము వినవచ్చును. ఇరువురు వాకిటివంక జూతురు. అనసూయమ్మ పుస్తకము మూయబోవును. అందులో నుండి పోష్టుకార్డుసైజు ఫొటోగ్రాఫు జారి క్రింద బడును. ]

రామలక్ష్మమ్మ

(పటము దీసికొని) యెవరమ్మా యీయన,మన్మథుడిలాగ వున్నాడు; ఈ కనుబొమ్మలు, చేరడేసి కండ్లున్నూ! అనసూయమ్మా, మీవారా ?

అనసూయమ్మ

అబ్బే కాదమ్మా.మా వారిది ఫొటగ్రాఫొకటిగూడ వున్నదా. వారు కేవలం వైదికులట. ఇదిమాసూర్కాళ్లీ....

[ ఇంతలో వాకిటినుండి ముందు నటరాజన్, వెనుక సంకోచించుచు పానం ప్రవేశింతురు.]

నటరాజన్

ఏమండో, రావచ్చునా ?

అనసూయమ్మ

(నవ్వుచు లేచి) రాగూడ కేమి? అబ్బా, యెన్నాళ్లకో మాయింటి దారి గనుపించింది మానటరాజానికి. (రామలక్ష్మమ్మతో) పసివాళ్లముగా వుండేటప్పుడు మా యింట్లోనే వుండేవాడమ్మా. ఇప్పు డంతా పెద్దమనుష్యులై పోయారు, పలకడమే అపురూప మైపోయింది.

రామలక్ష్మమ్మ

అంతే లెండి.

నటరాజన్

(నవ్వుచు) ఏమిటో పనులు. వీరిని తెలుసుగదూ? నిడదవోలు. రాత్రికి నాటకములో.........

అనసూయమ్మ

ఎఱుగ కేమి. ఎన్నోపర్యాయములు జూచినాను నాటకాల్లో, బయటా గూడాను. దయచేయండి. నిల్చున్నారే. దయచేయండి. (మంచమువంక జూపి) కూర్చో నీవున్నూ నటరాజా.

పానం

(చిరునవ్వుతో) తమర్నెక్కడో చూచినట్లే జ్ఞాపకం. అయినా పరిచయం లేనందుచేత......

అనసూయమ్మ

దయచేయండి. కూర్చోండి.

[పానం కూర్చొనును.]

రామలక్ష్మమ్మగారు

అనసూయమ్మా! నేను తిఱిగి వస్తా నమ్మా. ఈ పాడువర్ష మిల్లా వేధిస్తూవుంది. (వెళ్లిపోవును.)

నటరాజన్

కార్యార్థులమై వచ్చాము.

అనసూయమ్మ

(నవ్వుతూ పానంవంక జూచి) చెప్పేవున్నారుగా, "ఊరక రారు మహాత్ము" లని. తమబోటివారు వచ్చినందుచేత పావనమైనది మాయిల్లు. కార్యాల కేమి లెండి, కాఫీ బుచ్చుకోండి.

పానం

చిత్తం, తమదయ వుండాల గాని కాఫీ కేమిటి లెండి. యెప్పుడు పుచ్చుకోగూడదు?

నటరాజన్

టైమయిపోతుంది. చాలపను లున్నాయి. మీ దగ్గిర వుండే చీరలు, జాకెట్లు ఒక్కమాటు చూపండి.

పానం

నే నెప్పుడు బయట వూళ్లకు వచ్చేటప్పుడు నా చీరలు, జాకెట్లు పట్టుకొస్తుంటానండి. ఈమాటుమాత్రం హడావుడిలో పెట్టె తేవడానికి వీలు చిక్కలేదు. ఇంటికి వెళ్లడానికే వీలు లేకపోయింది. అందుచేత.......

అనసూయమ్మ

(సిగ్గును సూచించునవ్వుతో) నావద్ద యేమున్నాయబ్బా, తమకు సరిపడే చీరలు. అసలు జాకెట్లు లూజుగా వుండవూ? చీరలు వుండినవాటిల్లో మంచివి వాళ్లకి వీళ్లకి ఇచ్చివేశానండీ. ఏమిటో ముచ్చటపడి ధరగల గుడ్డలు కొనడమే గాని ఎవరో ఒకరు పట్టుకెళ్లుతుంటారు. నా దెవ్వరికీ లేదనే స్వభావం గాదు. ఎవరికంటే వాళ్లకిస్తుంటాను. నలిపి పారవేస్తుంటారు. అయినా వుండేటివి చూడండి. మీ చేతి కడ్డమా?

(పెట్టెలు తీసి చీరలు ఒక్కొక్కటిగ జూపును.)

పానం

(ఆశ్చర్యముతో) అబ్బా! ఎన్ని చీరలండీ. ఒక్కమాటు దశావతారము లాడడానికి చాలినన్ని వున్నవి గదండీ మీవద్దిర.

అనసూయమ్మ

అప్పటికే అన్నీ పోయినవండీ! ఈచీర పోయిన సంవత్సరం నూటయాభై రూపాయలకు మద్రాసులో కొన్నాను. (ఇంకొకటి) ఈ సిల్కుచీర క్రొత్తరకం. పార్సీఅంచు. కరాచినుండి తెలిసినవాళ్లు వస్తుంటే తెప్పించాను.

పానం

ఈరెండు చాలు లెండి. ఊరకే చెప్పడము గాదండీ; ఇట్లాంటి చీరలు నే నింతవరకు కట్టుకొనలేదు సరేగదా, చూడనుగూడ లేదండీ. మంచికలర్సు. ఇంకా ధరగలిగిన గుడ్డలు వుండినా యింతసొగసుగా వుండవు.

అనసూయమ్మ

ఏమిటోలెండి. మోజుపడి యెప్పుడైనా కొనవలసినదేగాని కట్టడానికిపోదు, బహుజంకుగా వుంటుందండీ, అందరూ చూస్తుంటారు.

పానం

మరి చూడరండీ? మీలాంటి వారు యిట్లాంటి చీరలు గట్టుకుంటే యిక బంగారుకు వాసనవచ్చినట్లే. ఒకరు చూడడ మేంటి?  *  *  *

*  *  *  *  *  *  *

*  *  *  *  *  *  *

*  *  *  *  *  *  *

ప్రపంచధర్మమే గదండీ.

నటరాజన్

ఏముండి సార్. తాము నిమ్మళంగా కారులో రండి. నేను హాలువద్దకి వెళ్లివస్తాను. అక్కడ పరిస్థితు లెట్లున్నాయో చూడాలి. ఈవర్ష మింకా తగులబడుతు నే వున్నది. తిరిగి వస్తా ననసూయా! (పోవును.)

పానం

(ఉల్లుపటములు చూచుచు, 'టాజ్‌మహల్,' 'హైకోర్టు,' అని చదువుచు 'మిస్ అనసూయా' అని చదువుచుండును.)

నాకు గూడ సెలవిప్పించండి.

అనసూయమ్మ

వెళ్లిపోతారా. వర్షముగా వుండే.

పానం

అదిగో కారు వుందిగా. పోవాలి. మళ్లీ దర్శనం జేసుకుంటూ లెండి....... ఒకమనవిమాత్ర ముంది. అను గ్రహించాలి.

అనసూయమ్మ

అబ్బా, మనవే! సెలవివ్వండి. శిరసావహిం స్తాము.

పానం

రాత్రికి నాటకానకు దయచేసి నన్ను కటాక్షిం చాలి.

అనసూయమ్మ

మీరు గోపిక భూమిక ధరిస్తారంటే రాకుండు టకు ప్రాణ మొప్పదు. అయినా వర్ష మిట్లున్నదే అని అనుమానిస్తున్నాను.

పానం

వర్షమైనా సరే. ప్రళయమైనను సరే. తాము రావాలి. హాలంతా క్రిక్కిరిసిపోయినా గాని మీరు లేని నాటకము కళావిహీనంగా వుంటుంది. మీవంటి రసికు లొక్కరుండినా చాలు. ఎట్లనయినా రావాలి. నన్ను చంపుకున్నట్లే. (టిక్కెట్టొక టిచ్చి) ఈ టిక్కెట్టు బుచ్చుకోండి. మొదటివరుసలో కూర్చోవాలి *
* * * * * * *
అడ్డు జెప్పకుండా అనుగ్రహించాలి.

అనసూయమ్మ

(నవ్వుచు తల వంచుకొని) తా మింత ప్రార్థించుట మామీద మీకు గల అపారప్రేమచేతనే గాని మాఘన తచే గాదు. * * * * *
* * * * * * *
* * * * * * *
ఇక తమఆజ్ఞ మీరరాదు. వచ్చెదను లెండు.

పానం

తమ కీశ్వరుడు రూపయౌవములనే గాక, జ్ఞానవి వేకములను, వాక్చతురతను, సమయస్ఫూర్తిని గూడ నంత విరివిగ నిచ్చినాడని నే నూహింపలేకపోతిని. మంద మతిని. మీమృదుభావములచే కృతార్థుడ నైతి. తమ వంటి విద్యాధికులు, వివేకఖనుల మైత్రికంటె మాకు జీవి తమున నపేక్ష్య మింకేమియు లేదు. తమవంటి వారి యెదుట తెలిసితెలియని మావంటివారము స్త్రీభూమి కలు ధరించుట, అభినయించుట సాహసము. కాని, జ్ఞాన వతులు, రూపవతులు మీవంటివారు ముందంజ వేసి రంగస్థల మెక్క సంకోచించుచుంటచే మేమే అందు లకు గడంగవలసి వచ్చినది. ఎటులైనను గానిండు. రాత్రికి తమ దర్శనభాగ్యమునకై వేచి యుందును. ఇప్పుడు సెల వొసంగుడు. * * * *
* * * * * * *

నాటక మైనవెంటనే చీటిలు దెచ్చెదను. ఎంత ప్రొద్దయినను సరే.

* * * * * * *
* * * * * * *

[తెర జారును.]

## రంగము 2.

సాయంకాలము 2 గంటలు.

[బ్రహ్మండంపంతులుగారి యిల్లు. పంతులుగారు, పానం, వదరుబాయి, నల్లులతిట్టి, మడతపిల్లి, చాదరి, కృష్ణారావు, మరికొందరు కూర్చునియుందురు. బయట వర్ష మధికముగ కురియుచుండును. ఇంటిలో పెద్ద దీపము వెలుగుచుండును. గాలి కప్పుడపుడు కంపిలుచుండును. లోపల కిటికీలో పంతులు భార్య ముఖముమాత్ర మగపడు చుండును. ఇంటిలో పుస్తకములు నిండిన మూడద్దపు బీరువాలు, టేబిలు, ప్రాతసామానులు, కుర్చీలు ఉండును.]

పంతులు,

(పెద్దగా పేపరుచదువుచుండును.) "బెంగాలులో విప్లవకారులు... ఊ... మద్రాసులో విధవావివాహము... మహాత్ముని యాదేశము—పదునాలుగేండ్ల పరాసుకన్య ముగ్గురుబిడ్డలను కనుట—జస్టిసుపార్టీవారి పట్టీలు—10 యేండ్లబాలిక నూతిలో బడుట — ఒట్టావా కాన్ఫరెన్సు— న్యూయార్కులో వాతావరణస్థితి —ప్రభుత్వవార్తలు—సింహపురి—" ఓహో! మాదేమో బయటబడిందే. ఏమిటికథ. "నెల్లూరినుండి మా విలేఖరి యిట్లు వ్రాయుచున్నాడు. —గవర్నమెంటువారు సింహపురపాలక సంఘమువారికి ఈ క్రిందివిధముగ తాకీదు పంపినట్లును, అందులకు గౌరవనీయులగు పురపాలకసంఘమువారీదిగువ పొందుపరచిన తీర్మానములను జవాబుగా పంపినట్లును తెలియుచున్నది. ఉత్తర ప్రత్యుత్తరములు ఆంగ్లభాషనుండి మక్కికి మక్కిగా తర్జుమాయించబడినవి. మద్రాసు ప్రభుత్వము వారి తాఖీదు:— ఇందువలన నెల్లూరు పాలకవర్గము వారికి తెలియజేయడమేమనగా —మాచే నియోగింపబడిన స్పెషల్ యింజనీయరువారు నెల్లూరు రస్తాలు తనిఖీజేసి వాటి లెవలు క్రమక్రమముగ తగ్గుచున్నదనిన్నీ, అందుకు కారణము సదరురస్తాలపైని యెఱ్ఱదుమ్ము తగ్గిపోవుటచేతననిన్ని, పాలనా వర్గమువారు తక్షణమే తగు చర్య బుచ్చుకొని, సదరుదుమ్ము వ్యయముగాకుండ కాపాడిననే గాని రస్తాల లెవలు పూర్తిగ క్రుంగిపోవుననిన్ని, అది గాక చిరకాలమునుండి సుగంధపుష్పాడివలె గాలిలో నెగురుచు పురమునకు శోభ కలిగించుచుండిన సదరు దుమ్ము తగ్గుటచే కళావిహీనమై పురము కాంతిచెడినదనిన్ని వినుట కెంతయు చింతిల్లుచు, యీ తాఖీదందిన తక్షణమె పైగనుపరచిన లోపములను మాపుటకు తగు చర్య పుచ్చుకొని, సదరు దుమ్ము యెప్పటి యట్ల రస్తాలలో యెగురునట్లు చేయవలెనని తెలుసుకొనేది; జరూరు.

నెల్లూరు పాలక సంఘమువారి జవాబు:—ప్రభుత్వమువారి తాఖీదందినది. దుమ్ము వ్యయమునకు కారణము విచారించుటకొక కమిటీ నియమింపబడినది. జిల్లా ఉన్నతోద్యోగులందరు మావిచారణకు దోడ్పడిరి. అందులో ఆరోగ్యశాఖవారును, వైద్యశాఖవారును పంపిన సలహాలు యిందుతో జతపఱచుచున్నాము.

నెల్లూరు పురపాలక సంఘమువారి ప్రార్థన మేరకు యెఱ్ఱమన్ను వ్యయకారణముల శోధించితిమి. ఇటీవల యిచ్చట మరణసంఖ్య హెచ్చుచున్నందున కారణము తెలిసికొనుటకు నాలుగుశవములను కోసి పరీక్షజేసితిమి. వారి అందరి శరీరములలో నెత్తురు, కండలకు బదులు మిక్కుటముగ యేదోయొక యెఱ్ఱని పదార్థము కూడియుండినందున ఈపదార్థమును నిపుణులగు మఱికొందరు వైద్యుల సహాయమున పరీక్ష జేసితిమి. రస్తాలలోని యెఱ్ఱమన్ను దుమ్ము వీరి నవరంధ్రముల ద్వారా లోనికి పోయి యిట్లు పరివర్తన గాంచినది. కనుక దుమ్ము వ్యయమునకు మనుష్యులే కారణమని మా యభిప్రాయము. తగు చర్య బుచ్చుకొన ప్రార్థితులు.

ఈసలహాను గూర్చి విచారించుటకు పురపాలకసంఘము సమావేశమై మూడు గంటలు తీవ్రమైన చర్చ జరిగినది. రస్తాల నడచువారివలన ప్రభుత్వమువారికిని తద్వారా పై సంఘమువారికిని కలుగు నష్టములను తర్కించి, యెవరు గాని వీధుల నడచువారు నవరంధ్రములను బిగియబట్టి నడచునట్లు ఉత్తరువులు సాదరుచేయించమని ఒక పక్షపువారి యుద్దేశ్యమై యుండినది. మఱియొక పక్షపువారందులకు భిన్నాభిప్రాయులగుచు పౌరులలో నూటికింట తొంబదిమంది, కాలపరిస్థితుల ననుసరించి ఇతర భోజనములకంటె దుమ్మునే ముఖ్యాహారముగ జేసికొని జీవించుచున్నారనియు, పైతీర్మానములు జరిగించినచో నవరంధ్రములు బిగించుకొనుటచే చావక బ్రతికినను దుమ్ము లోనికి పోకుండుటచేత కడుపు నిండక ఆకట జత్తురనియు, యీకారణముచే దుమ్ము వ్యయ మాపుదలజేయుటకు వేరుమార్గ మాలోచించ వలసినట్లును ప్రార్థించిరి. అందుమీదట మరల చర్చ జరిగి యీక్రిందితీర్మాన మేకగ్రీవముగ నామోదింపబడెను:

బ్రతికినవారికంటె చచ్చినవారిని కట్టుబాటు జేయుట సులభము గావున, ఈదినమునుండి నెల్లూరిలో చచ్చినవారిని కాల్చగూడదు. పూడ్చగూడదు. పాలక సంఘమువారి కొసంగినట్లయితే వారు వైద్యులసహాయమున శవాల పొట్టలు జీల్పించి, అందలి యెఱ్ఱమన్ను వ్యయము గానట్లు విదలించి ప్రోగుజేయుదురు. సదరు ప్రోగులు యంత్రములద్వారా మరల నెల్లూరు వీథులలో వెదజల్లబడును. ఇది రస్తాల లెవలు తగ్గకుండుటకై గావింపబడినజనోపకారకము తీర్మానము గావున ప్రజలు ఉత్సాహముతో మాకు తోడ్పడుదు రనియు, చచ్చిన వారినే కాక, చావనున్నవారినిగూడ మాకప్ప జెప్పుదు రనియు, నమ్ముచున్నాము.

ఇట్లు ప్రకటన జేయించితిమి. సదరు ప్రోగులను వెదజల్లుటకు బొంబాయి కలకత్తాలలో సాయంకాలము నీరు జల్లుట కుపయోగించెడి మోటారువంటి దుమ్ముజల్లు యంత్రము నొకటి మాకు క్రయమునకు గాని, బాడుగకు గాని దయచేయవలసినదిగా ప్రభుత్వమువారిని ప్రార్థించడమైనది.

ఇట్లు
పురపాలకసంఘము, నెల్లూరు."

[కవి లోనుండి తాంబూలముచేయుచు ప్రవేశించును.]

బ్రహ్మాండంపతులు

ఓహో! దయచేసినారే: భోజనమైనదా? కూర్చుండుడు. (వున్నవారితో)వీరిది విశాఖపట్టణము. మహావిద్వాంసులు. నాటక మొకటి వ్రాసినారట, చదువవలెనని కుతూహలపడుచున్నారు. రసజ్ఞులగు మీరందరను గ్రహించినట్లయితే చదివెదరు.

వదరువాయి

అభ్యంతర మేమి. శ్రవణానందముగ విందము. హాలువద్దకు వెళ్లడాని కింకా గంటకాల ముందిగా! ఇంతలో వర్షముగూడ తగ్గవచ్చును.

పానం

చూచుటకు మహాకవిగానున్నారు. మంచితేజస్వి.

కవి

పంతులువారి అనుగ్రహమున మహాకవినే. యెట్లందురేమో? వారి సహధర్మచారిణి యీ పదిదినముల నుండి పోసిన పాలు పెరుగు నాకడుపున నిండి, అలలు గొట్టుచుండ, భర్తల గానని లక్ష్మీసరస్వతులు పాలసముద్ర మని భ్రమించి నాకడుపున తొంగిచూచిరి. సరస్వతి నా గర్భగోళమున నుంట మహాకవిని గాకుండు టెట్లు? ఇక లక్ష్మీప్రసన్నతకై వేచియున్నాను. తమయందరి యనుగ్రహ ముండిన నచిరకాలముననే సఫలీకృత మనోరథుడ నగుదును.

నల్లులతిత్తి

సాధు, సాధు. కాళిదాసుని జంపి పుట్టితి వయ్యా.

పంతులు

తమ నాటకములో నేదేని యొకభాగము జదివిన విన నపేక్షించుచున్నాము. కానిండు. మఱల నాటకమునకు వెళ్లవలసి యున్నది.

కవి

భాగ్యము. నా నాటకమునకు "భరతరాజ్యమని" పేరు పెట్టితిని. పురాణగాథ ననుసరించుచు ప్రస్తుత రాజకీయాందోళనల విమర్శించుట నాయుద్దేశ్యము. కొంత చదివెదను. సావధానులరై వినవేడెద.

వదరువాయి

'భారతరాజ్య' మనలేకపోయినారా? పేరును బట్టిగూడ వుంటుంది యీదినములలో డబ్బు.

కవి

చిత్తము. ఆయోచన నాకుగూడ స్ఫురించినది. కాని సర్కారువారి ఆక్షేపణ కలుగునని ఇట్లు చేసితిని.

మడతపిల్లి

ఓహో: నిజమే నిజమే. ప్రారంభించండి.

కవి

(చదువును.) "(ప్రవేశము మునివేషమున నున్న భరతుడు. అంజలిబద్ధుడై) అహో, సకలభూవలయ

నేతా భరతమాతా, మాం పాహి మాం పాహి మాం రక్ష. జననీ ఈభూభారము మోయలేనని సంశయము వొడముచున్నది. ఏలాగో యింతటి సామ్రాజ్యము నామెడ జుట్టించి పాలనాదక్షుల, మహాశక్తియుతుల, యశస్కాముల, మహాగ్రజుల నటవిపాలు గావించితివి.

పాట:—

నమస్తే శ్రీభరతమాత, జగన్నేత,
ఆలకించి నామనవి, ఆయాసము దీర్పరావె. న.

సారసాక్షి నీపద, పద్మముల నే గొలిచెద,
ప్రీతితో మాయన్నను, గొనితెచ్చియాపదబాపవె. న.

మాతా! నన్ననుగ్రహింపుము. కాదేని నీపాదము లాన నే నసువుల బాసెదను.(మెడకు త్రాడు గట్టుకొన నుద్యమించుచుండును.)

(ఒకచారుడు ప్రవేశించి, ఆత్మగతము) నాపైగల మక్కువచే రాణియగు కైకేయి నన్ను బిలిచి వత్సా మండూకా! రాము పదునాలుగేండ్లరణ్యవాసము జేయ బనుపుటయు, నా యనుంగు పుత్రుని భరతుని సింహాసనాధిష్ఠితు జేయనే యత్నించుటయు, తక్కుంగల విషయము లన్నియు నీ వెఱిగియే యున్నావు గదా! ఏలాగో భరతుడు జడభరతుడై రాజ్యకాంక్ష లేక వెఱ్ఱివలె సన్యాసిగా జూచుచున్నాడు. నన్నెంతయు దూరుచున్నాడు. నే ననుదినము దరిలేని దుఃఖసాగరమున మునింగిపోవుచున్నాను. నన్నీ విపత్తునుండి గాపాడ నీవసమర్థుడవని నే నెఱుగుదును. ఎటులేని నాసుతుని భరతుని చెంత కేగి నీబుద్ధికుశలతచే వానిమనసు ద్రిప్పవలయు. అటు గావించితేని నీ కేకొఱతయు గావింపను. నాకొడుకే రాజైన నీ కేమికొదువ యని పలికినప్పటినుండియు నే నెంతయో ప్రయత్నించుచున్నాను. ఎన్ని మాయోపాయముల బన్నినను ఈ రాకుమరుడు నామాటల పెడచెవిని బెట్టుచున్నాడు. మరల బ్రయత్నించెద గాక, (అని సమీపించి! ప్రకాశముగ) భ్రాతృభక్తి భరితా: దిగంతవిఖ్యాతచరితా: భరతా! ఇటు నీదేహము శుష్కించునటుల నీ వేదో యాలోచనలో మునింగియుండ ప్రజ లత్యంత దురవస్థలో నీడుచున్నారు. వారి మనస్తాపము నపనయింపక నీ విటు లుండుట రాజధర్మమా? శ్రీరాముపై నీకు గల ప్రేమయు, సాధ్వియగు సీతపై నీకున్న భక్తియు లోకు లెరుంగుదురు. కాని అందుచే కర్తవ్యము విచారింపక యిటు లుండుట పాడి గాదు.

భరతుడు—(ఆత్మగతము) ఔరా: ఈ వృద్ధజంబుకము మఱల మఱల నను మోసగింప జూచుచున్నాడు. వీనిటక్కులు నే నెఱుగనని వీని యభిప్రాయము. అయినను కానిమ్ము. (ప్రకాశముగ) మండూకా! నీ ప్రేమకు నే నెంతయు కృతజ్ఞుడను కాని ప్రజలవిపత్తును మాన్ప రామచంద్రుడే సమర్థుడు. ఆమహామహుని ప్రార్థించి కొనివత్తము. నన్ను బ్రతిమాలకుము.

మండూకుడు—(తనలో) ఆహా, వీడు నామాట వినునట్లు లేదు. (ప్రకాశముగ) రాజశ్రేష్ఠా! నీతల్లి దుఃఖము బాప నీభారము గాదా?

భరతుడు—(జనాంతికముగ) ఔరా! ఎన్ని మాయలు పన్నుచున్నాడు. (ప్రకాశముగ) ధర్మ మొకవంక, తల్లియొకవంకయు నైనపుడు ధర్మము నుద్ధరించుట శ్రేయముగదా!

(పాట—డైలాగు)

మండూక—ప్రజలెల్లనీపయి అనురాగ యుతులయి
జూడనిచ్ఛగింప ఇటు లుండ జెల్లునే!—ఏలా భరతా.

భరతుడు—తల్లితల్లియంచు పలుమారు బలికెదు
ధర్మానకన్నను, జననియు నున్నదే—పొమ్మో
మండూకా.

(మండూకుడు పోవును. భరతుడు కంఠమున కుఱి బిగించుకొనుచుండును. భరతమాత ప్రవేశించి) మానుము, మానుము. భరతపుత్రా! భరతా! భక్తిభరితా. కీర్తిభరితా! ఈఘోరోద్యమమును మానుము. కోరుము వలయు వరముల."

పానం

భరతమాతను పైనుండి దింపవలసినదే గదండీ.

కృష్ణరావు

ఆహా: కప్పీపైనుండి దింపాలి.

శెట్టి

అప్పుడొక నేలటపాకాయి గొట్టినా బాగుంటుంది.

వదరుబాయి

భరతుడు కర్పూరహారతిచ్చి మంగళం పాడాలి.

నల్లులత్తిత్తి

మంగళం గాదు, జాతీయగీతము బాడితే మేలు.

[ఉరుములు గర్జించుచుండును. తలుపులు గొట్టుకొనుచుండును. వర్ష మధికమైపోవుచుండును.]

---

## విద్యున్మాలికలు

శ్రీరంగం శ్రీనివాసరావుగారు, బి. ఏ.

బారులు బారులుగ తీరిన
మబ్బుగుబ్బలుల దారుల
దారి తప్పి చరించె
ఆరేయి తరళసర శేరమ్మదములు.

అవి, కవిడెందమందు గగురుపొడిచి
ఓరగా,
కోకిలపాట జీరగా,
పైరులపైపయి సోకి చను
తూరుపుగాలి
తీరుగా, కవిడెందమున
తాకి తాళనటుల తరలిపోయిన
ఏపెన్న భావాలో!
భారంపుసిగ్గు తడి యారక
నుడిలో విడుదలవడజాలక
విహ్వాలించు
ఏపిన్న భావాల పరిమళతరంగాలో
ఆనాటి చకచకిత చంచలావితతి!

స్వర్గవీథీవిహారతారకలు మారి
శాపవశాన,
మానవునితోట మడికట్లలోన
ప్రవాసపు బ్రదుకుతోన
నవయుచుండియు నవ్వువెల్లువలు జల్లు
రకరకాల రంగుల వికచ లతాంతసంతతులుగ
వినువీథిమీద
తమకోరికలతోడ పూరితములైన
కనుల కాంతి వినయ విస్మృమరత లేమొ,
ఆనాటిరేయి నవఘులించిన
శంపాసహస్ర
నిశావిశాలకుహారవిహారములు!
అవి యేమొ?

గామినీ విసీలగేహ దేహళీ
విష్ణుక్రాంత నితాంత తోరణములో?
ఆటలాడు వేలుపుబాలికల
పావడాఅంచుల బంగారుతీవియలో?

కావవి!
వేటకాని కోలలకు కూలి
వేదనల తూలు హరిణాలకండ్లు,
జాలికి పురుటిండ్లు——
దిక్కుదిక్కుల కంపిన దీనంపుచూడ్కులే
ఆ నాటి
ప్రళయ తాండవ భయంకర సౌదామినులు.

---

# పరిశోధకులు

విశ్వనాథ సత్యనారాయణగారు

కొన్ని ఏండ్లకింద చెన్నరాజధానిలో హైస్కూళ్లల్లో నాండీటైల్డు టెక్స్టని (Nondetailed text) నాలుగైదు ఫారాలకి రాజస్థానకథలు కొన్ని పెట్టేవాళ్లు యింగ్లీషులో. ఈ యింగ్లీషుస్కూళ్లల్లో తెలుగు చెప్పే మేష్టర్లకన్న తక్కిన సబ్జక్ట్లు చెప్పే మేష్టర్లూ, వాళ్లకన్న యింగ్లీషుచెప్పే మేష్టర్లూ ఎక్కువని అందరికినీ తెలుసునుకదా. ఆయింగ్లీషు చెప్పే మేష్టర్లని చూస్తే పిల్లలకి హడలు. పరీక్షలో తప్పించటమో, ప్యాసు చేయడమో వాళ్ల చేతుల్లో ఉండేది. పైగా యింగ్లీషు చెప్పే మేష్టరంటే పెద్దపండితుడనీ, వాడి నోటివెంబడి ఏదైనా వస్తే వేదాల్లో ముక్కైనా తప్పుతుంది గాని అది కాదని.

ఒకపల్లెటూరులో అక్కడ ఉన్న పెద్ద రైతు లందరూ కలసి వాళ్లు చాలా డబ్బు కల వాళ్లు కావటంవల్ల క్రమక్రమంగా ఎలిమెంటరీస్కూలల్లా హైస్కూలు చేయించారు. చెయ్యటంతోటే బస్తీ తయారు, దిగాలబడ్డ మొగాళ్లతో యింటికెళ్లే మేష్టర్లు తయారు, పిల్లల అల్లర్లు తయారు. చదువు ఎక్కడిది కక్కడికి మట్టం అయిపోయేది.

కాని, యింగ్లీషు చదువటంతోటే, మన దేశం ఎట్లా వున్నా సరే ఇంగ్లాండు దేశం ఎట్లా వుందో దాన్నిగురించి హోరాహోరీ కుస్తీలు. మనభాష ఎట్లా వున్నా సరే, ఇంగ్లీషు బాగా వచ్చునా లేదా విద్యార్థులకు, దాన్నిగురించి తగాదా. ఒక చక్కని చంద్రమొద్దు, వాడి ఖర్మంచాలక బాగా యింగ్లీషు వ్రాశాడా వాడు చాలా తెలివిగలవాడు. తెలుగులో ఎంత తెలివిగలవాడైనా యింగ్లీషులో మార్కులు సరిగ్గా రాకపోతే తప్పించటమే.

అప్పుళ్లో ౫ వ ఫారానికి యీ రాజస్థాన కథలు టెక్స్టు—అనగా పాఠ్యపుస్తకం. ౫ వ ఫారంలో మూడుడివిజన్లు. రెండుడివిజన్లకు జి. రామచంద్రరావుగారు యింగ్లీషు చెపుతాడు. ఒక డివిజన్కి యమ్. సీతారామయ్యగారు చెప్తారు. ఇద్దరూ బి. యే., యల్. టీ. లే. అమోఘమైన తెలివితేటలు గలవాళ్లు. అనగా బి. యే., యల్. టీ. లందరూ ఎంత తెలివిగల వాళ్లో అంత తెలివిగలవాళ్లు.

ఈకథ యిట్లా ఉండగా, ఆరెండుడివిజన్ల వారికి రామచంద్రరావుగారంటే లార్డుక్లైవు (Lord Clive), వెలస్లీ ప్రభువు (Wellesly). ఆయన్ని మించినవాళ్లు సృష్టిలో ఉండరు. మిగిలిన డివిజన్ల వారికి సీతారామయ్యగారన్నా అంతే.

ఇంక, వాళ్లిద్దరికీ, ఒకళ్లను చూస్తే ఒకళ్లకి జలుబులు. రామచంద్రయ్యకన్న సీతారామయ్య తనకు బాగా యింగ్లీషు వచ్చుననీ, అసలు తన యింగ్లీషు Bernard Shaw కి

ఫొటో అని. యదార్థానికి Shaw పుస్తకం ఒక్కటైనా ఆ ప్రభువు చదివిన పాపాన పోలేదు. రామచంద్రయ్యగారి ఉద్దేశ్యం మెకాలే (Macaulay) చచ్చి తనుగా పుట్టేననీ. వాళ్లిద్దరూ యింగ్లీషులో యమాహేమీలు. సీతారామయ్యగారు Classical English గుత్తగొన్నాడనీ, రామచంద్రయ్యగారు Modern English గుత్తగొన్నాడనీ—ఇద్దరూ కలిసి ఛాసర్ (Chaucer)దగ్గరనుంచి యింతవరకూ. 'వాడుట్టి Pedant, వాడి కేమొచ్చు యింగ్లీషు?' అని సీతారామయ్యమీద తోల్తాడు రామచంద్రయ్య. 'ఈ వెధవకి Is, Was ఎక్కడ వెయ్యాలో తెలియదు' అని రామచంద్రయ్యమీద సవారి తీస్తాడు సీతారామయ్య. ఇదంతా క్లాసులో పిల్లలముందు. మళ్లీ, యిద్దరూ కలుసుకుంటారా, 'ఏమండీ రామచంద్రయ్యగా' రంటే 'ఏమండీ సీతారామయ్యగారూ?' ఇద్దరికీ చెరో ఫన్నెండేళ్ల కొడుకులూ. ఇద్దరూ ఫస్టుఫారం చదువుతున్నారు. సహాధ్యాయులు. వీళ్లిద్దరి భార్యలూ యింటివద్ద స్నేహితురాండ్రు. కనక వీళ్ల విరోధం యింగ్లీషుతోనే ఆగిపోయింది, తెలుగుదాకా పట్టలా. స్కూలుతోనే ఆగిపోయింది, యింటిదాకా పాకలా.

ఇంతకూ ఏతావాతా కథ ఏవిటంటే: నాండిటైటులో Punna అని ఒక మనిషి వస్తుంది. ఆపేరు ఒక ఆవెడిది. ఆవిడ రాజపుత్రస్త్రీ. ఆపదలో ఉండి ఆవిడ తన చేతి రుమాలు ఒక రాజపుత్రుడికి బహుమానం బంపింది. ఆచేతి రుమాలు ఎవరికి పంపితే వాళ్లొచ్చి ఆవెణ్ణి ఆపదలోంచి రక్షించాల్ట. అది వాళ్ల ఆచారం. అసలు కథ అది.

అసలు కథకూ మనకూ ఏమీా సంబంధం లేదు. ఆవిడపేరు సీతారామయ్య 'పన్నా' అని చెప్పాడు. రామచంద్రయ్య 'పున్నా' అని చెప్పేడు. ఒక పదిరోజు లైనతర్వాత సీతారామయ్యడివిజన్‌లో ఒకడు రామచంద్రయ్యడివిజన్ వాడితో మాట్లాడుతూ 'పన్నా' అన్నాడు. అక్కడ రామచంద్రయ్య డివిజన్‌వాళ్లు ఐదార్గురు ఉండి, వాళ్లందరూ కలిసి వీణ్ణి ఏడిపించారు, 'పన్నా ఏవిటా double పన్నా, single పన్నా' అని. అది సరిపోయిందా, ఆకుర్రాడెక్కడ కనపడ్డా సరే, రామచంద్రయ్య డివిజన్‌వాళ్లు సింగిల్ పన్నా, డబుల్ పన్నా అని కేక లెయ్యాటం మొదలెట్టారు. వాడికీ ఒళ్లు మండింది. వాళ్ల డివిజన్‌వాళ్లని పదిమందిని పోగుచేసి యాగీచేసేడు. అవతలవాళ్లని ఏడిపించటం ఎట్లాగా అని వాళ్లందరూ గూడుపుఠాణీ చేసారు. వాళ్ల అదృష్టంకొద్దీ వాళ్ల హైస్కూలు బంట్రోతుపేరు పున్నయ్య. ఇంక రామచంద్రయ్యడివిజన్‌వాళ్లు ఎక్కడ కనపడ్డా సరే, 'బంట్రోతు పున్నాయి, బంట్రోతు పున్నాయి......' అని వీళ్లు కేక లెయ్యాటం మొదలెట్టారు.

ఆవేశాలు బాగా పెరిగినై.

క్రమంగా దెబ్బలాటల్లోకి దిగింది. అవతలడివిజన్ వాళ్లు కనపడితే ఫౌన్ టెన్ పెన్ సిరా అంతా వాడి వీపుమీద map వెయ్యటం. Swan ink bottles ఆగలా. ఒక్కొక్కప్పుడు ముక్కులమీద గుద్దుకోటం ఒక్క ముండాకొడుకుల్ని రెక్కపుష్టి గలవాళ్లు దొంగగుద్దులు గుద్దటం. హెడ్మాష్టరికి రిపోర్టులు వెళ్లినై. ఆయన కొందరికి ఫైన్లు వేశాడు. కొందరికి ప్రహరణాల్తో సరిపోయింది. అంతటితో కుఱ్ఱాళ్లల్లో సద్దుమణిగింది.

కాని అది 'పన్నా?' 'పున్నా?' రామచంద్రయ్య సీతారామయ్యలకు తేల్లా. సీతారామయ్య ఓపికకల మనిషి. అది 'పన్నా' అని నిర్ధారణచేద్దా మనుకున్నాడు. ఆలోచించాడు. Todd's రాజస్థానం అంతా తిరగేశాడు. ఒకసారి బెజవాడ వెళ్లితే గెజట్లూ గిజట్లూ తిరగేశాడు. లైబ్రరీలు గాలించేడు. ఎక్కడా ఆసరా చిక్కలా.

ఒకరోజున వాళ్ల అబ్బాయి తెలుగు టెక్స్టు చదువుకుంటున్నాడు. అందులోయిల్లా చదివేడు కుఱ్ఱాడు: 'శిశిరఋతువు వచ్చెను. వృక్షముల పర్ణములు రాలెను' అని. సీతారామయ్య యీ వాక్యం విన్నాడు. కుర్చీలోంచి ఎగిరి గంతేశాడు. 'చిక్కిందిరా పట్టు' అన్నాడు. ఇంతలో వంటచేస్తున్న ఆయన పెళ్లాం గాబరాపడి బైటికి వచ్చింది. 'ఏమిటేమిటి' అంది. ఏమిటీ లేదు, గిమిటీ లేదు, సీతారామయ్య ఎగురుతున్నాడు. ఆవిడ మడి కట్టుకోనివుంది పాపం. 'ఏమిటి చెప్పండి. తేలూ గీలూ ఏమైనా కుట్టిందా ఖర్మం' అంది. ఆయన 'తేలూ లేదు, ఏమి లేదు. పర్ణ శబ్దంలోంచి పన్న అన్నశబ్దం పుట్టిం' దన్నాడు. ఆవిడ కొంచెం గడుసరుల యింటి పిల్ల. 'ఆఁ అల్లాగుటండీ!' అని నోటిమీద చెయ్యి వేసుకోని ఒకవిధమైన వెక్కిరింపునవ్వుతో లోపలికి పోయింది. మొహం చూస్తే 'భలే మొగుడ్రా!' అనుకున్నట్టుంది.

సరే యింకా ఏం. ఈపరిశోధన పిల్లలకు చెప్పి సవాలు విసిరేడు సీతారామయ్య. రామచంద్రయ్య కొంచెం మట్టిబుఱ్ఱ. అతగాడికి ఏమీ తోచిందికాదు సాధనం. ఒక నెలైంతర్వాత పున్నా శబ్దం మాత్రం ఏ సంస్కృత శబ్దంలోంచో పుట్టి ఉండకూడదా అనిపించింది. ఎందులోంచి వచ్చివుండవచ్చునో మాత్రం తోచింది గాదు. గాభరా పడుతూన్నాడు. పదిహేను రోజుల కోసారి కొత్త సవాలు వస్తూనేవుంది. చస్తాడూ?

రామచంద్రయ్యకి బృహస్పతి మంచి గడికి తిరిగేడు. వాళ్ల బావమరిది తెలుగు, సంస్కృతం చదువుకున్న గడుసుపిండం. వాడికి యింగ్లీషు రాదు. రామచంద్రయ్య తను యింగ్లీషు చదువుకున్నానని నిక్కుపోతాడు. ఇంగ్లీషు చదువుకున్న వాళ్లు సర్వసూన్యంగాళ్లని వాడు లుస్కరిస్తాడు. ఆరోజున వీళ్లయింటికి ఆయన చక్కావచ్చేడు. భోయనంవేళ్ల తాను B.A., L.T. ప్యాసైన దర్జా సహం చంపుకోని,

యీకథ బావమరిదితో వెళ్లపెట్టాడు. వాడు వెధవపెంకె. 'బావా, నీబుద్ధి పూర్ణాను స్వారం' అన్నాడు. రామచంద్రయ్యకి అర్థం కావడానికి అనుస్వారం అడ్డువచ్చింది. ఏమైపునా కైవారమే వత్తుకుంటోంది. మరి కాసేపు ఏడిపించి, బావమరిది "'పూర్ణ' శబ్దం లోంచి 'పున్న' వచ్చివుండవచ్చు"అన్నాడు. ఇంకా నేం, రామచంద్రయ్యకు చల్లా అన్నం సయించలా. కాని స్కూల్లో యింగ్లీషు పీరియడు నాల్గోపీరియడు గాని తగలడి చావలేదు. అందాకా వెధవనారదుడుమల్లే గుక్కపెట్టుకోని క్లాసులోకి వెళ్లటంతోటే ఊదేసు. వారంరోజుల్లో పున్న అన్నశబ్దం పూర్ణశబ్దభవమా పర్ణశబ్దభవమా తేలింది గాదు. ఎవరికొమ్ములు వాళ్లు కాశారు. ఈ వ్యవహారం తేలింది కాదు. క్రిస్టమస్ శెలవలు వచ్చినై.

మెడ్రాసు పోయి, పెద్ద పరిశోధనాపండితులు (Research scholars) ఉంటారు, వాళ్లను పోయి యీవిషయం కనుక్కుంటే గాని తేలదనుకున్నారు యిద్దరు. ఇద్దరికీ బైటకు స్నేహమేగా! మెడ్రాసులో మూర్ మార్కెటు (Moore Market) చూడచ్చు. బీచ్ (Beach) ఒడ్డున కొంచెం షికారు కొట్టచ్చు. (Elphinstone) ఎల్ఫిన్స్టన్ అలంకరించచ్చు. కావలిస్తే గిండీ (Guindy) లో చిలుం వదుల్చుకోచ్చు. ప్రధానంగా పెద్దపరిశోధనా విషయం తేల్తుంది.

ఇద్దరూ కలసి ప్రయాణం కట్టారు. మర్నాడు బయల్దేరారు. బయల్దేరి వాకిట్లో కొచ్చారు, తాంబూలం నములుతూ. ఆవూళ్లో ఓ పిచ్చి దుంది. 'ఈవూరు కొత్తగా వచ్చిన మేష్టర్లు చచ్చారోయి' అని కేకవేస్తూ ఎదురుగా వచ్చింది. 'ఛీ, వెధవశకునం' అని ఆరోజుకి ప్రయాణం ఉపసంహరించుకున్నారు. ప్రభువులు, చాదస్తానికి నిధులు. మర్నాడు మళ్లీ సావకాశంగా భోయనం చేసి, అటూ, యిటూ ఎవ్వరూ లేరనిపించుకోని బయల్దేరారు. ఇంతలో గొడ్డుచస్తే రాంబందు తయ్యారయినట్టు ఒక వెధవముండ తయారైంది. ఛూ, ఛూ, అనుకోని, ఆనాడు ప్రయాణం మానేశారు. మళ్లీ మర్నాడు బయల్దేరేరు. ఆరోజున తమ యిద్దరు కొడుకులూ ఎదురుగా వచ్చేరు. ఉపనయనం కాకపోయినా యిద్దరినీ బ్రాహ్మల కింద లెక్కించి, శకునం బనాయించి, బయల్దేరి బెజవాడ వెళ్లేరు. బెజవాడలో కొంతసేపు కాలక్షేపంచేసి మెయిలు పట్టారు పట్నంకి. బేశిన్ బ్రిడ్జిదగ్గిరికి వెళ్లేటప్పటికి యిద్దరికీ సహాధ్యాయి ఒకడు కనపడ్డాడు. వాడు పరమ అల్లరివాడు. వాడూ యల్.టీ. ప్యాసయినాడు. 'ఏరా, ఉద్యోగం ఎందుకురా' అంటే 'ఏదో పొట్టకురా'అంటాడుగాని, తానొకపెద్ద మహాకార్యం చేస్తున్నానని, విజ్ఞానం వెదచల్లుతున్నానని అనుకోడు, అనడు. అతడికి వెఱ్ఱిపుచ్చకాయిముండాకొడుకుల్ని పట్టించడం పని. అంచేత వాణ్ణి చూడ్డంతోటే మన పరిశోధకులిద్దరికీ మొహం మాడింది. వాడు వదిలి

పెడతాడూ? పలకరించాడు. వాడూ ఏదో position లో ఉన్నాడు, status కలవాడుకదా అని మాట్లాడేరు. పట్నంలో దిగి ఓబండిలో కూర్చున్నారు. 'ఎందుకురా పట్నంవస్తున్నారు' అని అడిగేడు వాడు. రామచంద్రయ్య పూస గుచ్చినట్టు చెప్పేడు అంతా. చెప్పి, మెడ్రాసు బయలుదేరటం, మొదటిరోజున పిచ్చిది ఎదురుగా రావటం, రెండవరోజున ముండ ఎదురుగా రావటం, మూడోరోజున కొడుకులు ఎదురుగా రావటం, చెప్పి, చివరకు, ఎట్లాగైనా పట్నం వచ్చామయ్యా అన్నాడు. 'వచ్చి ఏమి లాభం, పని యింటి దగ్గిరే అయింది' అన్నాడు స్నేహితుడు. సీతారామయ్య తెల్లపోయి చూశాడు. 'ఇంటిదగ్గిర ఏమైం'దన్నాడు. 'మీ పరిశోధనలకు సమాధానం యింటి దగ్గిరే వచ్చింది గదా' అన్నాడు. మళ్లీ యిద్దరూ గాభరా పడిపోయారు.

స్నేహితుడు—అయ్యో, తెలివి; మొదటి రోజున పిచ్చి, రెండోరోజున ముండ, మూడోరోజున కొడుకులూ—'పిచ్చి...ముండా...కొడుకులు' అని యింటిదగ్గిరే వస్తే, ఎందుకురా?

వాళ్లిద్దరికీ వాణ్ణి మింగుదా మనిపించిది. —కాని వాడే మింగగలు.

---



శ్రీ లక్ష్మీనృసింహస్వామి ఆలయ మహాద్వారము, కదిరి

ఛాయాచిత్రకారుడు: బి. యస్. రాయుడు, మదనపల్లె.

## ని వే ద న—౫

శ్రీమతి చావలి బంగారమ్మగారు

ఆనాడు చెప్పేను ఈనాటికైన
    అత డేమి చెప్పెనో అది తెలియదాయె;
వస్తాడు పోతాడు వరుసగా తాను
వక్కనాడైన తా వచియింపడాయె!

ఇల నుండువారిలో నెవరి వేడుదును?
ఈశ్వరుని వేడనా ఇంపు గూర్పగను?
ఇద్దరూపెళ్లాల ఇరుకు నున్నాడు,
ఇంపు గూర్చుటకు తన స్వాం పేమి గలదు.

మాంగళ్యగౌరు నీ మహిమ జెప్పెదవ?
మగడు విడకుండగ మైక మిచ్చితివ?
అతనిలో నిమిడిన అర్ధరూపిణివి
అతని పొందగలట్టి అనుభవం బేమి?

పతిప్రేమ బడసిన భాగ్యశాలివనా
పలుమారు బిలిచిన పలుకకున్నావు:
సర్వేశ్వరుడు నిన్ను సరసనే యుంచి
సరసమా గంగను శిరసు నుంచేడు:

తల నున్నగంగకై తపము సేయుచును
పలవించుచున్నాడె పంచాక్షరములు:
యింతమాత్రమునకే యింతి గర్వించి
సంతసింపగవలెనె స్వాంతమ్ములోన?

---



దో సె పో త

ఛాయాచిత్రము: శ్రీ బి. శారదాబాయిగారు తీసినది.

# తగిలినవేలికే తగులుతుంది

(రెండో భాగం *)

వేలాల సుబ్బారావుగారు

కలెక్టరుగారు శిక్ష వినిపించిన యనంతరం సాభసాను లోహనిర్మితహస్తకంకణాలంకరణపూర్వకంగా మద్రాసులో పశ్చాత్తాపమందిరాని (Penitentiary) కి తీసుకొనివచ్చారు నలుగురు సాయుధులైన ఇతనిపూర్వపు ఉద్యోగీయులు అనవసరపు దండుగచేటు కట్టుదిట్టా లన్నింటితో. ఈ పెనిటెన్షియరీలో కొంతకాలం తరిఫీతు నొందినపిదప వేలూరు సెంట్రల్ జయిలుకు రవాణా చేయవలసిందని జైళ్ల ఇన్స్పెక్టర్ జనరల్ గారి యుత్తరువు. రాజధానిలో అక్కడక్కడ ధర్మసంరక్షణార్థాయ నెలకొల్పబడిఉన్న కేంద్రకారాగారాల (Central Jails) కన్నింటికీ ఈ పెనిటెన్షియరీ ఒక తరిఫీయత్ సంస్థ (training institution) వంటిది. ట్రెయినింగు సంస్థలలో తరిఫీతు నందిన యల్. టీ., బీ. టీ. లకు బాలికా బాలకులసంస్కారశాల(Schools & Colleges)ల్లో మెలగడానికి జ్ఞానానుభవయోగ్యతలు కలిగేలాగున పెనిటెన్షియరీలో తరిఫీయతును పొందిన పీ-టీలకు (Prisoners Trained) కూడా మానవసంస్కారశాలల్లో (కారాగృహాల్లో) మెలగడానికి జ్ఞానానుభవయోగ్యతలు కలుగుతాయి. బీ-టీలకూ పీ-టీలకూ పదవిభేద ముండనీండిగాక. పాపం మనస్వామిభక్త సార్జెంటుకు పూర్వపదాలకన్నింటికీ భ్రంశం కలిగినపుడు మన మీ 'సాభసా' పదాన్నంటుకు వేలాడడం ఎందుకూ? వీరయ్య అని ఇతని అసలు పేరునే ఇకనుంచి వాడుకొందాం.

మద్రాస్ సెంట్రల్ స్టేషన్ వద్ద రైలు దిగి రక్షకభటచతుష్టయ పరివృతుడై ప్లాటుఫారంమీద పనిడీక తిరిగే ప్రయాణీకుల ఉత్కంఠా పూర్ణదృష్టులనూ, పనిలేక తిరిగే సోమరిపోతుల మందావలోకాలనూ, తనవైపునకే ఆకర్షించుకొంటూ, వీరయ్య నడచి బయటకు వచ్చి అక్కడ నదివరకే తనస్వాగతార్థం వచ్చి కనిపెట్టుకొని యున్న పోలీసులారీ నెక్కి పెనిటెన్షియరీవద్ద చేరాడు. ఎటెన్వన్తో బందు లారీలోపలగూడా కాచుకొనే నిలుచున్నారు పోలీసుమాతలు వీరయ్యను. జైలుముందు లారీ ఆగంగానే దాన్నుంచి ముగ్గురుమాతలుదిగి ప్రక్కనే వున్న పోలీసుకచేరీలోనికి వెళ్లారు. అనంతరం ఇతనికి జెందిన కాగితాల నన్నింటిని భద్రంచేసికొని మిగిలిన మాత ఒక్కడూ ఇతన్ని నడిపించుకొనిపోయి పెనిషియరీ మొదటిగేటును దాటించినాడు. ఆగేటు దాటి లోపల కాలు పెట్టడంతోటే ఆరంభమైంది జైలుతంతు.

ముందు కొంతతంతు జరక్కుండా శుభమో, అశుభమో ఏకార్యమూ సంపన్నం కాదు. నిజానికి కారాగారం కాశీరామేశ్వరాలవంటి ఒకమహాతీర్థక్షేత్రం. ఎల్లప్పుడూ అక్కడే నివాస మేర్పర్చుకొని వుండే తీర్థసంవాసులకు దప్ప కొత్తగా వచ్చే యాత్రికులకు ఎటువంటివారికైనా పుణ్యతీర్థాల్లో వున్నంతకాలం మనస్సులో దుశ్చింతనలు కాని, పాపవాసనలు గాని జనించవు. అదేవిధంగా జయిలుకు వెళ్లిన కొత్తఖైదీలకుకూడా మనస్సు నిష్కల్మషంగా వుండి సదభిప్రాయాలే పుట్టుతూ వుంటాయి. ఇది కాక ఈరెండిట్లో గల మరో సాదృశ్యం ఏమిటంటే, శిరోముండనం. కేశవపనం ఈరెండు రకాల పవిత్రస్థానాల్లో జరుగుతుంది. "కింత్వేతయోః కించిన్మాత్ర విభేదో వర్తతే. ఐచ్ఛికానైచ్ఛిక భేదాత్. వృద్ధవిధవా బాలరండయోః క్షౌరవదితి" కల్పితచాణక్య స్మృతికారుని వాక్యానుసారం, పుణ్యక్షేత్రాల్లో యాత్రికులు తమంతటతామే మోజుపడి క్షవరం చేయించుకొంటూవుంటారు, కాని నాకు వద్దో మొర్రో యని ఏడుస్తున్నా బలవంతాన్ని బట్టి గొరిగిస్తూ ఉంటారు జయిలు క్షేత్రాల్లో. లేకపోతే నూనే, కుంకుడుకాయలకే దండగ్గా తగలెయ్యాలిసి వచ్చేది ఏఅత్యంతావసరమైన భారతీయరక్షక సైనికవ్యయ

* దీని మొదటిభాగము అశ్వీయుశమాసము (అక్టోబరు, ౧౯౩౭) సంచికయందు ప్రకటితము.

సద్వినియోగానికో పనికివచ్చే లక్షలకొలది ద్రవ్యరాశినీ. దానికి తోడు ఈకారావాసం ఒకవిధమైన సంస్కారం. దీనివలన పశ్చాత్తాపం, జ్ఞానం కలిగి మానవునిలో కొంత పరివర్తనం గలిగితీరుతుంది. కాబట్టి ఇది సప్తదశసంస్కారమని లెక్కించుకోవచ్చు. ఈప్రకారం పుణ్యతీర్థ సంస్కార సమ్మేళనస్థానం కావడంచేత జైల్లోకూడా జరిగి తీరాలి కొంతతంతు. జరుగుతుంది కూడాను. ఇది యొక విలక్షణమైన తంతు. కొన్నిసంవత్సరాలక్రిందటి వరకూ, ఎవరికో కొందరికి పుణ్యాత్ములకు దక్క సర్వ సాధారణంగా అందరికీ లభించేది కాదు ఈతంతు సంబంధమైన జ్ఞానం. ఇటీవల నూతనంగా బ్రిటిష్ ఇండియా ప్రభుతాసతీమతల్లి కావించిన నోములపంట, ఆమె సలిపిన పుణ్యదానోపవాసాదుల ఫలం ఏకీభవించి సుకుమారకుమారరూపంతో మనదేశమునం దవతరించివున్న సంగతి భారతీయుల కందరికీ తెలిసిన విషయమే. కుమారబ్రువుని భావికార్య నిర్వహణశక్తిని బాగుగా గుర్తించే జననీ జనకులితనికి లాఎండ్ ఆర్డ రని శుభనామకరణం గావించారు. ఆహా! ఏంపిల్లవా డనుకొన్నారూ? చిచింద్రీ. చిచింద్రేమిటీ! విద్యుత్కణం, పిడుగు. దానికి తోడు దుర్భేద్యాలైన ఆర్డినెన్సు కవచాలతో జననం. ఇకేంకావాలీ! మహాభూకంపం భూమిని ఊటాడించినలాగు పుట్టేపుట్టడంతోటే గజగజలాడించేడు ఆసేతుహిమాచలం భారతవర్షాన్ని. ఇది మహాపురుష లక్షణం. మహానుభావుపుట్టినపుడల్లా అలౌకిక భౌతికఘటనాలుసంభవిలు స్తూఉంటాయి. రెండేడ్లైయినా దాటాయో లేదో, ఆగర్భశ్రీమంతులకు, అపూర్వంపశ్యేలకూ, అపూర్వస్తనంధయులకు, అశీతివర్ష ప్రాయులకు కృష్ణజన్మస్థానావాససౌభాగ్యం అనాయాసంగా లభించేలాగు చేశాడు లింగవయోజాతి వివక్షత లేకుండా వత్సే. విలక్షణ దివ్యయోని సంభూతుడు కావడంచేత నాచిట్టితండ్రికి ఆరునెల్ల కొకపర్యాయం కాయపరివర్తనం కూడా లభిస్తూ ఉంటుంది. ఈకాయపరివర్తన సమయాల్లో కుక్షింభరులూ, వివేకశూన్యులూ నైన భారతీయులనేకులు......ఏమని వ్రాసేది...మహాఘోరం.... అవాచ్యం శిశుహత్యాపాతక మే అని అయినా గణించక, కుమారశ్రీని స్వాహాదేవికి సమర్పించి కన్నతల్లిని దీరని పుత్రశోకంలో ముంచాలని ప్రయత్నించారు. కాని జనకర్తలుఅసహాయశూరులు కావడంచేతవీరియాట లేమి సాగివచ్చాయి కావు. ఆధునిక సమగ్రవిజ్ఞానరహస్య పరిజ్ఞాతలైన జననకర్తలు కవచాలను పునఃసంస్కరించి వత్సను చిరంజీవిగా చేశారని వ్రాయడానికి నాకు అపరిమితానందంగా ఉంది. కావలసినంతకాలం మనిఉండేలాగు చిరంజీవిని నేనుకూడా దీవిస్తా, భారతీయు లందరి తరఫునా: వత్సా, చిరం జీవ! చిరం జీవ!

లాఎండార్డరుకుమార జన్మ
ఖ్యానంభక్తి పఠించినవారికి
వినువారికి వినుపించెడువారికి
గల్గు నిత్య సౌఖ్యాయు రున్నతుల్.

ఇతి శ్రీ తగిలినవేలికే తగులుతుంది కథానకే ద్వితీయభాగే కుమారశ్రీలాయం గార్డర్ జన్మకథనం నామ పుణ్యసంకీర్తనం సంపూర్ణం. శ్రీకృష్ణార్పణమస్తు... క్షమించాలి సుమండీ! కు మా ర నా మ స్మ ర ణ సంజాత మహానందం చేత మిమ్మల్ని ప్రసంగాంతరం లోకి దించాను. కాని నాయీ కథాసంవిధాన సందర్భాలే అటువంటివి. మిమ్మల్ని ఇటూ అటూ పరుగెత్తించాలసే వస్తుంది. కాబట్టి అన్నింటికీ ఒక్కమాటే క్షమాపణ కోరుతూ మీపుణ్యమా యని రవంత ఓపికపట్టి వుండాలిసిందిగా ప్రార్థిస్తాను, దారి తప్పించి పరుగెత్తించినపుడంతా.

ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే, కుమారశ్రీ అనుగ్రహంల్ల ఇప్పుడు కారాగారపుతంతూ మొదలైనవాటినిగురించి చాలామందికి తెలిసేవుంటుంది కాబట్టి విస్తరించి వ్రాయవలసిన అవసరమే లేదు.

మొదటిగేటు దాటడంతోటే వీరయ్య వెంట వచ్చినదూత ఇతనికి జెందిన కాగితాల నన్నింటినీ, అనగా కలెక్టరుగారి శిక్షావిధానం, శిక్షాకాలం, ఇత్యాదుల గురించి వ్రాయబడివుండే కాగితాలను, అక్కడప్రక్కగానున్న లేఖకునిపరం జేసి వెళ్లిపోయినాడు తరువాత ఇతని దగ్గిరవున్న వస్తువులను అన్నింటినీ దాఖలు చేయిం

చుకొని వార్డరొకడు ఇతని కట్టుబట్టలను క్షుణ్ణంగా సోదాచేసి పరీక్షించినాడు. అంటే ప్రాణాపాయం కలుగచేసికోడానికి వుపయోగపడే పనిముట్లేవీ దగ్గర లేకుండా చేయడానికి లేండి ఈపరీక్ష. ఎంత నిర్బంధపరచి బాధపెట్టి ఏదోవిధంగా ఖైదీని మంచిమార్గంలోకి తేవాల్నని కాని అధికారుల అభిమతం, అతనిప్రాణాలను తీయాలినని కాదు. అటువంటి ఉద్దేశమే వుంటే ఒక్క సెకండులో ఎగరగొట్టగలరు కొబ్బరి పుచ్చెల్లాగ వేలకొలది తలకాయలను. కాబట్టి మనుష్యునిప్రాణం దీయడం కాదు, అతన్ని సన్మార్గగామిగా చేయడం అధికార్లముఖ్యాభిప్రాయం. అందుకోసం ప్రాణం పోకుండా వుండాలి, బాధను అనుభవిస్తూ ఉండాలి ఖైదీ. గరుడపురాణంలోని వ్రాతలనుబట్టి యమలోకాధీశుడుకూడా ఇట్టి ప్రాణాపాయం గలుగని పద్ధతినే యవలంబిస్తూ ఉంటారని తోస్తుంది. అంటే, బాధపడుతూ ఉన్నప్పటికీ ప్రాణంపోకుండా ఉండాలి. అందువల్ల అక్కడ జీవుడికి పాపమోచనం, ఇక్కడ మానవుడికి దోషమోచనం; అక్కడ పుణ్యభాగిత్వం, ఇక్కడ సన్మార్గభాగిత్వం కలుగుతూ ఉంటుంది, జీవుడికీ, మానవుడికీ పరేహలోకాల్లో. అక్కడ లింగశరీరం లభించడంచేత జీవుడికి సోదాచేయించుకోవలసిన యవసరం లేదనుకొంటాను. ఇక్కడ ఆలాటి సదుపాయా లేమీ లేకపోవడంచేత ప్రాణాపాయం గావించుకొని ఆత్మహత్యామహాపాతకాని కెర కాకుండా ఖైదీని కాపాడడం నిమిత్తం అతనిదగ్గర అట్టిపనిముట్లేమీ లేకుండా చేస్తుంటారు జయిలు అధికారులు. ఎంతటి పుణ్యాత్ములో చూశారా? చాకులూ, కత్తెరలవంటి వానిమాట అట్లా వుండనీయండి, చివరకు పెన్సళ్లూ, టూత్ బ్రష్షులనుకూడా ఉండనివ్వరు. ఈప్రకారం ఖైదీని సన్మార్గంలోకి దీసుకొనిరావాలినని ప్రయత్నిస్తూ ఒకవేపు, మరోవేపు అతన్ని దుర్వ్యసనాలనుంచికూడా తప్పించి వుంచాల్నని చాలా కష్టాలు పడుతూ ఉంటారు పాపం జైలు నిర్వాహకులు. అందునిమిత్తం మహాతీక్ష్ణంగా సంశోధించి వార్డర్లు వొళ్లల్లోనుంచీ, చంకల్లోనుంచీ, చివరకు బొడ్డుకిందినుంచికూడా బయటికి లాగుతూ ఉంటారు చుట్టపిక్కల్నూ, సిగరెట్టు బీడీల ముక్కలనూ, పొడుంపొట్లాలనూ. పాపం నస్యపువేతగాడికి ప్రాణం దీస్తానంటే అంతచింతా, భయమూ కలుగుతుందో కల్గదో కాని రొంటినుంచి పొడుంపొట్లం లాగుతూ ఉంటే మాత్రం పంచప్రాణాలు నిలువున ఎగిరిపోతాయి. పిచ్చెక్కిపోతుంది. పొడుం బొడ్లో వుంటే అంత పిచ్చిగా వుండదు. లేకుంటే మరింతపిచ్చీ దీంతగలెయ్యా. అట్లాంటప్పుడు నిండుపొట్లాన్ని లాగుతూవుంటే ప్రాణాలు పోవూ? మైకం కమ్మి వొళ్లు తెలియకుండా కింద పడిపోతాడు. మళ్లీ ఏవార్డరు దయాదాక్షిణ్యాలచేతనైనా ఒక్క చిటికెడుపొడుం ఘ్రాణరంధ్రాల్లోకి ఎక్కితేనే కాని మన లోకంలోకి రాడు. తరువాత తరువాత ఏమైనా కానీండి, ముందు సోదా మాత్రం జరుగకపోదు. సోదా యావత్తూ జరిగినపిమ్మట లేఖకుడు వేరొక వార్డరుపరం చేయగా అతనితో కలిసి రెండోగేటు దాటాడు వీరయ్య.

కావడాని కితడుకూడా పోలీసు నౌకరీ చేసిన మనిషే. కాని ఇతని కింతవరకూ పెనిటెన్షియరీవంటి పెద్ద సంస్థలను చూడదగిన అవకాశం లభించింది కాదు. అందుచేత ఇతని కంతా కొత్తగా కన్పడడమే కాక ఇక్కడి వ్యవహారాలన్నీ అవగాహనం కాను కాను ఇతనియందంతకు పూర్వమే ఆరంభమైన మార్పు మరింత వేగంతో వృద్ధియౌతూ పోయింది.

చిన్నతనంలో ఎప్పుడో తెలుగుభాషాంతరీకరణాల్లో చదివివున్న తిలస్మీకథలూ, అరేబియన్ నైట్సు కథలూ ఇతనిస్మృతిపటలంమీద తాండవంచేయసాగాయి. ఖైదీల సంఖ్యనుబట్టి బంతికి ఇద్దరూ, ముగ్గురూ, నల్గురూ, అయిదుగురేసిచొప్పున అనేక పంక్తులుగా దీరి వార్డర్లు ముందు దారి చూపుతూ ఉంటే ఖైదీలు ఒకచోటినుంచి మరొకచోటికి వస్తున్నారు, పోతున్నారు. పొట్టీ పొడుగూ లాగులవారు, తెలుపు ఎరుపు నలుపు మూడు రంగుల టోపీలవారు, తెల్లని హాటు, బూటు, కోట్లవారు బార్లు దీరి రావడం పోవడం మహావిచిత్రంగా గన్పించింది ప్రథమదర్శనంలో. పిదప ఇతడు జైలర్ ఆఫీసుముందు నిలుచొని ఉండగా డాక్టర్ వచ్చి కొలిచి, తూనికేసి

ఎంతఎత్తు ఉన్నదీ వ్రాసుకొన్నాడు. అనంతరం సూప రింటెండుగారు వచ్చి ఇతని నామధామాలను రిజిస్టరు చేసుకొని, పైబట్టల దీయించి పుట్టుమచ్చలూ మున్నగు స్వాభావికపు గుర్తులను మార్కు చేసికొని మరోవార్డరుపరం జేశాడు, మర్నాడు ఉదయాన్నే వెరిఫికేషన్ కోసం అక్కడే హాజరు కావలసిం దని వుత్తరువు చేస్తూ. పిమ్మట భోజనపు ఖాతాలో యితని పే రెక్కించడమైంది. తద నంతరం వార్డ రితన్ని వెంట గొనిపోయి జైలుమధుప ర్కాలను సమర్పించాడు. మధుపర్క ధారణాత్ పశ్చాత్ పతకసమర్పణం జరిగింది. ఇది జెత్తెడు ఆకారపు జింకుబిళ్ల. దీనిమీద ఖైదీ శెక్షన్ నెంబరు, శిక్షాపరిమాణకాలం అంకితాలై ఉంటాయి. ఇవి కాక ఖైదీ యొక్క తూనికలో గల హెచ్చుతగ్గులను తెలియబరుచు షీట్ ఒకటి ప్రసాదింపబడుతుంది. దీని అభిప్రాయం యేమిటంటే, ఖైదీ జయిల్లో చేరింది మొదలుకొని ఆరోగ్యం కలిగివుంటూ దినాభివృద్ధిని పొందుతూఉన్నా డని పైయధికార్లకు తెలియపరచడానికి. ఎవరైనా జయిలు తనిఖీకి వస్తున్నా రంటే జింకురేకును ఎదురొమ్మునతగిలించుకొనో, లేక మెళ్లో వ్రేలాడగట్టుకొనో, టికెట్‌రేకుమీద అతికించిన వృద్ధిషీటును రెండు చేతులతో బట్టుకొని ప్రదర్శిస్తూ ఫైల్లో (పంక్తి) నిలుచుంటే ఆ వచ్చిన మహాశయుడు పట్టీ లన్నింటిని చూచుకొంటూ పంక్తియొక్క ఒక చివరనుండి వేరొక చివరవరకు వచ్చి ఖైదీలంతరు చాలా ఆరోగ్యంగా చాలా సంతోషంగా ఉన్నారనీ, జైలుఆఫీసర్ల పరిపాలనం మహాతృప్తికరంగా వుందనీ రిమార్కు చిత్తగించి పోతూవుంటారు. ఇది కాక ఒక చిన్నకంచం, గ్లాసూ, కప్పుకొనడానికి గొంగలీ, కింద పరుచుకోడానికి ఒకపట్టా దొరికాయి వీరయ్యకు. కాబట్టి వీరయ్య చాలా అదృష్టవంతుడే అనవచ్చు. ఎందుచేత నంటే, నిజాని కీగొంగళ్లూ పట్టాలు ఖైదీల కందరికీ దొరికి తీరాలిసిందే కాని, ఆర్థికసంబంధమైన లోటుపాటువల్ల ఉపయోగంనిమిత్తం దొరికినా దొరకపోయినా, ప్రతిసోమవారం ప్రొద్దుటిపూట సూపరింటెండుగారు తనిఖీకి వచ్చినప్పుడూ, ఇన్‌స్పెక్టర్ జనరల్ గారు వేంచేసినప్పుడూ ఫైల్లో అలంకరించడానికి తప్పకుండా ఈవస్తువులను ఏమూలమూలలనుంచో లాక్కొని వచ్చి ఖైదీలముందు హాజరు పెట్టుతూ ఉంటారు వార్డర్లు. తనిఖీ పూర్తియై అధికారి అటుమొగం తిప్పడంతోటే ఇటు ఇవీ అంతర్థానమవుతూ ఉంటాయి, వాటి పూర్వపు కోణాల్లోకే కాబోలు! ఇది ముఖ్యంగా విచారణలో ఉన్న ఖైదీల విషయంలో మాత్రం జరుగుతూంటుంది. వేరోమార్గం లేదు. ఏం చెయ్యాలి? ఎన్ని సదుపాయాల కనీ కొట్టుకొంటారు వార్డర్లూ? ఒక్కొక్కమాటు తోంబదుతోంబ వచ్చి పడుతూ ఉంటుంది. విచారణపు వార్డ్లన్నీ (Undertrial wards) ఇట్టి మూకలతో నిండిపోతుంటే వార్డర్ల తరమౌతుందా, వచ్చిన వాళ్లందరికీ పక్క లమర్చడానికి? లేక జెయిల్లో ఏమూలయినా గొంగలీపట్టాల పంటకళ్లా లున్నాయి గనుకనా? మన వీరయ్యకు అండర్‌ట్రయల్ ఖైదీల సౌఖ్యం అనుభవించడానికి భాగ్యం లేకపోవడంవల్ల ఏలాగో ఒకలాగు ఇతనికి దొరకాలసినవన్నీ దొరికాయి. అటుతరువాత ఒక పెద్దహాలులో ఖాలీగా ఉన్న ఒక అరుగు ఇతనికి చూపించి గృహప్రవేశం చేయించి వార్డర్ మరో డ్యూటీమీద వెళ్లిపోయినాడు.

ఇక్కడ వీరయ్యను వదలి మళ్లీ కొంచెం దూపాటిసీమ హాయిసేవనం నిమిత్తం వెళదాం రండి. ముడివేముల్లో వెంకయ్య సమాచారం ఎట్లా ఉందో కను క్కొందాం.

౨

ఆశ్చర్యమని చూడడం, ఆశ్చర్యమని చెప్పడం, ఆశ్చర్యమని వినడమే కాని ఈశ్వరుని తెలిసికొన్నవారు ఒక్కరూ లేరు. అటులే యాయనంత మహిమాన్వితుని సృష్టివైచిత్ర్యరహస్యాలను గురించి ఇదమిత్థమని నిష్కర్షగా తెలుసుకొన్నవారూ గగనకుసుమాలే. ప్రాచీన కాలంలో, వ్యాసాదిమహర్షులంతటివారికీ ఈకాలంలో విజ్ఞాన పారంగతుడై ఆధునిక మాంత్రికుడని ప్రఖ్యాతి గాంచిన ఎడిసన్ ఇత్యాది విజ్ఞులకూ, ఎమర్సన్ మొదలైన తత్త్వవేత్తలకూ సమానదూరంలోనే ఉండిపోయినాయి, ఈ జగద్వైచిత్ర్య మర్మోద్ఘాటన సాధనా లన్నీనీ. చివర

జీవుల శుభాశుభకర్మాలే అన్నింటికీ నిదానాలని సరి పెట్టుకొని తృప్తి నొందాలిసిందే తప్ప మరో మార్గం ఏదీ లేదని తీర్మానంచేశారు సరే!

విశేషావయవాలతో శిశువులూ, పశువులూ పుట్టడం, ఉన్నత పర్వతశిఖరాలనుండి జలప్రపాతాలు దూకడం, ఘనీభూత హిమసంఛన్న భూములందు సలసల కాగే వేడినీరు పొంగి పైకి రావడం, ఒకచెట్టు ఆకు కాలికి తగిలితే తేలు కుట్టినలాగు మండడం, వేరొక చెట్టు ఆకు ఆవిషాన్ని విరవడం, అచరచేతనాలు చర చేతనాలను మెసవడం మొదలైనవే కాదు వైచిత్ర్యాల క్రింద లెక్కింపతగినవి. ఇవి కాక అనేకవిధ వైచిత్ర్యా లున్నాయి ఈ అనంత సృష్టిలో. ఏశుక్రగ్రహంమీదనో ఉండే మూడు కోట్లమంది బృహస్పతిమీద వూడిపడి అక్కడి నూట ముప్పదిమూడు కోట్ల ప్రజలనూ వ్రేళ్ల సందుల్లో ఇరికించుకొని ఆడించుచున్నారనేదీ ఒకవైచి త్ర్యమే కాని మనపూర్వుల తీర్మానం ప్రకారం అది వాళ్లవాళ్ల కర్మం. వైయక్తిక విగ్రహాలు కాని, పరస్పర ద్వేషాలు కాని లేశమాత్రమైనా లేక పోయినప్పటికీ ఒకసంఘాన్ని రెండుభాగాలుగా జేసి చెడుగుడు ఆటకు బురికొల్పి, ఆటనడుమ ఒకవేళ ఉద్రేకం హెచ్చి ఒకరి నొకరు చావతన్నుకొంటూవుంటే మీద నిలుచోని హుర్రే అని చప్పట్లు కొడుతూ అరవడమూ ఒకవైచి త్ర్యంలో చేరిందే. ఇందులోనూ వాళ్లవాళ్లకర్మే కార ణం ఒకచెంపకు రంపపుకోతా రెండోచెంపకు గంధపు పూతా—ఇందుకూ కర్మే. అన్నాధిక్యంచేత అజీర్తి రోగం పుట్టి చస్తూవుంటే ఒకచోట, తదభావంచేత మాడి చస్తూఉంటారింకోచోట. దీనికీ వాళ్లవాళ్లకర్మే హేతువు. ఇట్టిస్వకర్మ నిదానీభూత వైచిత్ర్య విశే షాలు కావలసినన్ని దొరుకుతాయి, ఇక మీరే వూహిం చుకోండి; మచ్చుకుచూపించాను రెండుమూడింటిని.

ఇట్టి సర్వశక్తి మంతమైన కర్మప్రాబల్యంచేతనే కావచ్చు, తంజావూరు, విశాఖపట్నం జిల్లాల్లో అతి వృష్టిల్ల పైర్లన్నీ కొట్టుకపోయి మురిగి చస్తూవుంటే, కర్నూలుజిల్లా దూపాటిసీమలోని పైర్లన్నీ అనావృష్టి చేత నీరు లేక ఎండి చావడం మొదలెట్టాయి. ఈకథ యొక్క మొదటిభాగంలో వివరించిన విషయాలు ఘటిల్లి రెండుమాసాలు కడచిపోవచ్చాయి. పొటుక్కుమని ఒక చినుకైనా పడింది కాదు త్రిపురాంతకపు ప్రాంతాల్లో. చినుకుమాట ఉండనీయండి, కనుమాపు పారినంత దూరంలో ఏదిక్కునందు గాని ఇంతమబ్బైనా కనుపడు తుందేమో అని బిక్కమొగాలు వేసుకొని చూస్తుండేవాళ్లు జనులు కాని ఆమాత్రపుభాగ్యమైనా లభించేది కాదు. ముడివేముల వాళ్ల ఘోష చెప్ప శక్యంకాదు. చెరువులోని నీరు క్షీణించిపోతూ ఉన్నట్టే వీళ్ల మొగాల్లోని రక్తం కూడా క్షీణించిపోతూ ఉంది. ఈయేడైనా ఇంత కడుపు నిండా తిని ఇంటిపట్టున ఉండి కాలం గడుపుతాము అనుకొంటే, వీళ్లకర్మం వ్యాధిరూపం దాల్చి వీళ్ల హృద యనీడాలనుండి మనోరథపక్షుల నన్నింటిని చిందరవంద రగా ఎగరగొట్టి ప్రాణహరణం కావిస్తూఉంది. అనా థలు ఏం చెయ్యగలరూ? దేవీదేవతలకు మొక్కుకొని ముడుపులను కట్టారు. పొటేళ్లను వేయిస్తామని మొక్కు కొన్నారు దొనకొండ గంగమ్మతల్లికి, వాన గురిపిస్తే. ప్రభలనూ, కుంకుంబండ్లను కట్టుకొని వస్తామని యల్ల మందకోటేశ్వరుడికి మొక్కారు. మల్లికార్జున దేవరను సేవింతా మనుకొన్నారు. ఇంద్రపూజలు చేయించారు. ఒక్కపొద్దులున్నారు. జాతర్లే కాదు, జాగరాలే కాదు, రాంభజనలే కాదు, రామాయణాలే కాదు, ఎన్నిపాట్లో పడ్డారు. కాని ససేమిరా. ఇంద్రభగవానుడు బిర్రబిగిశాడు. చెరువుకింది పైరంతా కంకి విడవడానికి వచ్చింది, చెరు వులోనినీళ్లు పూర్తిగా ఎండి పోయినాయి. చెరువు నడి కట్టమీద నిల్చోని జోటజోట కన్నీళ్లు కార్చారు అటు ఎండిపోయిన చెరువును చూచీ, ఇటు కంకివదులుతూ ఉన్న పైరును చూచీ. కర్మసంతాడితులైన ఇట్టి దిక్కు మాలిన పక్షులవంటి కృషకులు కన్నీళ్ళతో కడిగిఇచ్చే డబ్బులను పోగుచేయడంవల్ల సమకూర్పబడిన ద్రవ్య రాశులను—ఈద్రవ్యం ఏవిధంగా వచ్చిందాయని తలపైన లేని శ్రీమంతకుమారులు, రాజాధిరాజపుత్రులు, నిర్లక్ష్యా హంకార గర్వపూరితులు, సకల వ్యసనాలకు దాసాను దాసులు, తమ మానవ జన్మముయొక్క పరమార్థమే

గుర్తింపని వివేకశూన్యులు మహానగరాల్లోని దివ్యప్రాసాదాల్లో మద్యపానాలకు, ఫాన్సీడాన్సులకు, పైశాచికపు తిండ్లకు, చిల్లపెంకుల్లాగు తగలేస్తూ ఉంటారు. అటు పల్లెటూళ్ళలో రైతులు నిత్యైకాదశులను, నిత్యశివరాత్రులను సమాచరిస్తూ ఉంటారు. ఆహో, ఎంత విచిత్రాలైన, ఎంతవిపరీతాలైన కర్మభోగాలు వీరివి!

ఇంటికంతా అల్లారు ముద్దుగా ఉన్న సోముడు పోయినాడు. వాణ్ణెప్పుడు వదలకుండా వెంట వుండి ఆ ఇంటికి మరింత నిండుతనం కల్పిస్తూవచ్చిన గంగ పోయింది. ఈదుఃఖంతోనే కృశించిపోతూవున్న వెంకయ్యా వెంకమ్మల దౌర్భాగ్యం అనావృష్టిరూపంగా పరిణమించి మరోవ్రేటును విసిరింది వీరినెత్తిమీద. రాగిమళ్ళల్లోని నీరు ఇగిరిపోయి, అడుసుగా ఏర్పడి, గట్టిపడి, ఎండి చివరకు బీటలువారిపోయింది మళ్ళల్లోని నేలంతా. ప్రతిరోజూ ఈదంపతులిద్దరూ వాడబారి చివరకు ఎండబారిన పైరును చూస్తూ పొలంగట్లమీద కూర్చొని ఇన్ని కన్నీళ్లు విడిచివస్తూ వుండేవారు ఇంటికి.

మళ్లల్లో నీళ్లు పుష్కలంగా వుండవలసినరోజుల్లో ఇట్టిఏళ సంభవించడంచేత కడుపునిండా తిండిలేని వానికి యౌవనంలోనే వృద్ధాప్యం వచ్చినలాగు అకాలంలోనే పైరు పచ్చపడి ఎండిపోయింది. సకాలంలో పండినపైరు పచ్చదనం వేరూ ఈపచ్చదనంవేరూ. కంకుల భారంచేత పైరంతా నేలకు వంగిపోవలసింది మంచిగింజే పట్టినట్లయితే. అంతా పొల్లుగింజే, ఆకాశంవంక నిక్కబొడుచుకొని వున్నాయి కంకులన్నీ. మీలో మాలో ఒకటే శూన్యం వ్యాపించిఉంది అని పరస్పరం పరామర్శించుకొంటున్నలాగు ఉంది ఆకాశం కంకులూను. నూర్పిస్తే పుట్లకు పుట్లు కావలసినచోట ఏ పది పదిహేనుపళ్లో తేలాయి. అవైనా అర్ధపరిపక్వాలే. తినడానికి ఒకవారానికైనా రావు ఆగింజలు. అమ్మితే అసలే సున్న. ఇక చేయవలసిం దేముంది? చాలామంది రైతులు కుటుంబాలను వెంట వేసుకొని వరికోతల సమయం సమీపిస్తూ ఉన్నందున కృష్ణాగోదావరీల డెల్టాప్రాంతాలకు ప్రస్థానంచేయాలినని నిశ్చయించుకొన్నారు. వెంకమ్మా వెంకయ్యలకు వేరొకఉపాయం కన్పించింది కాదు. వాళ్లూ సిద్ధమైనారు అందరితోపాటు.

కాని ఉన్నవూరును, స్వంతఇంటినీ వదలాల్నంటే సులభమైన పని కాదు. విడువకుండా అయిదారేండ్లపాటు నివసించిన అద్దెయింటిమీదకూడా ఒకవిధమైన వ్యామోహం ఏర్పడుతుంది. మాఇల్లు, మావూరు, మాతాలూకా, మాజిల్లా, మారాజధాని, మాదేశం అని ప్రతివాడూ మహాప్రేమగౌరవాలతో చెప్పుకొంటూ వుంటాడు తన గ్రామాదులను గురించి. ఈప్రేమ గౌరవాలే దేశభక్తిగా పరిణమించి జీవితసర్వస్వాన్ని ఆదేశంకొరకే ధారపోసేలాగు ప్రేరేపిస్తూవుంటాయి మానవుణ్ణి. ఈదేశం నాదీ, ఇది నాజన్మభూమి అని ఒకపర్యాయమైనా స్మరించనివాడు జీవచ్ఛవమనీ, అట్టివాడు నరపశువనీ ప్రసిద్ధికెక్కిన కవిపుంగవు లనేకులు ఉద్ఘోషించియున్నారు. నీచసన్మానాలకూ, తుచ్ఛములైన పదవులకూ, బిరుదులకూ ఆకలిగొని క్షుద్రస్వాంతులైన కుక్షింభరు లనేకులు అంతరాత్మను చంపుకొని, పైకిమాత్రము "దేశభక్తేమిటి? ఇది ఒక ఢోంగ్"అని దాన్ని నిరసిస్తూవుంటారు. అట్టివారు సైతమూ మాయిల్లూ, మావూరూ అని మాత్రము చెప్పుకొనక మానరు. ఘనవంతులయ్యు స్వార్థులు, కృపణులూనైన ఈపిపీలికిపంచెలవాట ఆట్లా వుండగా, ఒక భిక్షుకుని పిలిచి మీ దేవూరని ప్రశ్నించినయెడల నతడునూ మహాప్రేమతో, ఆదరంతో, అభిమానంతో చెప్పుకొంటాడు తనది ఫలానిగ్రామమనీ. ఆగ్రామంలో అతనికి జీవననిర్వాహానికి వెరనైన లేకపోవుగాక, అతనివూరిమీద అతనికి అభిమానం పోదు. ఎవరైన దాన్ని నిందిస్తే పోట్లాటకుగూడ తయారవుతాడు. ఏమీ లేని బిచ్చగాడికే ఇటులైనప్పుడు సంవత్సరాలాదిగ కాపురంజేయుచుండిన ఇంటిని, అనేకసౌఖ్యాలకు ఆకరమైనదాన్ని, అనేక స్మరణలకు తావలమైనదాన్ని, తమ జీవితరంగం పై తెరబడనున్న సమయాన్ని తలిదండ్రులు దగ్గరకు పిలిచి శుభాశీర్వాదాలతో తమచేతి నొప్పగించి పోయినదాన్ని వదలాలి అంటే ఎంతకష్టం, ఎంత ప్రాణసంకటం?

వెంకయ్య ఏదో విధంగా మనస్సును గట్టిచేసుకొన్నాడు. కాని వెంకమ్మకు ధైర్య మాగింది కాదు,

నిజానికి పతికంటే పత్నికే ఎక్కువసంబంధం ఇంటితో. మానవజన్మ సాఫల్యానికి హేతుభూతాలైన చతుర్విధ పురుషార్థ సంపాదన నిమిత్తం బాహ్యారంగాలతో ఎక్కువ సంబంధం కలిగించుకోవలసివస్తుంది పురుషుడికి. అందువల్ల గృహంతో ఎక్కువసంబంధం కలిగి తీరుతుంది స్త్రీకి. కాలవైపరీత్యంవల్ల ఇప్పుడీ దురవస్థ కలిగింది కాని అత్తమామలు బ్రతుకున్న కాలంలో, పాడిపంటలుకొల్లగనున్న కాలంలో ఆయింటియందే ఎన్నిసౌఖ్యాలనుభవించింది కాదు వెంకమ్మ. అట్టి యింటిని వదలి పరదేశానికి బోవాలి అనుకొనేసరికి ఆమెకు దిగులు, బెంగ ఆరంభమైనాయి. అన్నము ముందు కూచుంటే యేమేమొ తలపులోకి వచ్చేవి. అసలు అన్నం తినాలన్నే బుద్ధే పోయింది. ఏదో గుబులుగా ఉండేది. నడవబోతే కాళ్లల్లో సత్తువ పోయినలాగు గనుపించేది. తీరా వెళ్లవలసినరోజు వచ్చేసరికి తానాయింటిని వదలి రాలేనని ఏడుస్తూ కూర్చుంది. ఆనాడు ఒకటి రెండు కుటుంబాలవారు వెళ్లిపోయ్యారు. వీళ్లప్రయాణం సాగిందే కాదు. ఒకనాడు యిల్లు వదలి కొంత దూరం పోయి మళ్లీ వచ్చింది. ఇంకోనాడు ఊరు దాటినతర్వాత ముందుకు సాగలేక పడిపోయింది. మరి రెండు మూడు పర్యాయాలు ఇల్లే ప్రయాణా లాగిపోయినాయి ఊరు వదలి వెళ్లదలచిన వాళ్లు చాలామటుకు వెళ్లిపోయినారు. ఇక ఎన్నిరోజులనీ ఈలాగు గడపడం. ఏనాడో ఒకనాడు వెళ్లితీరాలిసిందే కాని అక్కడ వుండే భాగ్యమేమో లేదు. ఉంటే ఉపవాసాలాచరించవలసిందే. ఇక వెళ్లదలచుకొన్నచోటికి గూడా సకాలంలో వెళ్లి ఏదో పనిని చూచుకొనకుండా అన్నీ మిగిలిపోయిన తర్వాత వెళ్లిమాత్రం ఏం లాభం? అక్కడా పస్తుండవలసిందే. ఇవన్నీ తలపోసుకొని తలపోసుకొని ఇక ఏలాగూ వెళ్లక విధిలేదని మనస్సును రాయిచేసికొని బయలుదేరిందీమె. అచేతనమయినా ఇంటియందెంతా కర్షణశక్తి! కనపడినంతవరకూ దాన్ని తిరిగితిరిగి చూస్తూ వెక్కివెక్కి ఏడుస్తూనే పోయింది. ఊరు దాటింతర్వాత కనపడ్డంతమేరా గ్రామంవంకే చూస్తూ విలపిస్తూ నడిచింది పాపం. తర్వాత రైల్లో ఎక్కి పోతూఉంటే గుండ్లకమ్మ తగిలింది దారిలో. నీనీళ్లరుణం నాకు నేటితో తీరిందిగా తల్లీ యని ఆపురని ఏడుస్తూ రెండు చేతు లెత్తి మొక్కింది. కనుపడినంతవరకు నదిని చూస్తూ తలను అల్లే కిటికీ బైటికి వ్రేలవేసికొని కళ్ల నీళ్లు కారుస్తూ కూర్చుంది.

## 3

ఒక్కొక్క ఘటనావిశేషంవల్ల మానవుని ప్రవర్తనయం దప్పుడప్పుడు విపరీతమైన మార్పు గలుగుతూ ఉంటుంది. దుఃఖాంతక ఘటనమైన యెడల ఇక చెప్పవలసిన పనే లేదు. ముడివేములలోని ఘటనానంతరం ఆనుర్నాటినుంచే వీరయ్యయం దొక విలక్షణమైన పరివర్తనం గలిగి దినక్రమాన్నే ప్రవర్ధమాన మాతూ పోయింది. కుర్రవాడి సోముడి దుర్మరణమే ఇందులకు ప్రధానకారణం. రెండోది గంగమరణం. ఆనాడు కోపోద్రేకంచేత మతిపోయి ఏమేమో చేశాడు వెర్రియెత్తిన వానివలె, పరిణామఫలం విచారించకుండా. కాని యాకోపం చల్లారగానే ఆరంభమైంది అపరిమితమైన పశ్చాత్తాపం వీరయ్యకు. ప్రబలములైన ఇంద్రియావేగాలకు వశీభూతుడై మన్నూమిన్నూ గానక అకార్యం దేనినైనా చేయడం, ఆఆవేగం చప్పబడిపోవడంతోటే చేసినదానికి ఏడ్వడం—ఇదీ ఒక మానవ స్వభావమే! ఎవరినిమిత్తమో, దేనినో, ఫేరునకనో మరియెందుకనో చేయబోతే మధ్య అమాయికుడైన కుర్రవానిప్రాణాలూ, నోరులేని గోవు ప్రాణమూ పోవుట సంభవించెనే యని తీరనిదుఃఖం పట్టుకొన్న దితన్ని. తన మెడను జుట్టుకొన్న శిశుహత్యా, గోహత్యాపాతకాలకు ప్రాయశ్చిత్తమేదైన గలదాయని యెల్లప్పుడూ ఆలోచనామగ్నుడై వుంటాడు. పగలు అందరితో పనిపాటల్లో మునిగి ఉండడంచేత పెనిటెన్షియరీలో కాలం ఏలాగో గడచిపోయేదే కాని, సాయంకాలం తింద్లూ తిప్పలూ పూర్తియైనపిదప ఖైదీల నందరినీ—ఏహాలులో వారిని ఆహాల్లోనే—లెక్కవేసుకొని—ఈగణనం వార్డర్ల సాయంకాల నిత్యకృత్యాలలో ఒకటే—తలుపులకు తాళాలు బిగించి వార్డర్లు వెళ్లిపోయిన తరువాత లోపలి ఖైదీలంపరు—ఇపుడు వీరికి మహానంద సమయం—సరస సల్లాపాలతో, పిచ్చికేకలతో, ఆటలతో పాటలతో,

కొందరు నటకులూ కొందరు ప్రేక్షకులుగా మారి నాటకాలూ ఫార్సులనుగూడా ప్రదర్శించుకొంటూవుంటారు- ఏకసక్కేలతో, వెకిలినవ్వులతో, కూనరాగాలతో, ఈలలతో, పెడబొబ్బలతో, జయజయధ్వానాలతో, చేతిచప్పట్లతో--కొందరు వక్తలూ కొందరు శ్రోతలుగ మారుతూఉంటారు—వినండి వినండి కేకలతో ఎవరి ఇష్టం వచ్చినలాగు వాళ్లు అల్లరి సాగిస్తూ, హాలునంతటినీ మారుమ్రోగిస్తూ ఉంటే ఇత నెందులోనూ జోక్యం కలిగించుకొనక తనవేదిని ఆశ్రయించి—ప్రతిహాలులో ఒక్కొక్కరిరానికి పంచుకొనడానకి సరిపోయేలాగు అడుగుఎత్తుగల అరుగులు నిర్మింపబడి ఉంటాయి—తన కీహత్యాద్వయపాతకాన్నుంచి ముక్తి యేలాగు లభిస్తుందా అని ఆలోచించుకొంటూ వాళ్ళందరినీ తలచుకొని ఇంతసేపు విచారించి తుద కెట్లో నిద్రిస్తూ ఉండేవాడు. పశ్చాత్తాపం, చింతా, సిగ్గూ వీనికే తప్ప దురభిమాన గర్వదురహంకారాల కెక్కడా తావే లేదు అతిని హృదయాంతరాళంలో ఇపుడూ......

రక్షకభటవృత్తిని అవలంబించిన వాళ్ళకుకూడా లజ్జా పశ్చాత్తాపాలు కలుగుతాయా అని సందేహించేరు సుమా! వృత్తి ఎటువంటిదైనా వాళ్లదీ మానవజన్మే కదా! వాళ్ళకూ తల్లిదండ్రు లున్నారు. వాళ్ళరక్తమే వీళ్ల దేహాల్లో ప్రవహిస్తూ ఉంటుంది. వాళ్ళకూ ఆకలిదప్పు లున్నాయి. రాత్రిపూట వాళ్ళకూ కునికిపాట్లూ ఆవులింతలూ వస్తూనే ఉంటాయి, ఎక్కడయినా చాలా రాత్రి మీరేవరకూ పహరా నెత్తిన పడితే. కాళ్లో ముల్లు గుచ్చుకొంటే వాళ్ళూ అబ్బనో అమ్మనో స్మరిస్తూనే ఉంటారు. కంట్లో నలక పడితే వాళ్లకూ మెరమెరలాడుతుంది. ఉండాలిసిన మానవధర్మాలన్నీ వున్నాయి వాళ్ళకుగూడా. కాని ఏం చెయ్యాలి? మహావికటమైన భయంకరమైన కాలం దాపరించింది, ఈకాలం పాడైతే.

మంచికళ్లెం లేని నిండు జవ్వనపు గుర్రంమీద సవారి దీస్తూఉన్నకాలంలో సంవత్సరం దప్పితే సంవత్సరం బీరువోకుండా సంతానం కవలు కవలుగా వెల్లివిరియచేసి భరతఖండ జనసంఖ్యా పరిమాణాన్ని వృద్ధిదశలోనే యుంచి దానిగౌరవాన్ని కాపాడుతూవచ్చిన వంశోద్ధారకులైన పెద్దమనుష్యు లెందరో ఆకాస్తన రాలూ సల్లువదలిన తర్వాత హనుమార్క్ కాసెలను బిగించి, యువతీయువకుల కొందరిని గూర్చుకొని సభలలో సంతాననిరోధంగూర్చీ, దానివల్లకలుగు లాభాలను గురించీ, దేశానికి తమకూ గలుగగల క్షేమాన్ని గురించీ మహా ఆర్భాటంగా లెక్చర్లు కొడుతూ ప్రచారం చేస్తూనే వున్నా రొకమూల. ఒకనైపు బర్తుకంట్రోల్ గోట్టాలకు గిరాకీ పెరిగిపోతూనే ఉంది, కాని మరోవేపునుండి యథాపూర్వం చీమలపుట్టలు బయలుదేరుతునే వున్నాయి. ఇట్లు దేవతానికరజేగీయమానధన్యభారతభూమిభాగ సందర్శన మహోత్కటచాపల్యంచేత కుప్పతిప్పలుగా దేహధారణాలు కావిస్తూ ఉన్న జీవాత్మల కన్నింటికీ జీవనోపాయవృత్తులు సమూలంగా నశించాయి ఈరోజుల్లో. ఇప్పుడందరికీ ఒక్కటే అనూచానవృత్తి—నౌకరీవృత్తి దొరికింది. ఇదివరకు ఏ పిడికెడుమందో దీన్ని ఆశ్రయించుకొని వుండేవాళ్లు. తక్కిన వాళ్లందరూ జీవన నిర్వాహానికి కర్తవ్యవసరాలైన కృషి, వాణిజ్య, శిల్పకార, కర్మకార, చర్మకార, మణికార, చిత్రకారాది నానావిధవృత్తులలో పరిశ్రమ సలుపుతూ ఉండడంచేత అందరికీ ఆనందంగానే కడిచిపోతూ వచ్చాయి దినాలు. కాని పాదశతాబ్ది ఆదిగా ఈమీద వచించినవారు మాత్రమే కాదు, సమస్త జాతులవారికీ ఈ అనూచాన సేవావృత్తే ధ్వజస్తంభంలాను, లైటుహౌసుమీది దీపంలాగు దృష్టిగోచరం కావడంవల్ల వారందరూ స్వవృత్తులను స్వయంగా నిర్మూలించుకొని అనూచాన వృత్తికే ఎగబడ్డారు. అంతటితో అదీ కోతుల గుంపులో బడ్డ మిఠాయిపొట్లంలాగు మాయమైంది. లడ్డుపుండలు దొరికినవాటికి దొరికాయి, లేనివాటికి లేదు. కొన్నిటికి కావలసినవాటికంటె యెక్కువ దొరికాయి. కొన్నిటికి అసలే సున్న. దొరకనివారికందరికీ నిర్వ్యాపారపువృత్తి గతి అయింది. ఈభగవతితోటే ప్రస్తుతం భారతీయుల్లో ముప్పాతికపాళ్ల మందికి రమణవిలాస సౌఖ్యానుభోగం. కాబట్టి అందరికీ నౌకరివృత్తి. అది దొరకక

## ఆకాశం

శ్రీ. న. స్వామిగారు

అనగనగా ఒకవూళ్లో పేదరాశిపెద్దమ్మ ఉండేది. ఆవిడకి ఇద్దరు మొగపుర్రాళ్లు ఉండేవారు. అప్పుడు భూమిమీద ఉండేవాళ్లకి ఆకాశం బాగా అందుతూండేది. ఆకాశంమీదకి వెళ్లడాన్కి తూర్పున నొకటి రెండు తోవ లుండేవి.

పేదరాశి పెద్దమ్మ చీకటితోనే లేచి తూర్పు కొండెక్కి ఆకాశం తుడిచేసి రంగురంగుల ముగ్గులుపెట్టి ఇంటికివచ్చి యిద్దరి పిల్లలికి చద్దెన్నం పెట్టి ఆమకోడాన్కి ఆకాశంమీదకి పంపుతూండేది. తిరిగీ సాయంత్రాన్కి యింటికి చేరుతుండేవాళ్లు. సాయింత్రంకూడా యీపెద్దమ్మ ఆకాశం తుడిచి రంగురంగుల చిత్రమైన ముగ్గులు పెడుతూండేది.

ఇలా ఉండగా ఒకనాడు పేదరాశిపెద్దమ్మ తన వాకిలి తుడుస్తూండగా ఆకాశం నడ్డికి తగిలింది. దానితో కోపంవచ్చి చీపురుకట్టతీసి ఆకాశాన్ని చావమోదింది. అపళంగా ఆకాశానికి కోపం వచ్చి పెద్దమ్మ కొడుకులిద్దరితోకూడా తుర్రుమని పైకి ఎగిరిపోయింది!

అప్పటినుంచి ఆకాశం మన కందకుండా చాలా దూరం పోయింది. అక్కడ ఆమకోబోయిన కుర్రాళ్లే సూర్యచంద్రులు, పెద్దమ్మ పెట్టిన ముగ్గులే నక్షత్రాలు, అవే మనకు నిత్యం కనిపిస్తూంటాయి!

కథ కంచికీ, మనం ఇంటికీ!

---



రెక్కలు లేని విమానము

దీనిని డాక్ ఇగ్నాసియో గానెర్ అనునాతడు నిర్మించెను. ఇతడు స్పెయినుదేశమువాడు.




## దారపు గొలుసులు

కొ. నరసింహాచారిగారు

దారముతో గొలుసును అల్లుట మిగుల సులభమైన పని. దారము సన్నముగా గాని, లావుగా గాని యుండవచ్చును. పట్టుదారపు గొలుసు అందముగా నుండును.

ఒక పొడవగు దారమును దీసికొనవలెను. చిత్రము ౧ యందు b అనునది దారమున్ను a అనునది దాని యొక్క ఒక కొనయున్ను అయియున్నవి. a అను కొనను b అను దారము



పైకి వేసి r అను వలయము వచ్చునట్లు చేయవలెను.

L అను ఎడమచేతితో b అను దారమును పట్టుకొని R అను కుడిచేతిని r అను వలయమునందు దూర్చవలెను (చిత్రము ౧). పిమ్మట కుడిచేతి వ్రేళ్లతో b అను దారమును పట్టుకొని r అను వలయము గుండా వెలుపలికి కొంత లాగినయెడల చిత్రము 3 నందు వలె S వలయము ఏర్పడును. ఎప్పుడు గాని b అను దారమును వలయము గుండా పూర్తిగా లాగరాదు. తర్వాత r అను వలయమును లాగుటవలన నది చిన్నదై చిత్రము ౪ నందు r వలె ముడిగా ఏర్పడును. మరల కుడిచేతి వ్రేళ్లను S అను క్రొత్తవలయము గుండా దూర్చి b అను దారమును పట్టుకొని వలయము గుండా వెలుపలికి కొంత లాగినయెడల మఱియొక క్రొత్త వలయము t అనునది యేర్పడును (చిత్రము ౫). ఇప్పుడు S అను వలయమును కొంచెముగా బిగించిన యెడల నది యొక్క ముడిగా నగును. ఈముడులే అల్లిక అగును. ఈయల్లిక చిత్రము ౬ నందు చూడనగును. కావలసినంత నిడువుగా గొలుసును అల్లిన తర్వాత కట్టకడపట b అను దారమును, V అను వలయము గుండా దూర్చి (చిత్రము ౭) పూర్తిగా లాగివేసిన యెడల గట్టిముడి ఏర్పడును. కడపటి వలయము గుండా మిగిలిన దారమును పూర్తిగ లాగకున్న యెడల గొలుసంతయు మరల విప్పుటకు వీలగును.

ఇట్టి గొలుసులను బట్టల అంచులందు మన యిష్టమువచ్చినట్లు చిత్రవిచిత్రములుగా పెట్టుకొని వేరు దారముతో కుట్టవచ్చును (చిత్రము ౮). ఉల్లు మొదలగు వాటితో చేయబడిన పూవులకు కాడలుగనైన కుట్టవచ్చును (చిత్రము ౯). ఉల్లు పూవులను చేయుట గత సంచికలలో నొకదాని యందు చెప్పబడి యున్నది.





ప్రతిబింబము

శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారు తీసిన ఫోటో.



అక్షయవటము, గయ



పురాణ కేలా-ఉరఫు-హాస్తినాపురము-ఢిల్లి

శ్రీ వి. యస్. గోపాలదేశికాచారిగారి ఫోటోలు.



౧. 'పాపనాశన' జలపాతము



౨. 'బాణతీర్థ' జలపాతము

—'సూర్య'

శాంపిల్సు ఉచితము.

సహజమైన హెయిర్ టానిక్ తో మీ శిరోజములకు అందమును తెచ్చికొనుడు.

## కామినియా నూనె (రిజిస్టర్డు)



శిరోజములకును, మెదటికిని, యిది చాలా శ్రేష్ఠమైన నూనె. చలువ నొసగు పదార్థము లందు మిళితమై యున్నవి. కామినియా నూనె మాడుపట్టును శుభ్రపఱచి, శిరోజ బీజములకు బలము నిచ్చి, వెండ్రుకలను పట్టువలె బాగుగా పెంచును. మంచి పరిమళ మిందు చేర్చబడినది. దీని నుపయోగించిన ప్రకాశవంతమగు శిరోజము లేర్పడును.

నేడే ఒకబుడ్డిని పరీక్షింపుడు. వెల బుడ్డి రు. 1-0-0, 3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం ఒకఅణాస్టాంపునుపంపిన శాంపిలును ఉచితముగా బడయగలరు.

## పరిమళరాజు ఓటో దిల్ బహార్ (రిజిస్టర్డు)



OTTO DILBAHAR.

దీనికి సాటియైనది లేదు. దీని పరిమళము యింపుగాను, ఆనందదాయకముగాను యుండును. వాసన బహుకాల ముండును. కొన్నిబొట్లు మీ చేరుమాలుమీద వేసి చూడుడు. మీ చుట్టును అద్భుతమైన పరిమళ మీనుచుండును.

వెల $\frac{1}{4}$ ఔన్సు రు. 1-4-0. 1 డ్రాము సైజు 0-12-0 అణాలు.

వి. పి. ఛార్జీ ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం రెండుఅణాల స్టాంపులను పంపి శాంపిలును ఉచితముగా పొందుడు



ఆసియాలో ప్రధాన సబ్బులు

## కామినియా టాయిలెట్ సబ్బులు

వాడుకలో పోడిమి.

ధరలో పోడిమి.

పరిమళ మానందదాయకము.

రకము అసమానము.

నానావిధ పరిమళములందును దొరకును.

కామినియా ట్రాన్సుపరెంటు గ్లిసరిన్ సబ్బు.

కామినియా లవండరు సబ్బు.

కామినియా చందన సబ్బు.

కామినియా వైట్ రోజ్ సబ్బు.

దిల్ బహార్ సబ్బు.

ఈ సబ్బులు మీకు సంపూర్ణసంతృప్తి నొసగగలవు.3 బిళ్లలుగలపెట్టె 1-కి 0-15-0. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము

మీకు సమీపములోగల దుకాణములో అడగండి లేక మాకు వ్రాయండి.

కొనునపుడు ప్రతిపెట్టెమీదను కామినియా అను పేరుండుట గమనింపుడు.

ఈపేరు స్వచ్ఛతకును, గుణమునకు గ్యారంటీ నిలచును.

సోల్ ఏజెంట్లు:—ఆంగ్లో-ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె 2082, బొంబాయి.

# మడ్డుకత

మంగిపూడి వేంకటశర్మగారు

ఎలుకమ్మ యెలుకోయి యెలుక యటంచు,
సోదమ్మ సోదోయి సోది సోదనుచు,
ఎవ్వారు నెన్నఁడు నెఱుఁగనియట్లు,
జరిగిన వెల్ల పూసలు గ్రుచ్చినట్లు,
బిరబిర నొక్కటైన బీరుపోకుండ,
తార్కాణగా సోదె తాఁ జెప్పె నహహ!

వీను లారఁగ విన్న విషయంబులైన
కనులారఁ గన్న సంగతులైనఁ గాని
వదలిపెట్టకయుండ వాకొన లేము.

ఇంత లేఁబ్రాయమందే యీలతాంగి
కేభంగి నబ్బెనో యీమహామహిమ!
ఏలీల నేర్చెనో యీదొడ్డవిద్య!
వనిత శాబర ముపాసన చేసెనేమొ!
ఈయింతికడ నున్నదో మెజ్జిమారి!
కాకున్న నిది దేవకాంత కావలయు,
కాదేని నీశక్తి కలుగు నేలాగు?

అని విన్న కన్న వా రబ్బురంపడఁగ
ఇల్లిల్లు తిరుగాడి యెలుకలు చెప్పి
ఇల్లాండ్ర మెప్పించి యెలమి నొందించి
రూకలు బియ్యంబు జోకలైనట్టి
కోకలు రైకలుం గొని, మోద మెసర,
ఎలఁబ్రాయమున నున్న యెలుకత యొకత
నెలవున కరుదెంచి నెమ్మి మీఱంగ
తనబుట్ట దింపె యుల్లన గూరుచుండి
సారిదిఁ దాఁ దెచ్చినసొమ్ముల నెల్ల
మగనిముందరఁ బెట్టి మక్కువతోడ
సరసను గూర్చుండె సంతోష మలర.

అందాఁక సతనితో నరమరల్ లేక
మంతనా లాడెడు మగువ యొకర్తు
అట కామె రాఁగానె చటుకున లేచి,
పని యేమొ యున్నట్లు ప్రక్కనే యున్న
తరువుచాటున పొంచి పరికించుచుండె.

ఆతఁ డావస్తువు లరయుటల్ మాని
చిరచిరలాడుచు చిర్రుబుర్రనుచు
చురచుర కోపానఁ జూచుచు లేచి,
'ఓసి మాయలమారి, యోదోసకారి,
ఓసోసి వగలాడి, యోవాడవదినె,
తెలిసెను పో నీదు తలఁపు, ల వెల్ల,
పాడగంటి పో నీదునడవడు లెల్ల,
బయలెక్కెఁ బో నీదు బాజార మెల్ల,
వరదబోయెన నీదుబాస లవ్వెల్ల,
మతకమ్ములే నీదు మచ్చిక లెల్ల,
మన్నయ్యెనే నాదు మన్నన లెల్ల,
వమ్మయ్యెనే నాదు నమ్మిక లెల్ల,
పాలివోయెనే నాదు పోరామి యెల్ల;
అకట! యింతటిదాన వని నేరనైతి;
అయ్యయ్యో, నిను నమ్మి అగడు నొందితిని;
నినుఁ గట్టుకొని చాల నీచుఁడ నైతి;
కొలమువారల కెల్ల పలుచ నైపోతి;
నాసాటివారెల్ల నవ్వఁ బాలైతి;

నాదు పెద్దల పేరు నలుపు చేసితివి;
ఓసి గయ్యాళి, నిన్నొల్ల నే నింక:
నీమిండఁ డున్నట్టి నెలవున కరిగి,
కొంకు జంకును నర గొర లేనియట్టి
బోగాలు పొందంగఁ బొమ్ము, పోపొమ్ము.'

అని యిట్లు దుర్భాష లాడ నాలించి
గరితల తలమానికంబై వెలుంగు
చిన్ని యాయెఱుకత చెవులలోపలను
కదురు లెఱ్ఱగఁ గాల్చి కట్టగాఁ బట్టి
గట్టిగా గ్రుచ్చిన కైవడిన్ నొచ్చి
నిలువు నీరైపోయి, వెలవెల్లఁబోయి,
వెఱ నొంది కంది నివ్వెఱ నొంది కుంది,
'అయ్యో, దైవమ యిదే మన్యాయ మయ్యా,
నన్ను నుమానించె నా చెల్వుఁ డిపుడు!
ఓ ప్రొద్దు దేవరా, ఓ వేఁడి వెలుఁగ,
వేయి చేతులతోడ వెలుఁగొందువాఁడ,
జగముకన్నగువాఁడ, చాయమ్మమగఁడ,
జనులపై దములెల్లఁ గనుఁగొనువాఁడ,
ఎఱుఁగవే నీవు నాయీలువుపోనము?

ఓతల్లి బూదేవి, ఓరిమి నెలవ,
ఓసంపదలగనీ, ఓపంటవలఁతి,
ఓతేగములకొట్ట, ఓతాల్మితిట్ట,
నీచల్వచేఁ గదా నిలుచును జగము?
దమ్మాల కెల్ల నాదరువైన యమ్మ,
తెలియదే నీకు నాతలఁపుచందంబు?
సాకి వై నను నీవు సాఁక రావమ్మ!
మాతల్లి, యాకసమా, యెల్లయెడల
నిండియుందువు గదా నీవు జగాన?

ఓగాలిదేవరా, ఓతండ్రి కాన,
నీవు తారాడని నెలవులు గలవే?
తెలియ లేరే నాదు పొలఁకువ లెల్ల
నేఁ డిదేమో చెడ్డ నిందె వాటిల్లె;
నామనుగడ నంటె నల్లనిమచ్చ;
మొదల నామనువుకే మోసంబు వచ్చె:
మానంబు చచ్చె, నెమ్మది నొచ్చి విచ్చె;
పాన మిం కేటికి, బ్రతు కేటి కింక?

పలుకరే మీరు నాతలఁపుచందంబు,
నుడువరే మీరు నా నడవడితీరు,
చెప్పరే మీరు నా చెయిదాల సరణి,
చూపరే మీరు నా సుద్దంపు గోనము,
కాపాడరే మీరు కనికారమునను,
తీర్పరే నానేస్తు తీరనియలుక,
మాన్పరే నాచెల్వు మదిలోని కొంకు,
నిలుపరే మీరు నా నిండుకాఁపురము?
నే నోర్వరాని యీ నిప్పచ్చ నిందె
విదళించి నను నేఁడు బ్రదికింపరయ్య!'

అని దేవతలకెల్ల అంజలి పట్టి
భక్తితో ప్రార్థించి భర్తను డాసి
కరములు జోడించి కాళ్లపై వాలి
కన్నుదమ్ముల నీరు కాల్వలై పార
కంపించుమేనితో గద్గదస్వరము
గదుర నేడిచె జాలిఁ గదిరి రాల్గరఁగ:
'నాసామి, యెఱుఁగవే నాయెదతీరు;
నారాజ, తెలియవే నానడవడిక;
ఎవ్వారు పుట్టించి రీ రోఁతమాట?
ఎవ్వారు కల్పించి రీలాటి దూఱు?

చెనఁటు లెవ్వారైన చెప్పిరే? చూడు,
నమ్మి కె ట్లయ్యెనే నాజోడ, నీకు?
నాపాపమున నేఁడు నాయందు నీకు
అటువంటియనుమాన మయ్యెనే గాని,
ఏకళంకైనను నెనసెనే నన్ను?
నిన్ను దైవంబుగా నేఁ గొల్చుచుంటిఁ
గాని నే కలనైనఁ గాని యెన్నఁడును
కన్నార పెరవానిఁ గనినైన నెఱుఁగ;
వెలిచవుల్ తలఁపులోఁ దలఁచు టే నెఱుఁగ:
మన మక్కువలు చూచి, మన చెల్మి చూచి,
మన నేస్తమును జూచి, మనమన్కి చూచి,
కన్ను గుట్టిన చెడ్డకామిని యెవతొ,
సూడు గైకొన్నట్టి చుప్పనా తెవతొ
నీలివార్తల నల్లి నిందెలు పన్ని
కల్లలు నిజములు గాఁగ నమ్మించి,
బుద్ధులు మళ్లింపఁ బోలును నీకు.

ఏగట్టివాయి నీ కీబోదఁ జేసె?
ఏ నీచురాలు నీకీ బుద్ధి గఱపె?
ఆజాత యిటు వచ్చి అందఱుఁ జూడ
నేను చేసినయట్టి నెప మిట్టిదనుచు
నుడుగక నాముోల నుడుగంగ రాదె?
చాటున మాటున చాడీలు చెప్పి
కొంపలు గూల్చుట గొప్పతనంబె?
ఇట్టిపాపము నొడిగట్టుకొన్నట్టి
ఱాఁగ తా ముందుకు రాఁగల్గునొక్కొ?'

అని గట్టిగా పల్కు నాపల్కు లెల్ల
ములుకులవలె నాటి కలుకుమనంగ
అలుఁగు నాటిన పులివలె చెట్టువెనుక
నొదిగి కన్గొనెడు నమ్మదవతి కినిసి
చప్రున నివలికి చనుదెంచి నిలిచి,
'ఏమని ప్రేలితివే యోసి తులువ?
ఏమని కూసితివే యోసి బసివి?
ఏమని వాగితివే యోసి చెడిపె?
నే గట్టివాయినా, మూఁగవా నీవు?
నే నీచురాలనా, నీ గొప్పతనము
ముందు? నే జంతనా, ముగుదవా నీవు?
మగనికి తనమీఁద మక్కు వెంతున్న,
పెనిమిటి త న్నెంత ప్రేముడిఁ గన్న,
పురుషుఁ డెంతటి గారమును చేయుచున్న,
తలునికి కన్నులు తల కెక్కరాదు;
ఎదిరి నెన్నఁడు నీసడింపఁగా రాదు;
ఎరుసున చూడరా దెవరి నేఁ గాని;
ఉల్లసంబాడరా దొరుల నెవ్వరిని:
నీయంతదానవు నీవు, నాయంత
దానను నేను గదా! నేను వినఁగ
వంకడొంకలు పెట్టి పదిమందిలోన
నూరకే నిందించు టొప్పనే నీకు ?
మగఁడు నీవును గూడి సుగము లొందంగ,
నే నోర్వ లేకుంటినే నీచురాల?
మగఁడును నీవు మమైకమ్ము నొంద,
నే చూడ లేకుంటినే చుప్పనాతి ?
మగఁడు ని న్నెపుడు హెచ్చుగ బుజ్జగింప
నే సైఁప లేకుంటినే నంగనాచి ?
మగఁడు నీమాటలో మసలువాఁ డనుచు,
మగఁడు నీమాయలోఁ దగిలినాఁ డనుచు,
మగఁడు నిన్నే చాల మరిగినాఁ డనుచు
ఇంతగా ప్రుల్లింత లేలనే సవతి?

మగవారిమక్కువల్, మగవారిచెలిమి,
మగవారివగలు నమ్మఁగరాదు సుమ్మ!
పడుచందనంబు లెప్పుడు నిల్వఁబోవు;
చక్కందనమ్ములో సతములు గావు;
అవి రెండు పోయినయవల పూఁబోండ్ల
వగలు నోద్దికలు గవ్వకు చెల్లఁబోవు;
తనివి బాలలఁ గన్నతల్లి యౌదాఁక
మగవారు లాలించి మాటలాడుదురు;
సకుల మైజిగిబిగి సడలెడుదాఁక
పురుషు లనుసరించి బుజ్జగించెదరు;
నేఁటిబోగాలెల్ల నిత్తెముల్ గావు;
నేఁటిసుకమ్ములు నిత్తెముల్ గావు;
నేఁటిసంతోసాలు నిత్తెముల్ గావు;
నేఁటినెయ్యమ్ములు న్నిత్తెముల్ గావు.

వనిత తా నెంతటి వగలాఁడి యైన,
మగువ తా నెంతటి సొగసుకత్తైన,
చాన తా నెంతటి చదురురా లైన,
మడంతి తా నెంతటి మాటకా రైన,
మిడిసి రాలఁగ రాదు మిను మన్ను మఱచి:
తనబాగ్గె మేతీరు తారుమారవునో,
తన కెన్నఁ డేగతి దాపురంబవునో,
తరమౌనె తెలియంగ సరుల కింత్తైన?
ఓసి గరాస, ఓసోసి పిసాళి!
పోతరంబున మించి పొంగెద వేలె?
నీపొంగుపాటెల్ల నేలలోఁ గలియ.

ఏటికే నీ కింతయీసు నామీఁద?
ఏటికే నామీఁద సింత మచ్చరము?
ఈలాటి సూడు నీ కేటికే సవతి?
ఏయన్నెమును పున్నె మెఱుఁగనియట్టి
న న్నాడిపోసిన నాలుక చెడదె?
మగవాఁడు మెత్తనిమదివాఁడు గాన
పొగ రెక్కి యీలాగు తెగి వీదిలోన
తెగసాఁగెదవు గాని, మగవాఁడు సుంత
తెగువరి యైన నీపగిది వాగుదువె?
నాకు దారము గట్టి నన్ను ప్రేముడిని
లాలించి పాలించి బాలలఁ గాంచి,
వలపులో బులుపులో వాలలాడించి,
నాముద్దు చెల్లించి, నన్ను మన్నించి,
నాతోడినీడయై ననుఁ బాయలేక,
నాతోడిలోక మైనట్టి నామగని
మందుమాఁకులు పెట్టి మరులు పుట్టించి
తగులుకు వచ్చి నాసుగము హరించి
కులుకుచే గాక, నల్లురిలోను బట్టి
ఉత్తినే తిట్టేవు జిత్తులమారి,
మగవాని మరియాద మంటలోఁ బెట్టి,
మగవాఁడు సిగ్గుచే ప్రమాన్పడి చూడ,
చాగురే, బోగముచానచందాన
కారుకూఁతలు పాటగాఁ బాడుకొనుచు,
చేతులు తిప్పుచు త్తైతక్కలాడ
తగవరు లెవరేని నగిపోరె సవతి!
ఇంతయాఁగడము నీ కేటికే సవతి!
ఈమిట్టిపాటు నీ కెన్నాళ్లె సవతి!
ఈతుళ్లుతెళ్లు కానీలేవె సవతి!'
అని యీసడించుచు నదరిపాటునను
మేకపై బెబ్బులి జోకమై దూఁకు
టీకున మై పెంచి, లోకులు బెదర,
మిత్తిరూపున మీఁదమీఁదికి వచ్చి

బుగ్గలు పొడుచుచు పగ్గెలాడుచును
గగ్గోలుచేయు నక్కామినిం జూచి,
ఆచిన్నిమొఖకత లేచి నిల్చుండి,
'చూచితిరే, మీరు చూచితి రయ్య,
లోకులారా, నాదె లోటుపాటున్న
ముచ్చెలు గొని నన్ను మోదింపరయ్య!
మొదలుగా విన్నావు గదర నాజోడ,
ముదలచేయుము నేరమును నేరుపఱచి;
నీ కడ్డ మున్నదే లోకమ్మునందు?
మమ్ము నెమ్మిని పెంప మందలింపఁగను,
తిట్టంగ కొట్టంగ తెంపున చంప
నాయ మున్నది నీకు నాయేలువాఁడ!
త న్నేమి యంటి, నా తప్పేమి గంటి?
అది యిట్లు కయ్యానికై కాలు దువ్వి
చెలరేగి దూఱుచు చిందులాడంగ
మిన్నకుండెదు నాయమే నీకు నకట!
కానివాఁడుగ నీవు కలిగించుకొనక
యూఁకొని యూరక యున్న నాసవతి
లోకువగట్టి యట్టాఁకలం బెట్టి
న న్నేఁచకుండునె నాయెమ్మెకాఁడ?'
అని యింక యేమొ మాటాడెడులోన
ఆపెద్ద కొరవంజి కోపాన రేఁగి
పెనుసత్తివలె వచ్చి పెళ్లుపెళ్లునను
రెండుచెంపలు గొట్టి రెట్టఁ బట్టీడ్చి
పడఁ దన్ని మదిలోని పగ దీర్చుకొనియె.
అప్పు డాయెలనాఁగ, ఆయొర్మి యేమొ,
చప్పున లేచి యాసవతాలి డాసి,
'ఓయక్క! యిటు సేయ నొప్పునే నీకు!
నాయక్కవలె నెంచి నడచెదఁ గాక;
నేను చేసిన దేమి నీ కిట్లు, చెపుము!
ఈసు నీయందు నా కిసుమంత లేదు;
పసుచుఁదనంపు కావర మేమి లేదు;
చక్కందనమ్మున నెక్కుడి కమ్మ!
నీకన్న చక్కన నా కేమి కలదు?
నీవు చెప్పినయట్టి నీతులఁ నేను
నిక్కమ్ములని మున్నె నెఱ నమ్మినాను.
కాన నిత్తెమ్ములు కానట్టివానిఁ
గట్టివానిఁగ నమ్మి గరువింప సుమ్ము!
నీ కొక్కమాట నే నిదె విన్నవింతు;
తలపెట్టలే దింతదాఁక నీయూసు;
నామగం డేటికో నామీఁద నలిగె;
ఏతప్పు నావల్ల నిసుమంత లేదు;
మొఱకు లెవ్వారొ చెవి గొఱికినా రనుచు
ననుమానమున నట్టు లాడితిఁ గాని
నీమీఁదిపగచేత నే నాడలేదు;
నీమీఁద పొర పేమి నామది లేదు;
ఆమాటలకె నీకు నలు కేల వచ్చె?
ఉలు కున్నదానికే అలు కెక్కు వనుచు
సామెత విందుము జగతిలోఁ, గాన
నీవె దీనికి మూల మేమొ నటంచు
నామది గట్టిగా ననుమాన మొదవె.
అక్క, యింకొక్కమా టాలింప వమ్మ!
మగఁడు ని న్నేవగింపఁగఁ జేతు ననుచు,
నీసుగంబుల కెల్ల నే నాసచేసి
ని న్నొల్లకుండంగ నేఁ జేతు ననుచు
లేనిపోని తలంకు లూని యున్నావు;

భ్రమఁ జెంది నామీఁద పగఁ బూనినావు;
నేను నీ కడ్డంబు నిలిచినా ననుచు
మగని న న్నెడఁబాప మది నెంచినావు;
ఏమేమి బూమెలో నామీఁద పన్ని
యేలికతలలోని కెక్కించినావు;
కాకున్న నీ కేల కలిగె రోసమ్మ?
ఇపుడు నీచేసిన యీ రట్టు చూచి
మొదలక తా నేల మిన్నకున్నాఁడు?
అక్కరో, నామీఁద నలుగఁ బోకమ్మ!
నిందెలు మోపుట నీతి గాదమ్మ!
చాడీలు చెప్పుట పాడి గాదమ్మ!
కాఁపురాలను గూల్చు గడుసుందనాలు
చేత లిల్లాలికి చెల్ల వోయమ్మ!
మగఁడు మక్కువతోడ మగువ నేలుటకు
మూలము బంగారు సీలమే కాని
మాటతేటలు గావు, మచ్చికల్ గావు;
వగ వద్దికలు గావు, నగవులు గావు;
గారముల్ గావు, సింగారముల్ గావు;
సయ్యాటములు గావు, చదురులు గావు;
వలపించుటలు గావు, వగపులు గావు.

మగనిపై మనసులో మక్కువ యున్న
మగువపై మక్కువ మగనికి నుండు.

మగనిమనస్సు చూఱగొనంగ నెంచు
మగువ నిండుమనమ్ము మగని కీవలయు.

మగని లోఁబఱుచుకో మదిఁ గోరుమగువ
మగఁడు తన్నే కోర మదిఁ గోరుమగువ
తనదు మనస్సుచే, తనమంచి చేత,
తనమేలుపనులచే తన మగం డలరి
తను మెచ్చుకొనెడు రీతిని మనవలయు;
అంతియే కాని నాయక్కరో, వినుము,
మాటతేటలచేత, మాయలచేత
మగవానిఁ దనబానిసగఁ జేసికొన్న
కలకాలమును నిల్వఁగలుగ దా వలపు.

మనసు లొక్కటియైన మక్కువే యైన,
తనువు లున్నన్నాళ్లు తరలక నిలుచు.

తలఁపునం దీమాట నిలుపు మోయమ్మ!
మాయక్క, మరియొక్క మా టాలకించు:
అచ్చిక బుచ్చిక లిచ్చకా లాడి
కొండెంబు లొరులపైఁ గొంకక చెప్పి
మగని మెప్పించి తా మరగించుకొనఁగఁ
దలఁచు టెంతయు వెఱ్ఱి తన మానుగాని
వెలఁదికోరికి నెఱవేఱదు సుమ్ము!
నిలుకడమీఁదను నిజమెల్లఁ దెలిసి
ముగుదకున్న సుగంబు మొదటికి వచ్చు.
మంచితనముచేత, మక్కువచేత
మగవాని కైవసంబుగఁ జేసుకొన్న
మగనాలు సుగముగా మనుగడ గడపు.

ఈసున్న చెలికి సంతోసంబు సున్న.
ఈనానుడిని మది నిడుకోఁగదమ్మ!
తోడఁబుట్టువులట్ల కూడిమాడుచును,
నేస్తంబు గట్టిన నెలఁతలరీతి
కలసి మెలసి యున్న చెలులము మనము;
కయ్యమాడుటలు చుల్కన గాదటమ్మ!
పెద్దదానవు నీవు, పిన్నను నేను;
నేను నేరనిదాన, నీవు నేర్పరివి:
నీ చెల్లెలుగ నెంచి నెనరుతోఁ జూచి

నను గారవింపవే నాతల్లి కాన!—'
అని వేడుకొనుచున్న యంగనఁ జూచి
సవతి కావున చిన్ని పువ్వుఁబోఁణిమీఁద
సవతు గానని యీసు సహజంబు గాన,
సవినయంబుగ నన్న సరసోక్తు లెల్ల
నవినయంబున నాడినట్టు లూహించి,
ఆపెద్దమెఱుఁకత యలుక రెట్టింప
ప్రేలంగఁజొచ్చె నోరికి వచ్చినట్లు:
'ఓసి మాయలమల్లి, దోసాలవెల్లి,
ఓసోసి వేసాల యూసరవెల్లి!
మోసాలలో నన్ను ముంపఁజూచితివా!
మొగవానిఁ దెగిమొత్తి మోసాల కేగి
మొఱఁబెట్టినట్టు నాప్రామోలకు వచ్చి
వగచుచు వగచుచు వాఁకిలిడ్డట్టు
నను వేడుకొనులాగు నటియించుచుండి
కారు లంటివి పెద్ద నేరమ్ము మోపి:
నాగోనా లెఱుఁగని నరు లెవ్వరైన
నిజమని నమ్మిన, నీచురా లనెడు
వాదు రాదే నాకు వగలాఁడి కాన!
ఇటువంటి మాయ లింకెన్ని నేర్చితివె?
మటుమాయలాఁడిరో, మాటిమాటికిని
నామగం డంటి, కానాచివే నీవు?
మనమగం డనరాదె? మాటమాత్రమున
మగఁడు నావాఁడుగా మారిపోఁగలఁడె?
పొలితి, యీమగఁడు వెంగలివాఁడు గాన
మాయమాటలచేత మన సుబ్బఁజేసి
కరగించి మరగించి మఱియుచున్నావు.

మగవాఁడు గడుసరి మనసువాఁడైన
గడిమైన నీ నాటకము సాగఁగలదె?
ఏనాఁటికైన నీ యీబూటకములు
తేటతెల్లమ్ముగాఁ దెలిసి యేలికకు
వెగటు పుట్టెడునట్టి వేళ రాకున్నె?
ఈలాగు పెద్ద ప్రోయాలా డినట్టి
మాటలలో పోటుమాటలు కొన్ని
మగనిడెందమునకు తగిలిన ట్లయ్యె.'

సింగనిమదిలోను చిరమరల్ పుట్ట,
కాంతాళమున పెద్దకామిని మున్ను
చిన్నచేడియమీఁద చెప్పినయట్టి
కొండెముల్ నమ్మి యాకోమలిమీఁద
నేవగొన్నకతాన నెఱుకు కన్నాకు
చీకాకుపడినట్టి చిత్తంబుతోడ
తా కాఁకపడి చిన్నతనిని కిట్లనియె:

'ఓసి దోసి, పిసాసి, ఓసి రాకాసి!
ఇంతగందరగోళ మేల పెంచితివె?
ఏమి చెప్పితినె నే నిందాఁక నీకు?
పాటిసేయవు నాదు మాట సుంతైన:
నను లెక్కచేయకున్నా వెంతపొగరె?
నెఱవీది కెక్కి నన్నే చూడుఁ డనుచు
గంతులువేతురే గఱిత లెందైన?
ఇల్లాలి లంజన్న నిలు దూఁఱు నండ్రు;
ఇల్లాలు వౌదువే? యిటు రజ్జులాఁడి,
మగవాని నమ్మించి మనఁజూతు వహహా!
నీమాయలకు లొంగి నినుఁ గూడి మరల
సరివారు నవ్వ కాఁపురము సేయంగ
చేలనే? యీహటం బేలనే? యూస
లేలనే? యడియాస లేలనే? యింక
నేలనే నిన్ను; నీ వెందైనఁ బొమ్ము.

పోమ్ము పొ మ్మింక నీపోకిళ్లు మాని.
పోకున్న సైరింపఁబో నింక నిన్ను.'
అని యిట్టు లెఱుకువాఁ డాగ్రహం బడర,
గండఁడై ఖండనగా నాడినట్టి
యాపల్కు లాలించి యాముద్దరాలు
గుండె తల్లడ మంద కొయ్యామై పోయె;
కడఁబట్టె ప్రాణంబు పుడమిపై వాలె.
అది చూచి ప్రజలెల్ల హాహా! యటంచు,
ఇల్లాలిదురవస్థ కెద జాలిపడుచు,
'అయ్యయో! మూర్ఛిల్లె నాబాల బేల,
చల్లరే చన్నీళ్లు చావమోమునను!
మెల్లన విసరరే మెలఁతుక' కనుచు
చెలువ లాకోమలి సేద దేఱంగ
చేరి చల్లనిసేవ చేసి రావేళ.

తత్తరంబునఁ జూచె దాని నాసవతి.
ఉత్తలంపడి చూచుచుండెను మగఁడు.
ఎలనాఁగ యంతలోపల మూర్ఛదేరి
రెండుచేతులు మోడ్చి రివ్వున నరిగి,
విడిచిన పువ్వుతో విలసిల్లు ననఁటి
పెనుగాలిచే పుడమిని గూలినట్లు,
ఎఱుకుపాదాలపై నొరగి యెల్గెత్తి
గండుకోయిలభంగిగా నేడ్వఁదొడఁగె:
'ఓదొరా, సవతితో వాదేల నాకు?
నెనరు చూపెనఁ జాలు నీవు నామీఁద;
కనికరించినఁ జాలు కాసంత నీవు;
జాలిఁ జూపును, పదివే లదే చాలు:
నీమేలు నామీఁద నిరుకుగా నున్న
సవతిజో లేల, యేసంత నా కేల?
నరకు సేయనుసుమీ జగ మేమి యైన?
"సైఁపుతో నీతప్పు సైరించినాఁడ"
నని యొక్కమాట నీ వాడవే నరుఁడ!'
అనుచు మోమున దైన్య మతిశయిల్లంగ,
వినువారిమనసుల పెనుజాలి గొలుప,
కొసరి పల్కెడు వేఁడుకోలు పల్కులకు
మారుమాటాడంగ నేర కాయెఱుకు
కనుచుండె బొమ్మయై కను లప్పగించి.

'పలుకవా! పలుకవా! పన్నీరుమొలక!
అలుక చాలింపవా, అఁపరంజిచిలుక!
రచ్చించవా నన్ను, రతనాలపలక!
నాదు దేవరవైన నీకు ముంగలను
పాదాలు ముట్టి నే బాసచేసెదను;
ఒట్టిడుకొందు, నీ వొక్కింత తాళి
నాసత్తమును జూడు నాదైవరాయ!
బెబ్బులిమీసాలు పెనవేసి యీడ్తు;
తాఁకెద నలిగిన తాఁచుకోరలను;
కడలిఁ జొచ్చెద, నగ్గి వెడలివచ్చెదను:
నమ్మిక యిప్పింతు నాబైలుచేత ;
సాకిరులుగఁ జేతు నాకోటిసురల ;
ఈపంటవలఁతిచే నిపుడె పల్కింతు.

నెలను దూలింతు, చుక్కలను రాలింతు;
విటతాటపఱుతు రేవెల్గు, వేవెల్గు.

నమ్మవా, నమ్మవా, నాముద్దుమామ?
కనవ, నాకనుచెందొగలచందమామ?
చూడవా, నాసుద్దసుద్దిచందంబు?
వీడవా, యెద నాటి వేఁచు చిందంబు?
మానవా, నామీఁద మదిగొన్న చలము?

పూనవా, నన్నోముబుద్ది నిచ్చలము?
నాదుకందనగాయ, నాజీవగఱ్ఱ,
వలపులకోవ, నాతలఁపులతీవ!
నీక్రేవ నన్ను రానీవటే' యనుచు,
'కొసరక న న్నేలుకోవటే 'యనుచు,
పలుపలువిధముల భయభక్తు లడర
బతిమాలు బామాలు భామను చూచి,
చేడియపల్కు లచ్చెరు వొందఁజేయ,
కరఁగి యుల్లంబు లక్కటికంబు గురియ,
ఎఱుకుమోరకుఁదనం బేవ పుట్టింప,
ప్రజలు భావోద్రేకపరవశు లగుచు,
'ఓరోరి మూర్ఖుఁడా, ఓకిరాతకుఁడ,
ఓరోరి ధూర్తుఁడా, ఓరిఘాతుకుఁడ!
ఏమిరా యీపంత మీయింతిమీఁద?
ఏలరా యీచలం బీబాలమీఁద?
చాలురా చాలురా సాదు వాదువులె!
చాల్చాలు పోపోర చపలచిత్తుండ!
పక్షపాతంబు కన్పడుచున్న దౌర!
వలపక్ష మల పెద్దభార్యపై నీకు
గాటమై నాటినకరణిఁ గన్పడియె;
న్యాయంబు గాదు; నీనడవడి యెల్ల
లోకుల కీవేళ రోఁత పుట్టించె.

వనిత యెంతటి పతివ్రతయొ కాకున్న
శపథంబు లాడునే సత్యంబు దెలుప?
శీలసంపద యొప్ప బాల గాఁబోలు,
ఏడిపింపకురోరి, యిక్కట్లు వచ్చు.

గజితల తలకట్టు గాసిఁ బెట్టెదవు;
కొలచుట్టుకొను నూరకున్న మా కెల్ల.

ఒక్క పరీక్ష యీయువిదచేఁ దెలిసి
సుదతి నీ వేలుట శుభమౌను నీకు.'

అని యొక్కపెట్టున నందఱు నాడ
ఎట్టకేలకు దాని కీకొనె వాఁడు.

అప్పు డాయతివ దిగ్గన లేచి నిల్చి,
ప్రజ లెల్లరిని జూచి ప్రాంజలి పట్టి,
'ఏకిమీఁద, నేఁడు వీరెల్లరుఁ జూడ,
ఎల్లవేల్పులుఁ జూడ, నేదోస మెఱుఁగ
నేను నిక్క మటంచు నీదుముంగలను
మడ్డు దీసెదను, నామైమ గన్గొనుము;
తీయునో నాయక్క, తేఁకువన్ గనుము—'
అని ఖండితమ్ముగా నాడినయట్టి
శపథంబు విని, గుండె జలదరింపంగ,
ఆపెద్దయెఱుకత యేపెల్ల నణఁగ,
కుక్కిన పేనయ్యె గుక్కుమిక్కనక.

'పలుగురిలోపల నగుబాటు లయ్యె;
మడ్డు దీయుటయంచు మాయ నాసవతి
గడ్డుపరీచ్చ యెక్కడ దాపరించె?
మడ్డు దీయు టనంగ మాటలా యేమి?
ఆసుద్ది కెంతయిల్లాలు గావలయు?
నావంటియొకపాటినాతికి తరమె?
పదిమంది తన్ను శాబాసందు రనుచు
పగ్గె లగ్గలముగా పలికెనే గాని,
తలఁగక తాఁ దీయఁగలుగునే మడ్డు?
తీయునో యేమొ బల్ తెరవాటుకత్తె,
మటుమాయలాఁడి, తా మందులు మాఁకు
లెన్ని నేర్చినదొ? లేకున్న నేఁ డిట్లు
పతినలు పట్టునే పజ యాలకింప?'

'తన కవమానంబు తప్పదో' యనుచు
నబలగుండెలు గుబగుబలాడ నుండె.

ఎఱుకఁ డాపలుకుల కెద తొట్రుపడఁగ
నేర కేమియు నట్టె నిలువడిపోయె.

అప్పు డాప్రజలలో నాయన్నుమిన్న
కలఁగక పలికినపలుకులం గూర్చి
మానిసి కొక్కొక్కమాటగా నాడ
కలకలం బుదయించె గంద్రగోళముగ.

ఇట్టి సందడిలోన నెల్లరి చూడ్కి
ఆచిన్నిజోగినినే చేరియుండె.

అది యంత పెదవిని గదపెనట్లైన
నిశ్శబ్ద మైపోయె నిఖిలంబు నచట.

'చెలువుఁడా, నేఁడు బోనేసియున్నాను;
నిట్టుపాసముతోడ, నేమమ్ముతోడ;
సత్తెంబు సూపుట క్రొత్తడి తగవు;
ఎల్లిఁ బూనెదఁ గాక యీకర్జమునకు,
సెల వీవె నేఁటికి చెంగనా లిడుదు.'

అనుపల్కు లాలించి యట నెల్లవారు
ఔదల లూఁగించి రౌఁగాక యనుచు.

ఎఱుకువాఁ డోడఁబడె నీచందమునకు;
ప్రజలెల్ల సంతోసపడిరి డెందముల;
నెవరిదారిని వార లిండ్లకు చనిరి.

మద్దు దీసెడు వింతమాట యూరెల్ల
నానోట నానోట నపుడె వ్యాపించె.

అబ్బురంపువిశేష మైనకతాన
ఆచుట్టుపట్టులయం దున్నయట్టి
పల్లెలు పట్టాలు ప్రాఁకె నవ్వార్త.

ఆశీలవతి యట్టు లగచాట్లుపడుట
చూడఁజాలఁగలేక సురలతో చెప్పి
తో డ్తెచ్చి యామెకు తోడు పడంగఁ
బూని యేగెనో నాఁగ భానుండు చనియె.

నిర్దోషురాలైన నెలఁతుకమీఁద
చెడునింద మోపిన చెనఁటిపై ప్రకృతి
కినిసెనో యన సంజకెంజాయ లొలసె.

మచ్చరించినయట్టి మదవతిబుద్ధి
అంధకారనిమగ్న మగునన్నరీతి
నిబిడాంధకారంబు నిండె లోకమున.
ఇరువురాండ్రకు మధ్య నిఱుకులోఁబడ్డ
పురుషులు మతిమాలి వెరవులు మాలి
యలయుచు కొట్టుమిట్టాడుకైవడిని
కటికిచీఁకటిలోను కను గానరాక
ప్రాణికోటులు పాట్లుపడుచుండె మిగుల.

లోకయాత్రను చేయు లోకుల కెలమి
బాసటపడు పుణ్యపరుల తీరునను
జీవయాత్రికుల కాచీఁకటిలోన
దీపికల్ జగమెల్లఁ జూపుచునుండె.

సవతిపై సొడ్డుగా సాహసం బడర,
తెల్లవారఁగ మద్దు దీతు; నామగని
మనసు మెప్పింతు; నామగఁ డెల్లి నన్ను
కైకొను నేకుందుకందులు లేక;
సరివారిలో నే మసలఁ గందు ననుచు
చిన్నియామెఱుకత చిత్తాంబుజమున
జనియించుచున్న యాశాజ్యోతు లనఁగ
మెఱసె చుక్కలు మింట మినుమినుక్కనుచు.

ఈలువు గలిగిన యిల్లాలిమీఁద
పట్టరాని యసూయపడి నిందె గట్టి
నట్టియాకట్టిడి మిట్టిపా టెల్ల
ననతికాలంబులోననె మచ్చమణఁగుఁ
గద యన్నపగిది లోకము మాటుమణఁగె.

నేరముల్ చేసిన నీచులు తమిని
జడియుచు నిసివేళ చరియించుకరణి
గూబలు వెలువడె గూళ్లలోనుండి.

కాలమన్ మైదెఱుకలవాఁడు చెలఁగి
నిలువున తెలివిసొమ్ములు దోఁచుకొనఁగ
నిఖిలజీవులమీఁద నిదురమత్తనెడు
మచ్చుమందును జల్లి మైకమ్ము గొలిపె.

గరితలమిన్నయా నెఱుకతమీఁద
కటికికల్లలు చాల కల్పించి చెప్పి
యపవాదు పుట్టించినట్టి తొయ్యలికి
తలవంపులగు నేఁడు, తప్పదటంచు
గట్టిగా నొక్కి వక్కాణించునట్లు
కోళ్లు మువ్వరుసలన్ గూసె గొంతెత్తి.

తెలవారుమును మద్దు తిరునాళ్లు చూడ
పల్లెపల్లెలనుండి పైనమై వచ్చు
ప్రజకు మార్గముఁ జూప ప్రాగ్దిశారమణి
కడఁగి పట్టిన దొడ్డకరదీప మనఁగ
వెలిఁగె తూరుపుచక్కి వేగురుచుక్క.

క్రొత్తడి మిన్నలన్ గూర్చిన కథలు
సత్తాలు మహిమలు శాపాలు శాస్తు
లద్భుతకార్యంబు లక్కజం బొదవ
పెద్దలచే విన్న పెక్కు చందములు
కుతుకంబుతో చెప్పుకొనుచు నేతెంచు
ప్రజలకంఠధ్వనుల్ పక్షులధ్వనులు
కలసి యాయూరెల్ల కలకలం బయ్యె.

చీఁకమై లోకంబు చీకాకుపఱిచి
యేఁచుచీఁకటి సోఁకు నేపు మాపంగఁ
దలఁచిన లోకబాంధవుఁడైన యినుని
చండప్రతాపతేజఃపుంజ మనఁగ
నరుణకాంతులు పర్వె నాకాశవీథి.

దినరాజు విడిచిన దివ్యమయూఖ
బాణపరంపరాబాధల కోడి
చీఁకటిరాకాసి కాకులై వచ్చి
కావుకావుమటంచు కమలబాంధవుని
పాడుచు దిశలకు పఱచుచందమున
కావుకావుమటంచు కాకులు వెడలె.

తనబ్రతు కేమౌనో, తన గతేమవునో
యని గుండె తటతటలాడంగ నున్న
చాడీలయెఱుకలసానిమో మట్లు
కలువ కన్నె మొగంబు గ్రక్కున ముగిడె.

తనదుశీలముపట్ల, తనచిత్తశుద్ధి
పట్లను, తనదైన పతిభక్తిపట్ల
గట్టినమ్మిక గల్గి గ్రాలెడుకతన
ధైర్యంబు స్థైర్యంబు దనరిన దగుట
గరితయాస్యము కలకలలాడునట్లు
పద్మిని వికసించి ప్రభచే రహించె.

నిఖిలదేవతలను నెమ్మిఁ దోడ్తెచ్చి
కనరానిగతి నిల్చి గగనభాగమున
మహనీయమగు సాధ్వీమహిమాతిశయము
కడునసడ్డను వేయికన్నులన్ జూడ

నింగిపై పొడవెక్కి నిలిచెనో యనఁగ
ప్రభవించె శ్రీసూర్యభగవానుఁ డపుడు.

అటమున్నె వేకువ నరుణోదయంబు
గాకుండ లేచి యా గరితలమిన్న
చెరువులో స్నానంబు చేసి యేతెంచె;
గ్రామదేవతగుడికడ నొక్కయెడను
గోమయంబున శుద్ధి గొనకొని చేసి
బాగుమీఱఁగ రంగవల్లికల్ తీర్చి
పద్మాసనస్థ యై పడఁతి కూర్చుండి,
హృదయేశ్వరునిఁ గూర్చి, యిలువేల్పుఁ గూర్చి
సరిలేని నిష్ఠతో జపము గావించి,
పిడుకలతో దాలి పేర్చి యొక్కెడను
నిప్పు ముట్టించి నూనియ నించినట్టి
బాణలి నొకదాని దానిపైఁ బెట్టి,
అగ్గి రగులుకొల్పి అత్యుత్సుకమున
ధ్యానంబులో మున్గి తా నుండె నంత;
పౌరు లందఱు కూడి వచ్చి రచ్చటికి;
పల్లెపల్లెలనుండి ప్రజలెల్ల దిగిరి;
పట్టణంబుల వేల ప్రజ వచ్చిపడిరి;
నరసముద్రం బయ్యె నా ఁడా స్థలంబు:
పతిపత్నియుత్సాహభరము రెట్టించె.

జపము చాలించి యా సతివతంసంబు
పతిని సమీపించి వలగొని వచ్చి
సాష్టాంగముగ నమస్కారంబు చేసి
బత్తితో పతిదేవు పాదాంబుజములు
కడిగి పూజించి తా కనుల నద్దుకొని
పువులు కుంకుములతో పూజ కావించి
పాదోదకము తల పైని చల్లుకొని
బత్తి నా తీర్థంబు పానంబు చేసి,
అలకుంకుమమున బొ ట్టలికానఁ బెట్టి,
వేణిలో నాపూలు వెలయంగఁ దాల్చి,
గుడిలోపలికి పోయి కుదురైన బత్తి
గ్రామదేవత మ్రొక్కి ప్రార్థించి వచ్చి,
సూర్యదేవునిమీఁద చూపు నిగిడ్చి
ప్రార్థన గావించి పదపడి వచ్చి,
'సెలవా' యనుచు తన చెలువుని వేఁడి,
పతివేలి నిడుకొన్న బంగారు బటువు
కోరి పుచ్చుకొని తా కుతుకంబు మీఱ
బాణలిలో వేసి, 'బాల చేతులకు
పసరు రాచిన దేమొ పరికించినామొ'
అనియెడు ననుమాన మెనయకయుండ,
కుంకుడుపులుసుతో గోళ్లు సైతముగ
చేతులు శుభ్రంబుగా తోమి కడిగి,
అగ్గి బాణలి చెంత కల్లన వచ్చి,
ముమ్మారు లగ్నె నిమ్ముగఁ జుట్టివచ్చి,
సర్వదేవతల నిశ్చలమానసమున
స్మరియించి, పతిని నెమ్మనమున నిల్పి,
చూపఱ వెఱఁగంద, సురలు హర్షింప,
మందహాసము మోము నందగింపంగ,
సలసల మసలెడు చమురులోపలను
మంచిగందపునీట ముంచినయట్లు
చెయి ముంచి తీసె నచ్చెలువునుంగరము.

కన్నె చేఁ జిగురాకు కసుగంద లేదు;
బాల తా మిసిమింతురాలు కాలేదు;
మోము విన్నఁదనంబు గ్రీము కాలేదు;
పున్నమనెలవోలె పొలఁతుక వెలిఁగె.

ఈ వింత చూడఁగా నేతెంచినట్టి
ప్రజలెల్ల 'రిది మహా పతిభక్తురాలు,
సాటి గానని తప స్సొంపన్నురాలు,
సీతకే చెల్లె నీ నాతికే చెల్లె
అనలుని చలువచందనముగాఁ జేయ;
అహహా, యీ యిల్లాలి మహిమాతిశయము
వర్ణింప వశమానె వాణికి నైన?—'
అని యిట్లు కొనియాడి యానంద మలర
చేతులు జోడించి జోత లొనర్చి
జేజేధ్వనులు చేసి సేసలు చల్లి
నెఱపచ్చకపురంబు నివ్వాళు లిచ్చి
భక్తితత్పరతలు ప్రకటించి రపుడు.

ఆవింత చూడంగ నట నిల్చియున్న
నాలితనాల కన్నాకయియున్న
మొఱుకత యొడలెల్ల చుఱుకున మండె.

అగ్గి యంటిన దంచు బెగ్గిల్లి మొఱుకు
పొలఁతుక యొడలెల్ల కలయంగఁ జూడ
నింగిపై చుక్కలు నిండుకొన్నట్లు
కొమ్మ నెమ్మేన పొక్కులు నిండుకొనియె.

అవి మెట్టివో కాని యాపొక్కు లెల్ల
బగబగలాడుచు బాధింపఁ దొడఁగె.

ఆబాధ పడలేక యామొండికట్టె
ఎలుఁ గెత్తి గొల్లున నేడువసాగె.

ఇది యేమొ యని చూచి యెల్లరు నగిరి.

తనమేనిమంటల ఘనబాధకన్న,
జనులెల్ల తన్ను నవ్వినబాధ కన్న,
తనసూడు సవతి చూపిన మేటిమహిమ
తనమనం బెరియింపఁ దలకొన్నబాధ,
సవతి నెల్లరు మహాసాధ్వి యటంచు
పొగడి వేల్పులకైన పొందఁగా రాని
గౌరవంబును జేయఁ గనులారఁ గన్న
బాధ యత్యధికమై పరితాప మొదవె.

ఆమొఱుకలసాని కాయంబు నిండ
నెలయు పొక్కుల కేమిహేతువో యనుచు
చర్చింప సాగె నాజనసంఘ మెల్ల.

'శాప మిచ్చిన దేమొ సాధ్వి తా' ననుచు,
'సాదు లుస్సురుమన్న పో దూర' కనుచు,
'మంత్రించె నేమొ యామహిమాఢ్య' యనుచు,
ఎదలఁ దోఁచినయట్టు లెల్ల వాకొనిరి.

'మసలెడు నూనియ మడ్డులోనుండి
తెఱవ యుంగరమును దీసిన వేళ
సవతిసూడును దీర్ప సమకట్టి చెంత
నిలిచి చూచెడుదాని నెమ్మేని నిండ
చిలుకు వేసినభంగి చెలి నూనెచేయి
చిలుకరింపఁగఁబోలు చేరి కన్గొనుఁడు:
చమురుపొక్కులె అవ్వి, సందేహ మేల?'
అని నిశ్చయముచేసి రట కొంతమంది.

జరిగినకథయెల్ల నరయుచునున్న
మొఱుకు ఖేదము మోద మెదలోన నిండ
చిన్నయిల్లాలిని జేరఁగాఁ బోయి
తోరంపుబత్తితో దోసిలి యొగ్గి,
'చెలువ, నీసత్తువ తెలుసుకో లేక,
వెలఁది, నీసీలంబు తెలుసుకోలేక,
చెలియ, నీయీలువు దెలియఁగాలేక,
తెఱవ, నీడెందంబు తెలియఁగాలేక,

కలికి, నీచందంబు గానఁగాలేక,
చాన, నీదునభాము గానఁగాలేక,
పెద్దాలిసుద్దులే పెద్దగా నమ్మి
నిన్ను కారులు కూసి చిన్నపుచ్చితిని;
ఎల్లిదం బొనరించి యేడిపించితిని;
ఎగ్గుతగ్గుల నాడి సిగ్గుపర్చితిని;
సవతిచే మొత్తించి చౌకచేసితిని:
నన్ను మన్నింపవే నాముద్దుగుమ్మ!
నన్ను సైరింపవే నాముద్దరాల!
నీవు నాయింతివై నెగడుటచేత,
నీవు నానెలఁతవై నిలుచుటచేత,
పున్నెమ్ము గంటినే పున్నెంపురాసి!
భాగ్గెంబు గంటినే భాగ్గెంపుబరణి!
నాకొలంబు తరించెనే కొమ్మమిన్న!'
అని బుజ్జగించి హర్షాబ్ధిలోఁ దేల్చి,
పెద్దభార్యను జూచి తద్ద నిందించి,
'యేతప్పు నెఱుఁగని యెలనాఁగమీఁద
వాతప్పు పుట్టించి గాత చేసితివి;
నన్ను నీమాయచే నమ్మించివేసి
ఆడించితివి కోఁతి నాడించినట్లు;
చేయించితివి నీదు చిత్తమౌ పనులు;
రక్కసతనములో రగడ దేరితివి;
వేరముల్ పెంపఁగా నారి తేరితివి;
కొంపలు గాల్చు బల్ కొరివి వైనావు;
కాఁపురాల్ గూల్చు బల్ కటిటి వైనావు;
ఛీ, పోవె, పలుగాకి! ఛీ మాలకాకి!
మేలు వచ్చెను, చాలుచాలు నీపొందు;
నలుగురిలో నేఁడు నగుబాటు లయ్యె:
చెనఁటి, నీమొగము చూచిన పాప మొదవు;
నే నేల నోల్ల ని న్నిఁక, లేచిపోవె—'
అని యాగయాళిగంపను బారఁదోలి
చిన్నయిల్లాలితో చేసె కాఁపురము;
సౌభాగ్యపదవితో సంపదతోడ
సంతతితో సర్వసౌఖ్యాలతోడ
నిత్యసంతోషాన నిరుపమానముగ
నెఱుకు క్రొత్తడిమిన్న నెఱపె జీవితము.

జాతి మై దెరుకలజాతి దీనాతి;
చదువు సంపద లేనిజాతి దీనాతి;
శాస్త్రవాసన లేని జాతి దీనాతి;
జగతి సభ్యత లేని జాతి దీనాతి;
యేజాతి దైన హిందూజాతినాతి
యీనాతి కాన హిందూనాతిపట్ల
సహజమై విలసిల్లు మహనీయమైన
మహిమకు కొదవ యేమాత్రముస్ లేదు.

అది గాక యొక్కసత్యముగూడఁ గలదు:
చదువున కర్థంబు జ్ఞానంబు గాని
చదువైన యక్షరజ్ఞానంబు గాదు.

వివిధధర్మవివేకవిభవంబు లేని
చదువుట వ్రాయుట జ్ఞాన మెట్లగును?
చదువుట వ్రాయుట జ్ఞానమే యైన
చదువరు లేల యజ్ఞాను లైనారు?
చదువనివా రేల జ్ఞాను లైనారు?
జనుల సద్వర్తనసంపత్తికెల్ల
జ్ఞానానుభవమే ప్రధానమై యుండ,
జనులకు జ్ఞానంబు సహజమై యుండ,
చదువుతో పని యేమి సద్గుణంబులకు?
సాహితిపని యేమి సౌశీల్యములకు?

శాస్త్రాలపని యేమి సద్వర్తనలకు?
చదువు సాహితి శాస్త్రసంపత్తి లేని
జాతులలో శీలసంపత్తి గలదు;
నిరుపమానంబైన నెఱనీతి గలదు;
గణనీయమైన యోగ్యతకూడఁ గలదు;
తగవు ధర్మము సంప్రదాయాలు గలవు:
ప్రతి చూపఁగారాని పతిభక్తి గలదు;
మాద్రి చెప్పఁగరాని మహిమంబు గలదు.

దేశదిమ్మరులైన తెగలలోఁగూడ
ప్రాణపదంబైన పతితోడ దివికి
సహగమించినమహాసాధ్వు లున్నారు.

మానభంగము సిద్ధమైనవేళలను
ప్రాణాలు విడిచినపణఁతు లున్నారు.

మగఁడు తమ్మనుమానమతిఁ గన్నపట్ల
ఘనపరీక్షల నిక్ష గరిత లున్నారు.

కులముతక్కువవారు కుమతులు కారు;
కులముతక్కువవారు కులటలు గారు;
నిమ్నజాతులవారు నీచులు కారు.

కొలముతక్కువ యైన కులకాంతలందు
గుణ మున్నదనుట కీక్రొత్తడి సాక్షి.

సాక్షు లున్నా రింక శతసహస్రములు:
జాతులలో నిమ్నజాతిలో పుట్టి
పరమపతివ్రతాపట్టంబు గట్టి
రమణీమణులకెల్ల రాణి యైనట్టి
నాతి ఆరంజోతి జోతి గాలేదె?
ఆనాతిమిన్న దివ్యయశస్సుభాతి
నీనాతిమిన్న విశ్వేడ్యవిఖ్యాతి
యాచంద్రతారార్కమలరాకఁగాక!

నిరవద్యపురమను నిడుదవోలునకు
మిగుల చెంగట రావిమెట్టగ్రామమున
డెబ్బదియేళ్లనాఁ డీవింత గంటి
నని బొమ్మగంటి లచ్చయ శాస్త్రి తెలుప,
క్రొత్తడిచరిత వాకొన పున్నె మనుచు,
నిమ్నజాతులలోని నెలఁతలనీతి
యెల్లవారికి తేటతెల్లపరా ననుచు,
విరచించినాఁడు మ. వేంకటశర్మ.



# ఆనందరంగపిళ్ల—డూప్లే ద్విభాషి

వంగోలు వేంకటరంగయ్య పంతులుగారు, బి. ఏ., బి. యల్.

ఆనందరంగపిళ్ల కుటుంబమువారు మదరాసునొద్ద పెరంబూరులో నుండినారు. రంగపిళ్ల 30-3-౧౭౦౯ క్రీస్తుశకమున పుట్టినారు. వీరితండ్రి తిరువేంగడపిళ్ల. రంగపిళ్లగారి చిన్నతనముననే తిరువేంగడపిళ్ల ౧౭౧౬ ప్రాంతమున పుదుచ్చేరి చేరి ఫ్రెంచివారి వర్తకశాలలో సద్యోగిగా నుండినాడు. ఆయన ౧౭౨౬ మధ్యభాగములో చనిపోగా ఆయుద్యోగము రంగపిళ్లగారి కీయబడినది. ఈయన క్రమక్రమముగ వృద్ధికివచ్చి అచటి అధికారుల అభిమానము సంపాదించి తుదకు డూప్లే అను ప్రసిద్ధుడగు ఫ్రెంచిగవర్నరునకు దుబాసియై మహదైశ్వర్యమును, కీర్తిని పొంది ౧౭౬౧ సం. జనవరి ౧౬ తేదిని కీర్తిశేషు డాయెను.



ఆనందరంగపిళ్ల—డూప్లే ద్విభాషి

ఈయన జీవించియుండిన కాలములో దక్షిణ హిందూస్థానమున జరిగిన రాజకీయవిషయములన్నియు ఏదోయొకవిధమున ఈతనిప్రచారమునకు తగులుచునే యుండినవి. ౧౭౩౬ మొదలు ౧౭౬౧ వరకు ఈతడు తన దినవృత్తమును అరవభాషలో వ్రాసియుండెను. ఆమధ్య కాలములో జరిగిన రాజకీయవ్యవహారములనే గాక ఇతర లౌక్యవృత్తాంతములగూడ నందు జేర్చెను. వాల్మీకి తనరామాయణములో జెప్పుకొనినప్రకారము ఈతడును 'రహస్యంచ ప్రకాశంచ' తనడైరీలో నెక్కించుచుండెను. ఒకానొకనాడు డూప్లే మంత్రసభ గావించి తమకును ఇంగ్లీషువారికిని గల గొప్పరాజతంత్రముల నాలోచించెననుట మొదలు, ఎవరో ఏమూలనోయొకతుపాకిని కాల్పగా నందులో కూరబడిన పేచుఉండ దోవన బోవు ఒకానొక బ్రాహ్మణస్త్రీ మోకాలికి తగిలినను విశేషగాయము కాలేదనువరకును వ్రాసియున్నాడు. ఫ్రెంచిగవర్నరు గారింట వివాహమహోత్సవ వర్ణనయు, తనబంధువగు నొకానొకస్త్రీ సుబ్బరాయషష్ఠి యుపవాసమున్న విషయమును విశదీకరించెను. ఫ్రెంచివారు కర్ణాటకయుద్ధములలో సంబంధపడి విజయము నొందినవిషయము ఒక దినచర్యగా నుండ, మఱియొకదినచర్యయందు ఫ్రెంచి నాయకు డొకడు పుదుచ్చేరినుంచి మచిలీపట్టణమునకు పోవుమార్గమున నెల్లూరుజిల్లా శ్రీహరికోట పాళెగానిచే పట్టుకొనబడినట్లును, వానిదగ్గర నుండిన తుపాకి, గడియారము, కొంతరొఖము పాళెగాడు తీసుకొని వానినిఖైదీగా నెల్లూరుఫౌజుదారునొద్దకు పంపినట్లును అచట వీని వెండి పొడిడబ్బి, చొక్కాకు వేసుకునే బంగారుగుండీలు, రాతిగుండీలు తీసుకొనబడినట్లును తెలుపబడియున్నది. రాజాసాహేబు చందాసాహేబుగార్ల వృత్తాంతములు, అన్వారుద్దీను నిజాముల్ముల్కుగారి సమాచారములు ఓతప్రోతములవలె ఈడైరీలో నిమిడియున్నవి.

రంగపిళ్లకాలమునకే పుదుచ్చేరిప్రాంతములలో ఇండియను క్రైస్తవులు చాలమంది యుండినటుల తెలియుచున్నది. చారిత్రకులు, క్రీస్తుశకము ప్రథమద్వితీయ శతాబ్దములనుండియె దక్షిణహిందూస్థానమున క్రైస్తవ మతవ్యాపనము జరుగుచుండినట్లు చెప్పుచున్నారు గాని పుదుచ్చేరిప్రాంతపు క్రైస్తవుల చరిత్ర యెప్పుడు ప్రారంభమగుచున్నదో చెప్ప నవకాశము లేదు. కాని ౧౭౪౫ సంవత్సరము అక్టోబరు ౧౬ తేది ఉదయమున పుదుచ్చేరి పాదిరిగుడిలో దేశ విదేశక్రైస్తవులందఱు ప్రార్థనకొఱకు జేరిరి. ఆపాదిరిగుడిలో ఉత్తమజాతిక్రైస్తవులు (Caste Christians) ఐరోపియాక్రైస్తవులు కూర్చుండుటకును, దేశిక్రైస్తవులలో నీచజాతిక్రైస్తవులు కూర్చుండుటకును వేరువేరుప్రదేశము లుండినవట. ఈరెంటికి మధ్య గోడ యుండినది. ఆనాటిప్రార్థనాకాలమున కారికాల్ క్రైస్తవబోధకుడును అచ్చట నుండి క్రైస్తవులలో నీచోత్తమ భేదమును సహింపజాలక నీచజాతి క్రైస్తవులను పురికొల్పి రేపి ఆపాదిరిగుడిలోని నీచోత్తమ జాతిభేదములను దెలుపు నాతుంటరిగోడను తీయించివేసెనట. క్రైస్తవులు కాగానే మతము మారును గాని ఆభిజాత్య మేల మారవలయు. ఇందుకు రంగపిళ్లగారి డైరీయె ప్రమాణము. మరునాడు తిరుగ ప్రార్థనాకాలమునకు గుడిలో క్రైస్తవులందరు జేరగనే పూర్వదినమున నుండిన జాతివ్యవస్థానమున కుర్చీలు పేర్చి పూర్వపు నీచోత్తమ జాతిభేదమును సాధించిరట.

ఒకనాడు దేశీయక్రైస్తవురాలొకతె విలువగల సొమ్ములను ధరించి ఉల్లిపొరవంటి మల్లును ధరించి సువాసనద్రవ్యములను బూసికొని పాదిరిగుడికి పోయినప్పుడు పెద్దపూజారి దేవతారాధన చేయుచుండగ ఈమె సుగంధము లాతని ఘ్రాణేంద్రియమును బాధింపకొచ్చినవి. అంతట నాతడు ఆమెను సంబోధించి, యిల్లాండ్రు గుడికి వచ్చునపుడు దేహమంతయు తెలియునట్లు సన్నని వలిపెము గట్టుకొని భోగస్త్రీవలె అత్తరులు బూసికొని 'రాతగదు' అని హితబోధ చేసెనట. అందు దేశీయక్రైస్తవ పురుషులు అతని ఆక్షేపములకు కినిసి తమ జాత్యాచారములతో పాదిరి కేమిసంబంధమని సమ్మెజేసిరట.

ఈనాటి దేశీయక్రైస్తవులు దీని గమనింతురుగాత!

ఒకనాడొక బ్రాహ్మణజ్యోతిషుడు రంగపిళ్ల గారి ద్వారా డూప్లేగారి దర్శనము బొందెనట. వాన ఎప్పుడు గురియునని ప్రశ్నింపబడగ నాదైవజ్ఞుడు అక్టో

బరు ౧౮ తేదీకి సరియగు అరవనెల తేది చెప్పెనట. మొదట ఇది కొంచెము ఆశ్చర్యకరముగ నుండినదట గాని యీదేశములో అక్టోబరు ౧౮ తేది ప్రాంతములలో వాన కురియుట సహజమనియు, ఇందు జ్యోతిషుని గట్టి తన మేమియు లేదనియు డూప్లే చెప్పెనట. ఇప్పటికిని తూర్పుతీరము జిల్లాలలో డూప్లేనాటివలె అక్టోబరు మధ్యభాగముననె వర్షాకాలము ప్రారంభమగుచున్నది. చిత్తకార్తి అక్టోబరు ౧౦ తేదిని ప్రవేశమగుచున్నది.

కస్తూరి రంగకవి కృతిఛందస్సు ఈ ఆనందరంగ పిళ్లకే యంకితమైనది. అందువలననే దానికి ఆనందరంగ ఛందస్సనియు, రంగరాట్ఛందస్సనియు పేర్లు గలిగినవి. కస్తూరిరంగకవి వ్రాసిన వంశావతారమునుబట్టిచూడ రంగపిళ్లగారి పూర్వీకులు కృష్ణదేవరాయలుగారి వంశములోనిశాఖయైనట్లు కనపడుచున్నది. అటులయిన వీరు తెలుగువారుగనే యుండవలెను. విద్యానగరసామ్రాజ్యము నశించిపోయిన తరువాత ఆ రాజవంశస్థు లందరు చెదరి కాందిశీకులయి పోయిరి. రంగపిళ్లగారి పూర్వీకులు చెన్నపట్టణము చేరువనుండు పెరంబూరు జేరిరి. అచట నుండి ప్రబలి పుదుచ్చేరి జేరిరి. పెరంబూరు చేరినప్పటి నుండియు వీరికి కొలదిగ తెలుగువాడుక తప్పినది కాబోలు. అట్లు గానిచో 'పిళ్ల' లను పేరు వచ్చుట సంభవింపదు. ప్రస్తుత రంగపిళ్లగారికాలమునకు ఇంటి వాడుకభాషయు అరవమయినది కాబోలు. అందుచేతనే ఆయన తనదినచర్య నంతయు అరవభాషలో వ్రాయుటకు కారణమైయుండును. అయినను రంగపిళ్లగారికి మాత్రము తెలుగుభాషయందు అత్యంతాదరము గలిగి యుండినది.

ఒకానొకసందర్భమున ఈ కస్తూరిరంగకవి డూప్లేమీదను, అతనిభార్యమీదను కొన్ని తెలుగుపాటలు చేసెనట. వాని రంగపిళ్లగారు ఫ్రెంచిభాషను డూప్లేగారికి పరివర్తనముజేసి చెప్పిరి. ఈదేశభాష అరవముగ నుండగ ఈకవి అరవదేశమున తెలుగుకవిత్వమేల చేసెనని డూప్లే ప్రశ్నింపగ తెలుగు అయినయెడల ఆర్కాటు, మైసూరు, గోల్కొండ ప్రాంతములలో నంతయు అందరు తెలిసికొని ఆనందింపగలరనియు, అరవమయినయెడల ఈ పుదుచ్చేరి ప్రాంతములలోననేగదా తెలియగలదనియు కవి ప్రత్యుత్తరమిచ్చె. ఆకాలముననుగూడ తెలుగున కెంత గొప్పవ్యాపకము కలిగియుండినదియు ఇందువలన తెలియనగును. మరియు ఈ కవియు తెలుగుదేశస్థుడు గాడు. తిరుచినాపల్లిలో సేనానాయకులలో చిన్నయధికారిగ నుండెను. అటు లుండియు తెలుగున లక్షణగ్రంథము వ్రాయునంతటి పాండిత్యము, భాషాభిమానము గలిగి యుండెను. ఈకవి యారువేలక మ్మనియోగి తెగవాడయి నందున ఆంధ్రుడే యగును. ఈరంగకవివలెనే మరియు ననేకులు గొప్ప తెలుగుకవులు ద్రావిడదేశమున గొప్పగొప్ప రాజకీయాధికారములలో నుండి అచ్చటివారి బాలించుచు తమ మాతృభాషను వ్యాపింపజేయుచుండిరి. అల్లసాని పెద్దన్న కూడ ద్రావిడదేశమున గొప్పయధికారిగ నుండెనట. ప్రబంధరాజవెంకటేశ్వరవిజయవిలాస మను లక్షణగ్రంథమును వ్రాసిన గణపవరపు వెంకటకవియు ద్రావిడదేశమున సేనానాయకుడుగ నుండెనట. తంజావూరు తిరుచినాపల్లి జిల్లాలు ఆంధ్రనాయకరాజుల ఏలుబడిలో నుండగ అచట తెలుగున కెంతయాదర ముండినదియు తంజావూరులోని సరస్వతీమహాల్ పుస్తకాగారము సాక్ష్యమీయగలదు. రఘునాథనాయకుడు, వీరరాఘవనాయకుడును ఆంధ్రకవులు. విజయవిలాసకర్త చేమకూర వేంకటకవియు అచటనే వర్ధిల్లినాడు. ఇంకను అనేకులు పురుషులే గాక రామభద్రాంబిక, రంగాజమ్మ, తిరుమలాంబ మొదలగు స్త్రీలు సయిత ముండిరి.* ఇంక ననేకమంది నుదాహరింపవచ్చును గాని అదియంతయు ప్రకృతవిషయమున కప్రస్తుతము.

మన రంగపిళ్లగారి డైరీనే చూతము. పాపము, ఈ కస్తూరిరంగకవి కొక గయ్యాళి రంగమ్మ యను భార్య యుండెనట. ఆమె మగని విడిచి పుదుచ్చేరిలో విహరింప మొదలుపెట్టినదట. ఆమెవిలాసము అచటనచట కొలదిగ దగులుచున్నది.

* కురుగంటి సీతారామయ్యగారి తంజాపురాంధ్రనాయకరాజుల చరిత్ర చూడుడు.

నాడిర్‌షా ఢిల్లీని కొల్లగొట్టిన విషయము రంగపిళ్లగారిడైరీలో నెక్కియున్నది. ఇతడు క్రీ. శ. ౧౭౩౯ లో ౮౦,౦౦౦ గుఱ్ఱపుదండుతో ఇస్‌ఫహాన్ (Isphahan) నుండి బయలువెడలి ఢిల్లీమీదికి వచ్చెనట. అప్పటి కీయాఅకారుని పేరు తహమాస్ప్‌కూలిఖాన్ (Tahamasp Kulikhan) అని యుండినదట. ఢిల్లీ చక్రవర్తి మహమ్మద్‌షాను అతని ఉమ్రాలను చెరగొని తాను "నాడిర్‌షా" అనుబిరుదనామము బెట్టుకొని తన పేర నాణెములు వేయించెనట. (ఈనాణెము లెచటనైన దొరకునా ?) మహమ్మద్‌షా చక్రవర్తిపేరుతో నుండిన నాణెములు చలామణి కాకూడదని యుత్తర్వుజేసెనట.

తరువాత ఒకనెలకు చక్రవర్తి మహమ్మద్‌షాను చెర విడిపించి ఆతని కుమారితను పెండ్లిచేసుకొని ఆ చక్రవర్తికి తిరుగ ఢిల్లీరాజ్య మిచ్చెనట.

నాడిర్‌షా అనేకమందిపురుషులను చంపించెనట. అనేకస్త్రీలు ఆత్మహత్య జేసికొనిరట. నాడిర్‌షాగారి సేపమున జచ్చిన స్త్రీ పురుషుల సంఖ్య ౧,౦౦,౦౦౦ మొదలు ౧,౫౦,౦౦౦ ల వరకుండునట.

తన యొడయనియం దీరంగపిళ్లగారికి అత్యంత ముగభక్తిప్రేమ లుండినవి. ఇందు కొక యుదాహరణము: ౧౭౪౮ సం. అక్టోబరు ౨-వ తేది తెల్లవారు నప్పటికి ౩౧ ఇంగ్లీషు యుద్ధనావలు పుదుచ్చేరి సమీపించి ప్రళయాగ్ని ప్రళయవర్షము సంధించినటుల యోడలలో నుండి ఫిరంగిగుండ్లు వర్షించిరట. అపుడు ఫ్రెంచిగవర్నరు డూప్లే ఇటుల జెప్పిరట: "ఇటుల ఫిరంగిగుండ్లు గాల్చుటచే మనకోట నింగ్లీషువారు పట్టుకొనవచ్చునని తలచిరి కాబోలు. వారిపోకడ ఎందాక పోవునో చూతము; బయలుకాల్పవలదు" అనిరట. లోకరక్షకుడగు సూర్యుని జ్యోతివలన గాఢాంధకారము గాని దట్టమగు మంచు గాని ఎట్లు అదృశ్యమగుచున్నదో ఆలాగుననింగ్లీషువారిచేష్టితములన్నియు మహారాజరాజశ్రీ హిజ్ యెక్సెలెన్సి నవాబ్ మాన్‌సెర్ షెవిలియర్ డూప్లేబహదూర్ ముజఫర్‌జంగ్ గవర్నర్‌జనరల్‌గారి అసమానధైర్యస్థైర్య గాంభీర్య ప్రతాపముల యెదుట మాయమైపోయెనట. ఇంగ్లీషువారి ఫిరంగిగుండ్లు- తూర్పునుండియు పడమటినుండియు "సర్వాంతర్యామియగు ఈశ్వరునివలె" అంతటను పారుచుండెనట. పుదుచ్చేరి యిలాకావారు ౧౧౯ మంది చచ్చిరట. ఇల్లువాకిలి లేక, నిలువ నీడ లేనివా రొక ౮౫ మందికి గాయములున్ను తగిలెనట. ఇంత జరిగియుండగ రంగపిళ్లగారి స్వామిభక్తిప్రభావమున గాకున్న ఫ్రెంచి మొనగాండ్రు ఏమి చేసినందున ఇంగ్లీషువారికలు ఉద్యచ్చండభానునియెదుట మంచుమబ్బులవలె మాయమై పోయెనోగదా! ప్రాయికముగ చారిత్రకులు మాగధులవలె నిజ స్వామిస్తుతినె చేయుచుందురు గాబోలు.

ఈ డైరీలోని విషయముల నన్నిటిని వ్రాయుట యన్న డైరీని ఆంధ్రీకరించుటయే యగును. అట్టియుద్యమము క్రీడాధ్యవసాయసాధ్యము గాదు. తదేకదీక్షగ జేయవలయును. ఈ డైరి ఇంగ్లీషు పైకాఅక్షరములలో ముద్రితమయిన రాయల్ ఆకృతి గలిగి యేడుసంపుటముల మీద వ్యాపించియుండు షుమారు ౩,౦౭౮ పుటలపై విస్తరించి యున్నది. ౧౭౩౬ నుంచి ౧౭౬౧ వరకు వ్రాయబడియున్నట్లు కనుపడుచున్నను, మధ్యమధ్య కొంతభాగము ఖిలమైపోయినది. ఏడవసంపుటము ౧౭౫౧ యేప్రెలుతో ముగియుచున్నది. డైరిఅంతయు లభించి యుండిన ఎంత గ్రంథ మగునో.

రంగపిళ్లగారి కిద్దరు కుమారులు గలిగిరనియు, వారిరువురునుతండ్రి జీవించియుండగనే మృతులయినటుల ఈ డైరిని ఆంగ్లీకరించి ప్రచురింప నారంభించిన జే. యఫ్. ప్రైసుగారు ప్రథమసంపుటములో పీఠికయందు వ్రాసినారు. కస్తూరి రంగకవి తన ఛందోగ్రంథమున వ్రాసిన కృతిపతివంశావతారమున రంగపిళ్లకు ముగ్గురుకుమారుండ్రును నొకపుత్రుడు నుండినట్లు తెలియజేసి యున్నాడు. రంగపిళ్లగారి యిల్లు చూడ చోద్యమయిన వింతవస్తువై తరువాతితరములవారు చూడబోవుచుండిరి. మద్రాసు సుప్రీము అండు సదరుకోర్టుల ముఖ్యద్విభాషి (Chief Interpreter) గ నుండిన వెన్నెలకంటి సుబ్బరావుపంతులుగారు ౧౮౩౬ ఫిబ్రవరి మధ్యభాగములో ఈభవనమును జూచి ఆశ్చర్యపడినట్లు తమ స్వీయచరిత్ర

యందు వ్రాసియున్నారు. ఆయింటిద్వారబంధములు బంగారునులాము చేయబడి యుండినట్లు సుబ్బరావుపంతులుగారు వ్రాసియున్నారు. ఆయిల్లు ఇప్పటికిని ఉన్నదనియు, అందు ఆనందరంగపిళ్లె స్వరూపపట మున్నదనియు ప్రైసుగారు తమపీఠికయందువ్రాసి ఆప్రతిమాప్రతిరూపమును తమగ్రంథమున ముఖపత్రముగ జేర్చియున్నారు. విగ్రహము మహాస్ఫూర్తిగలిగి యున్నది. ఛాయ నల్లదిగ తోచుచున్నది. ముఖము తేజస్వంతమై యున్నది. ఆకృతి గాంభీర్యమును కార్యశూరతను సూచించుచున్నది. కాయము స్థూలమై పొడవైనదిగ కనుపడుచున్నది. మొగలాయిదుస్తు ధరించి యున్నారు. తలకు పాగా యొడలిమీద అంగీ గలిగి నడుము వరకు (bust) ఆప్రతిమ యందు గానవచ్చెడిని. వైష్ణవ చిహ్నమగు తిరుమణ్ణరేఖ ఫాలమునందున్నది. చెవుల కంటుజోళ్లు గలవు. అంగీమీద నడుముకు కాసె బిగించి దానియందు బాకు దూర్పబడియున్నది. కుడిచేత కత్తిపిడివంటి దగపడుచున్నది. ఇది బహుశః కత్తియో లేక చేతికర్రగనో యుండును. రూపము చూడగనే గొప్పవాడని యెట్టివారికిని తోపకమానదు. ఆకారసదృశప్రజ్ఞుడై యుండినాడు.

రంగపిళ్లె జీవితవృత్తములో జేరినది గాకపోయినను ఆయన పూర్వీకుల ప్రశస్తచరిత్రమున జేరిన విషయముల రెంటిని నిట జేర్పవలసెను.

రంగపిళ్లె తండ్రి తిరువేంగడపిళ్లె యొక్క బావమరది నైనయపిళ్లె యనునతడు ఫ్రెంచికంపెనివారియొద్ద మిక్కిలి చాలినవాడై చాల పలుకుబడి గలిగి ఫ్రెంచివారి వ్యాపారవ్యాప్తికి విశేష సహాయపరుడుగ నుండెను. ౧౭౧౬ ప్రాంతములలో హెబరు అను ఫ్రెంచియుద్యోగి యితనిపైన కొన్ని అక్రమాభియోగములు పుట్టించి ఇతనికి ఫ్రెంచివారి యభిమానము లేకుండ జేసి యితనిని ఖైదుచేయించినాడట. అతడు ఖైదులోనే చనిపోయెనట. అంతట నతనికుమారుడు గురువపిళ్లె యనువాడు పుదుచ్చేరినుండి మద్రాసునకు వచ్చి అచ్చటనుండి ఇంగ్లాండుకు పోయి అచ్చటినుండి ఫ్రాన్సుదేశము చేరి ఆకాలములో ఫ్రాన్సురాజునకు రీజంటు అను అధికృతుడగు ఆర్లియన్సుడ్యూకు (Duke of Orleans) అభిమానము సంపాదించి తనతండ్రి నిరపరాధియనియు, హెబరు అతనిమీద అసత్యములగు నభియోగముల మోపి, యాతని చెరలో నుంచెననియు, అనర్హమగు నాదండనను తన తండ్రి యనుభవించుచు చనిపోయెననియు మొఱ్ఱపెట్టుకొనగ ఆర్లియన్సుప్రభువు నిజమును కనుగొని తుదకు హెబరునే దండించి అతనిని ఉద్యోగరహితుని జేసి ఫ్రాన్సుకు పిలిపించెనట.

రంగపిళ్లె తండ్రి తిరువేంగడపిళ్లె దినములలో యొక ఫ్రెంచిజండ్రాలు

"కొన్ని కుచోద్యంబులు చేసి నానాట హెచ్చుగ
"మచ్చరించిన నాజాడదెలిసి యెవ్విధంబుననైన
"నతని మట్టుపెట్టెద నని యెంతయుం బంతగించి
"సీమకు సూత్రంబు బన్ని లఘోత్తరంబులు
"కర్పుచేసి విస్తారంబుగా విస్తరంబులు
"వ్రాయించి ఫ్రాన్సురాజున కాజం
"డ్రాలు దుర్వ్యాపారంబు లెఱిగించి
"తక్షణంబునం బనులందొరను రప్పించి యాతని
"చేత ఆజండ్రాలును బట్టి కట్టించి కొట్టించి
"గెడ్డంగిన వేయించి తన మనంబునం గల చలం
"బంతయు దీర్చికొని పద్దు చెల్లించు కొన్నా"డని

కస్తూరిరంగకవి తనఛందోగ్రంథముయొక్క యుపోద్ఘాతమున వ్రాసియున్నాడు.

ఇట్టి యుదాహరణములవలన గ్రహింపవలసిన దేమన: ఆ ప్రాచీనకాలములోననే ప్రజలు ఎంతయో ధైర్యసాహసములుగలిగి ఫ్రెంచికంపెనీప్రభువులదుష్కార్యముల వెల్లడిచేయుటకై మూలస్థానములతో ప్రత్యక్షముగ కరెస్పాండెన్సు పెట్టుకొని సామాన్యముగ నసాధ్యములగు కార్యముల సాధించిరి. రైలు, స్టీమరు లేనికాలములో ఫ్రాన్సుకు పోయి అచట మూలప్రభువులను అనుసరించి కార్యసాధనము జేసికొనిరి. ఈకాలమున కిట్టి యుదాహరణము లెంతవరకు నుపయోగించునో ప్రాజ్ఞులాలోచింతురు.

ఆంధ్రప్రముఖు లెవరైన నిట్టిడైరీలు వ్రాసియుంచిరా? రంగపిళ్లగారికి కలిగిన వసతులు, అవసరములు కలిగినగదా యను ప్రత్యుత్తర మబ్బును గాబోలు. బూచి (M. Bussy) గారు తెలుగుజిల్లాలలో దండయాత్ర చేసియుండిరి. బొబ్బిలికథలో దుబాసి లక్ష్మణు డొకడు బూచీకిని, తదితరులకును భాషాపరివర్తకుడుగ నుండినటుల చెప్పబడియున్నది. ఇత డేమయిన వ్రాసియుంచెనా? విజయనగరసంస్థానమునకు బొబ్బిలియుద్ధమునకు అవినాభావము చెప్పబడుచున్నదిగదా? ఆకాలపు విజయనగరసంస్థానీకులుయథావృత్తమును వ్రాసియుంచిరా?

మనకాలమున కీర్తిశేషులగు రావుబహదర్ కందుకూరు వీరేశలింగముపంతులుగారు తెలుగున స్వీయచరిత్రము వ్రాసిరి. అందు కొంతభాగము విజ్ఞానచంద్రికా మండలిలో ప్రకటింపబడి యుండెను. అయితే యయ్యది జనసామాన్యమునకు బాహ్యముగ రుచింపక పూర్తిగ ప్రకటింపబడి యుండలేదు. ఏనుగు వీరాస్వామయ్యగారి కాశీయాత్రామజిలీలు అను నొక తెలుగుపుస్తకమున్నది గాని దీనిని ఆత్మచరిత్రగ గాని, బూర్తియగు దినచర్యగ గాని గ్రహింప వలనుపడదు. వెన్నెలగంటి సుబ్బరావుపంతులుగారు (౧౭౮౪-౧౮౩౯) అను నొకమహనీయులు తమచరిత్రము నంతయు వ్రాసియుంచిరి. అయితే అది ఇంగ్లీషున వ్రాయబడియున్నది. ఈసుబ్బరావుపంతులుగారు నెల్లూరుతాలూకా నిడిముశిలి ప్రాంతములలో బాల్యము గడిపి యెటులనో కొలదిగ ఇంగ్లీషు నేర్చికొని యీస్టుయిండియాకంపెనీలో నౌకరి సంపాదించి క్రమక్రమముగ వృద్ధికివచ్చి ఆకాలపు మహోన్నత న్యాయస్థానము లయిన సదర్ కోర్టులోను, సుప్రీంకోర్టులోను ప్రధమద్విభాషి (Chief Interpreter) పదము నలంకరించి మహాకీర్తి జెందిరి. వీరిచరిత్రము అచ్చుపడియుండినది. ఆకాలపు సాంఘిక విషయములును, విద్యావిషయములును, వ్యవహారస్థితులును సందర్భానుసారముగ ముచ్చటింపబడియున్నవి. ఆకాలపు ఇంగ్లీషు ఉద్యోగస్థులు ఇండియనులతో బహు కలసిమెలసి యుండినటుల వీరి జీవితచరిత్రవలన తెలియుచున్నది.

---



'పాపనాశన' జలపాతము

ఛాయాచిత్రకారుడు: "సూర్య"

# కుమారస్వామి విగ్రహము

భావరాజు వేంకటకృష్ణరావుగారు, బి.ఏ. బి. యల్.

(రాజమహేంద్రవరమున నూతనముగా దొరకినది)

తూర్పుచాళుక్యరాజవంశమునకు రాజధానిగా ప్రసిద్ధిగాంచిన రాజమహేంద్రవరమున గడచిననెలలో 'జడ్జి బంగాళా' ఆవరణయందు కుళాయిలకు తెలుపు త్రవ్వుచుండగా నొక చక్కని కుమారస్వామి విగ్రహమును, దానికి కొంచెము సమీపముగా నొక శిలాశాసనమును లభించినవి. ఈ రెండును అచట పాతిపెట్టబడియున్నట్టు త్రవ్వువారలకు తోచెను.



కుమారస్వామి విగ్రహము

ఈ రెండు ప్రాచీనవస్తువులు చరిత్రకు మిక్కిలి యుపయోగకరము లయినవి. వేంగీచాళుక్యులును, బాదామి చాళుక్యులును గూడ తాము కుమారస్వామియొక్క పాదభక్తులమని చెప్పుకొనిరి. తామ్రశాసనములలో బిరుదు వచనములం దితరములతోపాటు "స్వామిమహాసేనపాదానుధ్యాతానాం" అన్న చరణము కాన్పించును. చాళుక్యరాజ్యము తూర్పున కళింగదేశములోనికి వ్యాపించినపుడు అక్కడ సముద్రతీరమున నొక పట్టణము నిర్మించి దానికి తమ యిష్టదైవమయిన కార్తికేయుని పేరిట నామమిడిరి. అదియే నేటివిశాఖపట్టణము. చాళుక్య రాజవంశమునకు మహాసేను డను నామాంతరము గలిగిన యీ కుమారస్వామి ఇలువేల్పు. తమకు ఇష్టదైవమగు కార్తికేయునకు చాళుక్యులు రాజధానియగు రాజమహేంద్రవరమునందు నొక ప్రాసాదమును నిర్మించియుందురు. రాజమహేంద్రనగరస్థాత మొదటి అమ్మరాజని చరిత్రజ్ఞులు నిర్ధారణచేసిరి. ఆమహారాజాధిరాజునకు రాజమహేంద్రు డని రెండవపే రుండెను. అతడు క్రీ. శ. ౯౧౮ మొదలుకొని ౯౨౫ సంవత్సరాంతమువఱకు నించుమించుగా నేడేండ్లు ఆంధ్రమహీమండలమును పరిపాలించెను. కావున మనకు లభించిన యీ సుందరవిగ్రహము సుమారు వేయేండ్లనాటిదై యుండవలయును. చాళుక్యరాజవంశము కుమారస్వామిని, ఆదేవుని పెంపుడుతల్లు లయిన సప్తమాతృకలను గూడ ఆరాధించుచుండిరి. ప్రాయశః సప్తమాతృకలకు గూడ నీ మహానగరమునందు పూర్వము ప్రాసాదమందిరము లుండెనేమో తెలియదు. ఈ దేవతల కంచరకును శ్రీ మార్కండేయ మహాదేవర గుడియందు

చిల్లరగను లుండిన నుండియుండవచ్చును. మార్కండేయేశ్వరాలయము పూర్వము ఇపుడున్నచోట లేనట్లు స్థలజ్ఞులు తెల్పుదురు. ఇపుడున్న దేవాలయము క్రీ. శ. ౧౭౦౦ సంవత్సరప్రాంతమున, వపు డీప్రాంతమునకు మజుందారుగా నుండిన సుందు శోభనాద్రిగారను ఒక జమీందారుచేత కట్టబడినట్లు వారివంశీయులు చెప్పుచున్నారు.

ఇపుడు దొరకిన శిలాశాసనమువలన కొన్ని నూతన చరిత్రాంశములు తెలియుచున్నవి. ఈ మార్కండేయ శివుని దేవాలయము మిక్కిలి ప్రాచీనమయినది కాదనియు, రెడ్లకాలమున క్రీ. శ. ౧౪౧౦ సంవత్సరప్రాంతమున కాటయవేముని పట్టమహిషి మల్లమదేవిచే ప్రతిష్ఠింపబడెననియు నింతవఱకు చరిత్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. ఇపుడు లభించిన శిలాశాసనమునుబట్టి మార్కండేయ మహాదేవరగుడి చాలా ప్రాచీనమయినదనియు, రాజమహేంద్రనగర స్థాపనమునకు బూర్వమునుండియు నిచ్చట నుండెననియు, శివుడు మార్కండేయసజ్జలింగమను పేరిట చిరకాలమునుండి గోదావరి తూర్పుగట్టున నర్చింపబడుచుండెననియు విదితమగుచున్నది. చాళుక్యుల కాలమునా డుండిన మార్కండేయమహాదేవర గుడి పదునాలుగవ శతాబ్దమున రూపరేఖాదులు లేకుండ తురుష్క సేనానులచే ధ్వంసము గావింపబడినట్లూహింపవచ్చును. చాళుక్యులనాటి దేవాలయము ఇపుడు దాదా సాహేబు వీథిలో నున్న శిథిలమయిన మసీదున్నచోట నుండి నట్లు ఊహించుట కవకాశ మున్నది. నేటికిని అక్కడ కొన్ని శిథిలములయిన వస్తువులు పూర్వప్రస్థితిని తలపునకు దెచ్చుచున్నవి. అక్కడ భయంకరమును, మిగుల లోతైనదియు నగు పెద్ద బావి యొకటి గలదు. ఆప్రదేశమంతయు నొకప్పుడు దేవప్రాసాదములతో నిండియుండినట్లు కన్పట్టును. అక్కడకును, నీ శిలా విగ్రహ శాసనములు లభించిన తావునకును నూరుగజముల దూర ముండును.

క్రీ. శ. ౧౩౨౪ సంవత్సరమున రాజమహేంద్ర దుర్గము తురకసైన్యములచే స్వాధీనము చేసుకొనబడెను. యువరాజుగానున్న ఉలూఘ్‌ఖానుడు తరువాత సుల్తాను మహమ్మదు బిన్ టుఘ్లాకు అనుపేరుతో ఢిల్లీసింహాసన మధిష్ఠించెను. ఆతడు ఓరుగంటి కాకతీయ మహాంధ్రసామ్రాజ్యమును విధ్వస్తము గావించి ప్రతాపరుద్రుని చెఱగొనెను. పిమ్మట త్రిలింగదేశమునంతయు స్వాధీనము చేసికొని, తన సేనాని సాలారు ఉల్వీ యనువానిని ప్రసిద్ధమైన రాజమహేంద్రదుర్గమును సాధింప బనిచెను. అత డీదుర్గమును జయించి, చంద్రధ్వజమును బాదుకొల్పెను. ఆతడు నగరమును సాధించిన తరువాత అత్యంత రమణీయకములయి విరాజిల్లిన హిందూదేవాలయముల నన్నింటిని రూపుమాపెను. నాడు విష్ణ్వాలయముగా నుండిన చక్కని ప్రాసాదమును వశపఱచుకొని, దానిని సాలారు ఉల్వీసేనాని మసీదుగా మార్చివేసెను. అది యిప్పటికిని ఉన్నది. దానినే జుమ్మామసీదని వ్యవహరించుచున్నారు. ఈమసీదునకు మొగసాల హిందూదేవాలయ చిహ్నములతో నొప్పారుచున్నది. జయవిజయుల విగ్రహములు, మకరతోరణాదికములు, లతాపుష్పాదులతో చెలువొందు సింహద్వారము ప్రాచీనహిందూదేవాలయ దుస్థితిని తలపునకు దెచ్చుచున్నది. తురుష్కులచే జయవిజయుల విగ్రహములు ఛేదింపబడినట్లు గాన్పించుచున్నది. రాజమహేంద్రదుర్గమును సాధించినవిషయము, దేవప్రాసాదము మసీదు గావింపబడుటయు నచ్చట సింహద్వారమునకు మీద నున్న పారసీకశాసనమునుబట్టి విదితము లగును. ఆశాసనమునందు తెలుపబడిన తేది క్రీ.శ. ౧౩౨౪-వ సంవత్సరము సెప్టెంబరు ౧౦-వ తేదికి సరియగుచున్నది. దేవాలయము తురుష్కుల వశమయిన వెంటనే భక్తిపరులగు పూజారులు దేవతావిగ్రహములను పెకలించి మరియొకతావునకు గొంపోయి రక్షించుకొనిరి. వేణుగోపాలమూర్తికిని, వేదాద్రి నరసింహునకును గూడ నిపు డొక్కటే దేవాలయ మున్నది. తురకలు మార్కండేయేశ్వరునిగుడినిగూడ రూపరేఖాదులు లేకుండ నిర్మూలించినట్లు ఊహింపవచ్చును. నాటి శివలింగ మేమయినదో తెలియదు. కుమారస్వామి మొదలయిన దేవతావిగ్రహములు భక్తులచే పెల్లగింపబడి భద్రపఱుపబడెను. అట్లా నాడు భద్రపఱుపబడెనను

టకు తార్కాణముగ, నిపుడు లభించిన షణ్ముఖుని విగ్రహము పదిలముగా మట్టియందు బోరగిల పెట్టబడి యుండెను. విగ్రహ మెక్కడను చెక్కుచెదరలేదు. నేటివఱకు పూజాపురస్కారము లందుచున్నట్లు నిగనిగ లాడుచున్నది. పండ్రెండు బాహువులతోడను, చేతు లందు వివిధములయిన ఆయుధములతోడను, ఆరుమొగ ములతోడను, నెమిలివాహనముతోడను ఈ కుమార స్వామి విగ్రహము సుందరముగా ప్రకాశించుచు అచ్చె రువు కలిగించుచున్నది. కార్తికేయుని విగ్రహ మింత సుందరమైనది ఎచ్చటను నేను చూచియుండలేదు. తిరువత్తియూరునందలి స్కందవిగ్రహమును, మధుర యందలి షడాననుని విగ్రహమును, చిదంబరమందున్న స్కందుని విగ్రహమునుకూడ ఇంత సుందరముగా లేవు. ఈవిగ్రహము 'కాశ్యపము' ననుసరించి చేయబడినదిగా కనుపించుచున్నది. దీనికి పండ్రెండుచేతులందును 'శక్తి', 'బాణము', 'ఖడ్గము', 'చక్రము', 'పాశము', 'నెమిలి పింఛము', 'డాలు', 'ధనుస్సు', 'నాగలి', 'మాల' మొదలగునవి గలవు. ముఖము చిరునగవుతో వెలయు చున్నది.

ఇచ్చట దొరికిన శిలాశాసనముగల శిల ఇట్లున్నది. ఒక అడుగు వెడల్పును, అడుగున్నర పొడవును గలది. శాసనమూలభాగములు కొట్టుకొనిపోయినవి. చివర పంక్తులు రెండు అరిగిపోయినవి. మిగిలినభాగమంతయు స్పష్టముగా నున్నది. నేను చదివినపాఠము:

## మూ ల ము

౧. [శాకా*]బ్దే యుగనన్దరంధ్రగణితే చైత్రంగతే భాస్కరో
౨. శ్రీమార్కణ్డమహేశ్వరాయ వసతే గోదావరీప్రాక్తటే
౩. ప్రాదా ద్దీప మఖణ్డవర్త్తి మనిశం విప్రప్రదీప స్స్వయం
౪. భీమో శ్రీమదమాత్యకృత్యనిపుణో మాతాపితృశ్రేయసే[॥*]
౫. స్వస్తి[।*]సర్వ్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనమహారాజుల ప్రవర్ధమాన వి
౬. జయరాజ్యసంవత్సర౧౧ శాహి విషుసంక్రాంతినిమిత్యంబున మార్కణ్డేశ్వ
౭. రమహాదేవరకు భీమన పెగ్గల్లు వెట్టి యఖణ్డవర్త్తి దివియ౧
౮. ట్టె గొఱియఖ౦ వీనిం జేకొని చామయ...బోయుణ్డు నిత్య-
౯....ని...మానిక మానెణ్డు నేయి నిత్యపడి ఆచన్ద్రార్క
౧౦. [మునడపగల]వాణ్డు॥

ఇందు పేర్కొనబడిన విష్ణువర్ధనమహారాజు రాజరాజనరేంద్రుని సవతితమ్ముడైన విజయాదిత్యుడు. ఈతని రాజ్యారంభకాలము క్రీ. శ. ౧౦౬౧. ఇతని విజయరాజ్యవర్షములు ౧౧ అయిన శా. శ. ౯౯౯ న, సూర్యుడు చిత్తానక్షత్రమును ప్రవేశించిన తరువాత విషుసంక్రాంతినాడు, అనగా వైశాఖమాసమున (క్రీ. శ. ౧౦౭౭ ఏప్రియలు-మేయి అగుచున్నది). విజయా దిత్యుని అమాత్యుడగు భీమనప్రగ్గడ తన తలిదండ్రుల పుణ్యముకొఱకు గోదావరికి తూర్పుగట్టున వెలసియున్న మార్కండేయమహేశ్వరునకు ఆచంద్రార్కము అఖండ వత్తిదివియ ఒకటి నడపుటకై ౫౦ గొఱియలను దానము చేసియుండెను.

# జాతక శాస్త్రము

శ్రీనివాస శిరోమణిగారు; పా. సుబ్బారాయశాస్త్రిగారు

౧

ఈశాస్త్రానికి ఉన్న ప్రచారము కానీ, ఈశాస్త్రముమీద ఉన్న నిరసనభావము కానీ ఏశాస్త్రముమీద ఉన్నట్లు కనుపించదు. పైకి నిరసించినా జీవితములో ఎప్పుడో ఒకప్పుడు ప్రతివాడూ—చదువుకొన్నవాడూ, చదువుకోనివాడుకూడా—యీ శాస్త్రజిజ్ఞాస చేయకుండా ఉన్నవాడు లేడేమోననికూడా తోస్తున్నది. ప్రతిదేశములోనూ—భూభాగమంతటా ఎక్కడయినా సరే—చాలా కాలమునుంచి ఇదేవిధముగాఉన్నట్టు కనబడుతున్నది. మరీ, ఈనాడు ఈశాస్త్రము మీద పిచ్చినమ్మకముతో ఉన్నవారు కొంతమందీ, అత్యంతం అసహ్యముతో చూసేవారు కొంతమందీ కేవలము రెండురకములుగా లోకము ఉన్నట్టు కనిపిస్తున్నది. ఇంతఆదరముకు కాని ఇంత నిరసనకు కాని హేతు వేమిటి? ఇది శాస్త్రలోపమా, శాస్త్రజ్ఞులలోపమా, లేక, ఈశాస్త్రజిజ్ఞాస చేసేవాళ్లలోపమా అనే ప్రశ్నలు ఏ బుద్ధిమంతుడికయినా కలుగుతవి.

ఈశాస్త్రానికి ఉపపత్తి, దీనివైశాల్యము తెలిస్తే యీలోపము శాస్త్రములో ఉందో, శాస్త్రజ్ఞులదో, శాస్త్రజిజ్ఞాస చేసేబుద్ధిమంతులదో తెలిసిపోతుంది. అంతేకాదు: ఈశాస్త్రము ప్రతివారికీ నిత్యజీవనములో ఎంతవరకు ప్రయోజనకారో తెలియడమున్నూ ఈశాస్త్రముమీదఉన్న నిరసనభావము కానీ, మూఢవిశ్వాసము కానీ తొలగిపోయి సరిఅయిన అభిప్రాయము ఏర్పడడమున్నూ సంభవిస్తవి.

అందుకోసరము ముందుగా యీ శాస్త్రాన్ని రెండుభాగములుగా విభాగించవలసిన ఆవశ్యకము కలుగుతున్నది. ఒకటి ఆర్షము, రెండోది పౌరుషము. ఈవిభాగము శాస్త్రస్వభావస్వరూపాలను బట్టి చేసినది కాని చరిత్రాత్మకముగా మాత్రము కాదు. ఆర్షభాగశాస్త్రోపపత్తిని గురించి జిజ్ఞాసచేసి అది ఎంతవిశాలమయినదీ ముందుగా మనవిచేసుకొంటాము. ఆతర్వాత పౌరుషశాస్త్ర విచారము చేస్తాము. ఈశాస్త్రము ఏతారీఖున పుట్టినదనే విషయముతో మాకు నిమిత్తము లేదు. ఇది ఎట్లా ఉత్పన్నమయినదీ, ఎందుకు ఉత్పన్నమయినదీ అనేవిషయాలే మాకు విచారణీయాంశములు.

ఈదేశములో ఉద్భవములయిన సమస్త శాస్త్రములూ పుష్కలముగా అన్నము తిని కూర్చున్ననాడు, భౌతికవాంఛలతో నిమిత్తము లేకుండా పోయిననాడు పుట్టినవి. ఆకలి దహించుకొనిపోతున్న నాడు పుట్టినవి పాశ్చాత్యశాస్త్రములు. ఇదే ప్రాచ్యపాశ్చాత్యశాస్త్రముల కున్న ప్రధానభేదము. అన్నము తిని కూర్చున్న వాడికి ఈసకలచరాచరజగత్తుకంతా ఒకమూలకారణమున్నట్టు తోచినది. ఆమూలకారణమే బ్రహ్మము అన్నాడు. ఇక దానిస్వరూపస్వభావాదుల జిజ్ఞాసలో పడిపోయినాడు. బ్రహ్మజిజ్ఞాసువు అయినకుర్రవాడు తండ్రిదగ్గరకు పోయి బ్రహ్మమంటే ఏమిటని ప్రశ్నించినాడు. పెద్దవాడు "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిసం విశంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి"—దేనివల్ల సమస్తభూతములూ పుడుతున్నవో, దేనివల్ల జీవిస్తున్నవో, దేనిని ప్రవేశిస్తున్నవో అది బ్రహ్మఅని తెలుసుకో—అన్నాడు. ఇక కుర్రవాడు బ్రహ్మజిజ్ఞాస ప్రారంభించినాడు. మొట్టమొదట అన్నము బ్రహ్మ అనుకొన్నాడు. తర్వాత అది కాదు, ప్రాణము బ్రహ్మ అనుకొన్నాడు. అటుపిమ్మట మనస్సు బ్రహ్మ అనుకొన్నాడు. అది కాదని తెలుసుకొని విజ్ఞానము బ్రహ్మ అనుకొన్నాడు. అదీ కాదని

గ్రహించి చిట్టచివరకు "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందా ద్ధ్యేవ ఖ ల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయం త్యభిసంవిశంతీతి" (ఈభూతాలన్నీ ఆనందమువల్ల పుడుతున్నవి. ఆనందమువల్ల జీవిస్తున్నవి. ఆనందాన్ని ప్రవేశిస్తున్నవి. అందువల్ల బ్రహ్మము ఆనందము) అని నిర్ధారణ చేసుకొన్నాడు. ఇక నా బ్రహ్మన్ని, ఆనందాన్ని పొందడమునకు మార్గాలను వెతకసాగినాడు. ఒక్కొక్కరు ఒక్కొకమార్గాన్ని అన్వేషించినారు. ఈమార్గాన్వేషణములే శాస్త్రములుగా తయారైనవి. ఇక ప్రతిశాస్త్రమునకు లక్ష్యము ఆనందము. ఆనందమువల్ల లోకసంగ్రహము.

లోకకల్యాణము కోసరము యితరశాస్త్రములు పుట్టినట్టుగానే యీజాతక శాస్త్రమున్నూ పుట్టినది. ఇట్లా చెప్పగానే యీశాస్త్రమువల్ల లోకసంగ్రహము ఎట్లా అవుతుందనే ప్రశ్న కలుగుతుంది. అందుకు సమాధానము చెపుతున్నాము. వేదాంతశాస్త్రానికి బ్రహ్మసూత్రములు ఎట్లాంటివో ఆర్ష జాతకశాస్త్రానికి జైమినికృతజాతకసూత్రములు అట్లాంటివి. ఈశాస్త్రానికి మొట్టమొదటి నియమబద్ధము (systematic) అయినగ్రంథము అదే నని సాంప్రదాయికుల అభిప్రాయము. "ఉపదేశం వ్యాఖ్యాస్యామః" అని సూత్రములు ఆరంభించినాడు. ఈ సూత్రాలకు నీలకంఠాచార్యులవారు వ్యాఖ్యానము చేస్తూ ఈమొదటి సూత్రానికి "అథ ప్రాక్తనకర్మజ్ఞానానుష్ఠేయకాశీవాసాదినా జగదుద్ధారం చికీర్షుః కరుణాసింధు ర్జైమినిమునిః..............సకలలోక శుభాశుభ సూచక జాతకశాస్త్ర మనుష్ఠాతుం ప్రతిజానీతే" (పూర్వజన్మకృత కర్మను తెలుసుకొని అనుష్ఠించదగిన కాశీవాసాదులద్వారా జగదుద్ధారము చేయదలచుకొన్నవాడయి కరుణాసముద్రుడయిన జైమినిముని సకలలోకశుభాశుభాలను సూచించే జాతకశాస్త్రము చెప్పడానికి ప్రతిజ్ఞ చేస్తున్నాడు) అని అన్నారు. జైమిని ముని అభిప్రాయము ఏమంటే, జాతకశాస్త్రమువల్ల సూచితమయ్యేవి సకలలోకశుభాశుభాలు. ఈసకలలోకశుభాశుభాలున్నూ పూర్వజన్మకృతకర్మవల్ల కలుగుతున్నవి. అయితే ఆపూర్వజన్మకృతకర్మజ్ఞానమువల్ల ప్రయోజనము ఏమిటయ్యా అంటే, తత్కర్మజ్ఞానమువల్ల అనుష్ఠించతగినకాశీవాసాదులు. ఇందువల్ల కలిగే ప్రయోజనము జీవితము శుభావహముగా జాతకశాస్త్రజ్ఞానమువల్ల సూచితమయితే ఆశుభానికి చ్యుతి కలగకుండాను, ఇంకా ఉత్తమలోకప్రాప్తికి అనుకూలమయిన కర్మాను ష్ఠానము చేయడముకోసరమున్నూ, అశుభముగా సూచితమయితే అవసరమయిన కర్మానుష్ఠానమువల్ల శుభములు పొందడముకోసరమున్నూ ఈశాస్త్రము ఉత్పన్నమయినదన్నాడు. ఇందుకు ప్రయోజనము జగదుద్ధారము అంటే లోకసంగ్రహము అవుతుందని వారి అభిప్రాయము.

ఈశాస్త్ర పౌరుష గ్రంథములలో ఆద్యగ్రంథము వరాహమిహిరుడు చెప్పినబృహజ్జాతకము. మిహిరుడు కూడా శాస్త్రారంభము చేస్తూ "కర్మార్జితం పూర్వభవే సదాది యత్తస్య పక్తిం సమభివ్యనక్తి" అన్నాడు. పూర్వజన్మలో ఏ శు భా శు భ మి శ్ర రూ ప మ యి న క ర్మ అ యి తే సంపాదింపబడ్డదో ఆశుభాశుభమిశ్రరూపమయిన కర్మవిపాకాన్ని చెప్పేది యీశాస్త్రము. అయితే అది తెలుసుకొన్నందువల్ల కలిగే ప్రయోజనము మాత్రము చెప్పలేదు. శాస్త్రోద్దేశము చెప్పినాము. ఇక శాస్త్రము ఎట్లా సిద్ధమయినదీ అనే విషయము విచారిస్తాము.

వేదాంగములలో జ్యోతిషము ఒక అంగము. అందులో ఆ వేదాంగ జ్యోతిషములో ఏమి ఉందో ముందుగా ఆలోచిస్తాము. సూర్యచంద్రగతులు, తద్ద్వారా సంభవమయ్యే తిథ్యాదులు, రెండు అయనములు, రెండు విషువత్తులు, ఇరవై ఏడు నక్షత్రములు, వీటిగణితము మాత్రము వేదాంగజ్యోతిషము చెపుతున్నది. ఈగణితము చాలా సులభమయినది. ఛందోబద్ధముగా ఉంది. ప్రతిబ్రాహ్మణుడూ యీవేదాంగాన్ని ముఖస్థము చేసుకోవలెను. అయితే యీవేదాంగానికి వినియోగము ఎక్కడా అనే జిజ్ఞాస కలుగుతున్నది. అందుకు సమాధానము చెపుతున్నాము.

ఆనాడు, భౌతికవాంఛలన్నీ తీరిపోయిననాడు, బ్రహ్మజిజ్ఞాస ప్రారంభమయినదని చెప్పినాము. ఈ బ్రహ్మజిజ్ఞాసకు సర్వకాలసర్వావస్థలూ యుక్తములు కావని తెలుసుకొని యుక్తకాలనిర్ణయము కోసరము యీవేదాంగము కలిగింది. అంటే నిత్యజీవనములో బ్రహ్మవిచారము కోసరము కార్యక్రమము నిర్ణయించుకోవడానికి యీవేదాంగము ఏర్పడ్డది. అయితే బ్రహ్మవిచారము కోసరము యుక్తాయుక్తకాలనిర్ణయావసరమేమి వచ్చింది? అన్నిరోజులూ ఒక్కమాదిరివి కావా? ఒకరోజు పనికివచ్చేరోజూ, మరొకటి పనికిరానిరోజూ ఉంటుందా? అనేసందేహాలు యీకాలపువారికి కలుగుతవి. వాళ్లు ఏయే రోజులు ఎందుకు స్వీకరించినారో, ఏయే రోజులు ఎందుకు త్యాజ్యము లన్నారో తెలుసుకొంటే ఈసందేహాలు తొలగిపోతవి.

మనుష్యుడు నిత్యమూ సకల చరాచరజగత్తుతో సాహచర్యము చేస్తున్నరోజులు అవి. తపోబలముతో తెలుసుకొన్న ప్రతివిషయమూ ప్రత్యక్షములో ఎంతవరకు అనుభవసిద్ధమో జాగ్రదవస్థలో పోల్చి చూస్తుండేవాడు. అటు కాలమువంక చూసేసరికి సూర్యచంద్రులిద్దరూ కనుపించినారు. వీళ్లిద్దరివల్ల కాలమానము ఏర్పడుతున్నది. వీళ్లు ఒక నియమితగతిలో ఒకప్రత్యేకమార్గములో సంచారము చేస్తున్నారు. ఆమార్గాన్ని ఆలోచించేసరికి ఇరవైయేడు నక్షత్రముల మార్గము కులాలచక్రములాంటిది ఒక్కటి గోచరమయినది. ఇంకా గమనించేసరికి రెండు అయనములు, రెండు విషువత్తులు (Equinoxes) తోచినవి. ఇటు ప్రకృతివంక చూసేసరికి క్షణక్షణమూ ప్రకృతిలో కలుగుతున్నమార్పులకున్నూ ఈసూర్యచంద్రుల సంచారమునకున్నూ సంబంధము కనుపించింది. సమస్తసృష్టిస్థితిలయములకును హేతుభూతమయినది వీరిసంచారముగా తోచినది. ఘాతుకమృగముల భీకరారావములకు, తరులతాగుల్మాదుల పల్లవితకుసుమిత ఫలితత్వాలకు, స్త్రీపురుషుల శారీరకమానసికవికారాలకు, చివరకు ఉన్మత్తుడి ఉన్మాద వ్యాధిక్యాలకు, ఇవి అవి ఏమిటి, సమస్తచరాచరజగత్తులో కలుగుతున్నమార్పులకు వీరిసంచారమే కారణమయినది.

ప్రతి ముప్ఫయితిథులకు అంధకారము కలగడము, సముద్రము క్షుభితము కావడము, సమస్త జీవధాతువులు ప్రకోపించడము, ఇత్యాది మార్పులు చూసినాడు. అటు ఆసూర్యచంద్రుల సంచారమార్గమువంక చూసేసరికి యిద్దరూ ఒక్కనక్షత్రములో కూడిఉన్నారు. ప్రతి పదిహేను తిథులకు వారుభయులూ పదమూడున్నరనక్షత్రముల దూరము పోవడము తిరిగి ప్రతిపదిహేనుతిథులకున్నూ ఏకనక్షత్రములో సమావేశము కావడమున్నూ చూసినారు.

సూర్యుడు తేజోమూర్తి: చంద్రుడు సౌమ్యమూర్తి. ఒకరు ఉష్ణము, రెండోవారు శైత్యము యిస్తున్నారు. ఒకరు పురుషుడు, రెండోది స్త్రీగా తోచింది. బ్రహ్మవిచారములో ఉన్నారు కాబట్టి ఒకరిని పురుషుడు, రెండోదాన్ని ప్రకృతి అన్నారు. ఇంకా కొంచెము లోతుకుపోయి ఒకటి ఆత్మ, రెండోది దేహము అన్నారు. రూపకల్పన చేసేసరికి ఒకరు రుద్రుడు, రెండోది శక్తి అయిపోయింది. వీళ్లిద్దరి సమాగమము మైథునముగా తోచింది. అట్లా కాకపోతే ఆనాడు సముద్రము ఎందుకు క్షుభితము కావలెను? వన్యమృగాలు ఎందుకు భయంకరధ్వనులు చేయవలెను? సరీసృపములకు విశేషవిషప్రకోపము ఎందుకు కలగవలెను? వృక్షములలో ఉన్న ధాతువులు ఎందుకు ప్రకోపించవలెను? ఉన్మాదుడికి పిచ్చి ఎందుకు రేగవలెను? సామాన్యమానవుడికి ఉష్ణప్రకోపము ఎందుకు కలగవలెను? వాయుసంచారము ఎందుకు ఎక్కువ కావలెను? ఇంకా ఇట్లాంటివి ఎన్నో కోట్లకొద్దీ మార్పులు జగత్తులో ఎందుకు కలగవలెను? దీనికంతా ఈజగత్తుకంతా తల్లిదండ్రులుగా ఉండి కాపాడుతున్న సూర్యచంద్రుల సంగమమే కారణ మనుకొన్నారు.

ఈనాటికి ఆనాటికి, ఏనాటికీ లయము అయ్యే ప్రతిదీ చంద్రసంచారాన్ని అనుసరించిన్ని, సృష్టిఅయ్యే ప్రతిదీ సూర్యసంచారాన్ని అనుసరించిన్ని జరుగుతున్నది. శారీరకమానసిక వికారాలకూ వీరిసంచారముకూ ఉండే సంబంధము తెలియగానే ఏనాడు ఏపనికి అనుకూలమో తెలిసింది. ఈ అనుకూల కాలనిర్ణయము కోసరము ఏర్పడ్డ సాధనమే వేదాంగ జ్యోతిషము.

సూర్య చంద్రుల సంగమదినము అమావాస్య. అప్పుడు జగత్తంతా దద్దరిల్లిపోతున్న సమయము. అదొక మహోత్కృష్టదినముగా తోచింది. అందువల్ల సమస్త భౌతికవ్యవహారాలకు ఆటవిడుపుదినము; నియమ దినము; వేదాధ్యయనానికి అనధ్యాయము. అయితే తనయీజన్మకు నిమిత్తకారణులయిన మాతాపితరులను స్మరించమన్నాడు. అందువల్ల అది పితృతర్పణాదికదినము అయినది. ఇదే విధముగా సూర్యచంద్రులగతుల ననుసరించి పంచపర్వములు, ద్వాదశీ సంక్రాంతులు మొదలయిన, నిషిద్ధానిషిద్ధతిథులు నిర్ణయించుకొన్నాడు. అవన్నీ ఎట్లా సంభవిస్తున్నవో విచారించడము ప్రారంభిస్తే గ్రంథము ఎంతదూరము పోతుందో చెప్పలేము. కాబట్టి ఆపని చేయము. దిఙ్మాత్రముగా ప్రధాన నిషిద్ధదినాన్ని గురించి మాత్రము చెప్పినాము.

మొత్తముమీద వేదాంగ జ్యోతిషమువల్ల తేలినవి రెండువిషయాలు. ఒకటి సూర్యచంద్రుల గతులకు సంబంధించిన గణితము. రెండోది అందువల్ల కర్మానుష్ఠానయోగ్యాయోగ్యకాలములు. ప్రస్తుతము స్కంధత్రయ జ్యోతిషము అని వ్యవహరించే సిద్ధాంతముహూర్త జాతక శాస్త్రములలో మొదటి రెండు కొమ్మలకు మూలము వేదాంగములో గోచరమవుతూనే ఉన్నది. అయితే జాతకమనే కొమ్మకు వేదాంగములోనే మూలము ఉన్నదీ లేనిదీ ముమ్ముందు చెపుతాము.

ఇప్పటికి తేలినవిషయములు: ఆనందము బ్రహ్మ, ఆ ఆనందము కోసరము బ్రహ్మజిజ్ఞాస, బ్రహ్మజిజ్ఞాస కోసరము తపస్సు, తపస్సుకోసరము యుక్తాయుక్తకాల నిర్ణయము, యుక్తాయుక్త నిర్ణయముకోసరము జ్యోతిషము ఉత్పన్నమయినది. ఆదిలో జ్యోతిషముయొక్క ప్రయోజన పరిమాణములు ఇంతే.



పాపనాశము జలపాతము (కొండలోయలో)

ఛాయాచిత్రకారుడు: "సూర్య."

# నక్షత్రమండలము

గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు, బి. ఏ.

(ఫాల్గున మాసము)




ఈనెల పున్నమనాడు చంద్రుఁడు ఫల్గునీనక్షత్ర మని పేరువచ్చినది. ఈమాసమునందు రాత్రి తొలిజాముల చెంత నగుపడుటచేత నీమాసమునకు ఫాల్గునమాస మున నగపడు చుక్కలను వరుసగా చూతము.

పడమట మీనము పూర్తిగా నస్తమించినది. ఇంద్రమద, చ్యవన, అశ్విని, శింశుమార, యమునాదు లస్తమింపనున్నవి. వాయవ్యదిశ రంభాదులగు నప్సరసల మండలము త్వరలో నదృశ్యము కానున్నది. ఉత్తరమున ధాత, విధాత, మిత్ర, అగ్ని, మహేంద్ర, కశ్యపులతోను, పుచ్ఛాగ్రమున ధ్రువునితోను లఘుఋక్షము మెఱయుచున్నది. లఘుఋక్షమున కీవల నరకునిలోనైదారుచుక్కలగపడుచున్నవి. నరకుని కీవల సప్తఋషిమండలము బాగుగా నగపడుచున్నది.

సప్తఋషి మండలమునకు మనవారు బృహదృక్షమని పేరిడిరి. దీనికే Plough అనియు, Charles Wain అనియు, Dipper అనియు పాశ్చాత్యులు పేర్లు పెట్టినారు. ఈఋషులలో తూర్పుకొన నున్నచుక్క మరీచిఋషి. మరీచికి దిగువ పడమట వసిష్ఠుడును, ఆచెంతనే మిణుకు మిణుకుమనుచు నతనిభార్య అరుంధతియు గలరు. ఈదంపతులకు కొంచెము మీదుగా పడమట ఆంగిరసు డున్నాడు. ఈచుక్కలు త్రిభుజాకృతి గలిగియున్నవి. వసిష్ఠునివద్ద విశేషకోణము (obtuse angle) గల త్రిభుజ మిది. వీటికి పశ్చిమముగా మంచము కోళ్ళవలె నాలుగుచుక్క లున్నవి. ఇందు ఆంగీరసునికి సమీపమున నున్నవాడు అత్రి. అత్రికి పశ్చిమముగా క్రతుఋషి, క్రతువునకు మీద పులహుడు, అత్రికి మీదుగా పులస్త్యుడు నున్నారు. వీరలే సప్తఋషులు. పులహక్రతు ఋషులమీదుగా నొకసరళరేఖ గీచిన పక్షమున నది ధ్రువునిమీదుగా పోవును. ఈఋషిమండలమునకు ప్రక్కనే విఘ్నేశ్వరుడు మూషకసహితుడై లంబోదరముతో మెఱయుచున్నాడు.

అశ్వినికి తూర్పున భరణి కృత్తికలును, వీటికి పైని భృగుమండలమును గ్రుడ్లు మిటకరించుకొనుచు పులోమరక్కసుడును నగపడుచున్నారు. కృత్తిక యనబడు పిల్లలకోడికి తూర్పున నెద్దుకన్నువలె నెఱ్ఱగ మెఱయుచు రోహిణియు, పైన మిణుకుమనుచు గర్గాచార్యులు నున్నారు. రోహిణికి పైన తూర్పుగా సారథిమండలము మెఱయుచున్నది. అం దుత్తరదిశను తెల్లని కాంతితో తేజరిల్లుచు బ్రహ్మహృదయమును, దక్షిణమున బడబాగ్నియు మెఱయు చున్నారు. ఈబ్రహ్మ హృదయమునకు మీదుగాను, అప్సరో మండలమునకు దిగువను స్వల్పకాంతితో కల్పవృక్షము కానవచ్చు చున్నది.

రోహిణికి దిగువ మృగశీర్ష చుక్క లున్నవి. ఆప్రక్కనే పగడమువలె ఆర్ద్ర మెఱయుచున్నది. ఆర్ద్ర యొక బాహువుగను, గొల్లకావడి చుక్కలు పటకాగాను, ఆర్ద్ర కెదురుగా పడమటనున్న చుక్క రెండవ బాహువుగాను, గొల్లకావడి దిగువను ప్రేలాడు మూడు చుక్కలు ఖడ్గముగాను, దిగువ మరిరెండు చుక్కలు పాదములుగాను కలిగి ఒరయన్ (Orion) యోధుడు ప్రకాశించు చున్నాడు. వాని దిగువను శశకము ఆడు చున్నది. ఇంకను దిగువను కపోత మున్నది. యమున కీవల ఉపరిచర వసువును, ఆదిగువను అద్రికయు, వలయు కానవచ్చు చున్నారు.

ఆర్ద్రకు తూర్పుగా ముత్యాలహారములాగున పునర్వసు చుక్కలు మెఱయుచున్నవి. దిగువను కొండి స్వ్యానును, పూర్వశ్వానమును వెలుగొందు చున్నారు. వీనికి దక్షిణముగా శ్వానమండలము కలదు. ఆకాశమునందు మనకు కానవచ్చు చుక్కలన్నిటిలో తేజోవంతమైన మృగవ్యాధుడు బహుధవళమగు కాంతితో ప్రకాశించు చున్నాడు. ఈశ్వానమునకు దక్షిణముగా నౌకామండలము గలదు. ఈనౌకా స్తంభపృష్ఠాదిభాగములు గమనింపవలయును. అన్నిటికి దిగువను అగస్త్యుడద్భుత ప్రకాశముతో మెఱయుచున్నాడు.

నౌకా మండలము పైని పాలసముద్ర మథనమున మందరగిరియు, దానికి కవ్వపుత్రాడయిన వాసుకియు చుక్కగా నగపడుచున్నారు. ఈమథనమువలన ముందు పుట్టిన హాలాహలాగ్ని వృత్తాంతమును, దాని నవలీలగా మ్రింగి నీలకంఠుడయిన రుద్రుని వృత్తాంతమును ముందు వ్యాసములలో చూతము. పునర్వసునకు పశ్చిమదిశను పుష్యమి పొట్లపూవువలె ధవళమయియున్నది. పుష్యమి కీవల 'ఆశ్రేషాసర్పాబుతు' అనగా సర్పాకారము గలిగి ఆరుసంఖ్యగల చుక్కలతో ఆశ్రేష మెఱయుచున్నది.

దీని ననుసరించియే అహిమండలము (Hydra) ఉన్నది. అందులో నగస్త్యశాపతప్తుడై యజగరమైన నహుషుడును కలడు. ఈయహిమండలమునకు పైని చమసమున్నది. దీనినే పాశ్చాత్యులు క్రేటరు (Crater) అనుచున్నారు. క్రేటరు అనగా cup—పానీయములు త్రాగుటకు అనుకూలమైన పాత్ర. దేవతలకును, వేదకాలమునాటి ఋషులకును అత్యంత ప్రియమైన సోమరస మున్నపాత్ర యిదియే. దీనినిగూర్చి త్వరలో మరల ప్రసంగింతము. ఈచమసమునకు తూర్పున వార్తికమను పక్షి ఇప్పుడే ఉదయించినది.

పుష్యమి ఆశ్లేషనక్షత్రములకు తూర్పుగా మఘనక్షత్రము కలదు. మఘ కొడవలివంటియాకారము గలదని పాశ్చాత్యు లందురు. పల్లకీవలె ఐదునక్షత్రములని మనవారు చెప్పుదురు. ఇందు మిక్కిలి తేజోవంతమయిన దానిని పాశ్చాత్యులు రెగ్యులస్ (Regulus) అని చెప్పుదురు. ఇయ్యది మనసూర్యునికంటె ౩౩౦ రెట్లు తేజోధికమైన మహాగోళము. మఘకు తూర్పుగా పూర్వఫల్గునియు, ఉత్తరఫల్గునియును ఉన్నవి. ఇవి కన్నులవలె రెండేసి నక్షత్రములు. నాలుగును దీర్ఘచతురస్రమువలె నుండును. ఎఱ్ఱనికాంతితో కుజగోళమును, తెల్లనికాంతితో బృహస్పతి గోళమును గ్రహములలో నిపుడీఫల్గునీనక్షత్రముల చెంతనే కనబడుచున్నవి ఫల్గునీనక్షత్రము లనుపేరు పిమ్మట వచ్చెను కాని ఋగ్వేదము ౧౦-వ మండలము, ౮౫-వ సూక్తములో నివి అర్జునీనక్షత్రములనియే చెప్పబడినవి ("అర్జున్యోః పర్యుహ్యతే") ఋగ్వేదమునాటి యీ యర్జునీ నక్షత్రములందు మహాభారతయోధుడైన అర్జునుని లక్షణములు దాపట్టుచున్నవి. ఈప్రసంగమునకు మరల వత్తము.

ఫల్గునీ నక్షత్రములకు తూర్పున హస్తానక్షత్రమున్నది. 'హస్తా పాణినాం పంచ'—ఐదువ్రేళ్లుకల అరచేయివంటి నక్షత్రములు ముఖ్యముగా ఐదున్నవని మనవారు చెప్పుదురు. ఇవి పైని వ్రాయబడిన వార్తికపక్షిమండలములోని చుక్కలని పాశ్చాత్యపండితులు కొందరు పోల్చిచెప్పిరి. అది సరి కాజాలదని నావిన్నపము.

హస్తకీవల తూర్పుగా చిత్రయు, ఈశాన్యదిశను స్వాతియు వెలుగొందుచు నుదయించినవి. 'చిత్రా మౌక్తిక మేకమ్' అనగా చిత్ర ముత్యమువలె ఒక్కటే నక్షత్రమనియు, 'స్వాతీ ప్రవాళ మేకమ్'అనగా స్వాతి పగడమువలె యెఱ్ఱని యొక్క నక్షత్రమనియు మనవారు నిర్వచించినారు.

శ్రీనాథకవిసార్వభౌముడు కాశీఖండములో-

గీ. "స్వాతిచిత్రలు తోరణస్తంభయుగము
ననుకరించుచు నొక్కచో నత్తమిల్లె" అని వర్ణించెను.

మఱియు రాసులలో,

మఘ + పూర్వ ఫల్గుని + ఉత్తర ఫల్గుని $\frac{1}{4}$ = సింహము.
ఉ. ఫ. $\frac{3}{4}$ + హస్త + చిత్ర $\frac{1}{2}$ = కన్య.

పైని వర్ణింపబడిన నక్షత్రములలో

మఘకు పితృలును,
పూర్వఫల్గునికి అర్యముడును,
ఉత్తరఫల్గునికి భగుడును,
హస్తకు సవితృడును,
చిత్రకు త్వష్టయు,
స్వాతికి వాయువును,

} అధిదేవత లని వేదము తెలుపుచున్నది.

సప్తఋషులకును స్వాతికిని నడుమ పాశ్చాత్యులచే (Canes Venatici) అని లాటిన్ భాషలోను, Greyhcunds అని ఇంగ్లీషు భాషలోను చెప్పబడు సారమేయ మండల మున్నది. కన్యారాశి ననుసరించి స్వాతిమీదనే వేణీమండల మున్నది. దీనినే పాశ్చాత్యులు Coma Berenices = The Hair of Berenice అందురు: అనగా బెర్నిస్ మహారాణియొక్క కేశములని యర్థము. దీనిని గూర్చి యొక చిత్రకథ కలదు.—

ఈబెర్నిస్ అనునామె గొప్పవంశమున జన్మించినది. ఈజిప్టుదేశపురాజగు ఎవర్గెటీస్ అను నామాంతరముగల టాలెమీ సోటర్ (Ptolemy Soter) అనునతనిని వివాహమాడినది. ఆదంపతు లొండొరులపై అత్యంత ప్రేమ కలిగియుండిరి. ఒకసారి రాజు తనశత్రువులను అస్సీరియనుల(Assyrians) పై యుద్ధమునకు బోయెను. ప్రబల శత్రులతో భర్తకు యుద్ధము తటస్థించెనని భయ

పడి రాణి తన యిష్టదైవమగు వీనస్ (Venus) దేవుని యాలయమునకు బోయి తనభర్త విజయము బడసి క్షేమముగా మరలి వచ్చిన యెడల తనశిరోజము లాదేవునికి సమర్పించుకొందునని మ్రొక్కుకొనెను. మనదేవతలలో మన్మథు డెట్టివాడో ఈజిప్టు దేశస్థులకు వీనస్‌దేవు డట్టివాడు. అనగా స్త్రీపురుషులప్రేమ కభిమానదేవత. ఆదేవు డామె కనుకూలు డాయెను. భర్త శత్రువుల నోడించి జయభేరితో స్వపురి కరుదెంచుచుండెను. ఆ శుభవార్త విని సంతోషముతో నామె వీనస్ దేవాలయమునకు వెళ్లి శిరోజములు తీయించుకొని మ్రొక్కు చెల్లించెను. విజయగర్వముతో ప్రియురాలిం జూడవచ్చు సరికి—ఏమున్నది? బోడితలతో నామె యెదుట బడెను. రాజు నివ్వెరపడి కారణ మడిగెను. ఆవృత్తాంత మామె నోటను విని, యామె పాతివ్రత్యమును మెచ్చుకొనినను, విరూప యగుటకు మిక్కిలి చిన్నబోయెను. మరునాడు దేవాలయమున రాణిగా రుంచినచోట నామె కేశజాల మగపడక యదృశ్యమయ్యెను. ఏమైపోయినదని రాజు విచారణ చేయగా నచటి పురోహితులు “మహాప్రభో! ఈమహాపతివ్రత భగవంతునికి సమర్పించిన శిరోజములు భగవత్కటాక్షముచేత నక్షత్రమండలము చేరుకొన్నవి. చూడు”డని, స్వాతికి చిత్రకు నడుమ నస్పష్టతేజముతో నున్న యీమండలమును చూపిరట! రాజు తృప్తుడయ్యెనట! అప్పటినుండి యీమండలము బెర్నిస్ రాణి యొక్క వేణీమండలమని పాశ్చాత్యులచే వ్యవహరింపబడుచున్నది. క్రీ. పూర్వము ౨౦౦ సంవత్సరములకు ముందు ఇరటాస్థినీస్ (Eratosthenes) అను ఈజిప్టు దేశసిద్ధాంతి యీసంపున కీనామకరణము చేసె నందురు.*

ఈమండలమునకు మనద్రౌపది ప్రతిజ్ఞ, వేణీసంహారములతో సంబంధ మున్నదని నామనవి. మనరాసులలో కన్యారాశియే భారతప్రసిద్ధమైన ద్రౌపది కన్యయని నిరూపించుచు నీయంశమును గూర్చి విపులముగా వ్రాయుచున్నాను.



తిరువణ్ణామలై పుష్కరిణి

M. K. R.

* There Berenice's locks first rose so bright.
The Heavens bespangling with dishevelled light."

# మ హా మ ఘ ము

నిసర్గరమణీయము లగు మహోన్నత పర్వతపంక్తులతోడను, నిర్మలజలపూరపూరితములగు నదీనదములతోడను విరాజిల్లుచున్న భారతదేశము దేవభూమి యనబరగినది. నిరంతరదైవభక్తిపరిప్లుతమగు భారతీయుని హృదయకేదారము పండినపంటగా ఆసేతుశీతనగము నందు ననంతసహస్రములగు పుణ్యక్షేత్రములు, పవిత్రతీర్థములు నెలకొని నిత్యసమారాధ్యము లయ్యెను. సుందరశిల్పసమంచితములగు నాలయములు నిర్మితములయ్యెను. వివిధ



మహామఘ తీర్థము M. K. R.

నామరూపభేదములతో నా యాలయములయందు దేవతావిగ్రహములు ప్రతిష్ఠాపితములయి పూజితములగుచున్నవి. తటాకాదుల ప్రతిష్ఠలు జరిగినవి. ఆయాక్షేత్రమహిమలు అనంతవిధముల పురాణాదులయందు వర్ణితములయినవి. తతోధికముగ ప్రత్యేకము తత్తత్క్షేత్రములకు మాహాత్మ్యములు వెలసినవి. ఏ క్షేత్రమున కా క్షేత్రమే యనుత్తమఫలదమని యవి యుద్ఘోషించుచున్నవి. అపరోక్షము, ఊహామాత్రము నగు ఫలముమాట యటుండుగాక, దైవచింతనాపరుడగు భారతీయుడు వానినన్నింటి నొక్కరూపున భావించి ముక్తుడు కాగోరుచుండును.

అట్టిక్షేత్రములకు పెక్కింటికి దక్షిణదేశము జన్మభూమి. అచ్చటి గ్రామములు, నగరములు నన్నియు నించుమించు సుప్రసిద్ధక్షేత్రములు. ఎల్లక్షేత్రములందును దివ్యశిల్పకళామండితములగు దేవాలయము లొప్పారియుండును. అవి విశాలప్రాంగణములు, బహుస్తంభవిరాజితమంటపములు, ఉన్నతగోపురములు గలిగి నాస్తికునినైన ఆస్తికుని జేయజాలినవి. సంవత్సరము పొడవునను నిరంతరముగ నాయాక్షేత్రముల నెలకొనిన దైవములకు మహోత్సవము లపరిమిత వైభవముతో జరుగుచుండును. చుట్టుపట్టులవారలే కాక దూరదేశములవారును అట్టిమహోత్సవముల కేతెంచి యాదైవముల సేవించుచుందురు. వారికి

ధనాభావము, దూరగమనము, మార్గశ్రమము లెక్కలోనివి కావు.



మహామఘ తీర్థము, ఒండలి, పాచి, మొదలగు వానిని తీసివేసి శుభ్రపరుపబడినది. ఇందు గంగాదినదులు ప్రవేశించియున్నవన్న కూపములలో కొన్ని కానవచ్చుచున్నవి. G. S. A.

ఇట్టి దివ్యక్షేత్రములలో కుంభఘోణ మొక్కటి. ఆ పురము చరిత్ర ప్రసిద్ధమయినది. ప్రాచీనకాలమున నది చోళ రాజులకు రాజధాని. అది సకల కళలకును నిలయమయి మహోచ్ఛ్రస్థితి నుండినది. శిల్పమునను, సంగీతమునను, సాహిత్యమునను, వేదాంతమునను ప్రవీణులయి, ఆయాశాస్త్రములకు వికాసమును గలిగించిన పండితుల కానగర మాటపట్టు. పశ్చిమ పర్వతమూలయం దుత్పత్తిని గని, సుదూర వాహినియు, నిత్యనిర్మలజలప్రవాహభరితయు నయి దక్షిణదేశము నత్యధికభాగమును నపారసస్యసంపన్నముగను, పెక్కు దివ్యక్షేత్రములను ఆత్మసాన్నిధ్యముచే నతిమాత్రమహిమాన్వితములుగను గావించుచున్న కవేరకన్యక (కావేరి) యీపురాణనగరము నంటి ప్రవహించుచు దాని సౌందర్యమును, మాహాత్మ్యమును పొడిగించుచున్నది.

ఈ క్షేత్రమహిమను బేర్కొను పురాణ గాథ తత్ స్థలమాహాత్మ్యమున నిట్లున్నది:

"మహాప్రళయమునకు మున్ను బ్రహ్మ శివునాజ్ఞ మేరకు అమృతముపోసి మంటిని పిసికి దానితో నొకకుండను చేసి, సృష్టిబీజము లందుంచి, దాని నమృతముతో నింపి కలశము



మహామఘ తీర్థము ౧౯౨౧-వ సంవత్సరమునందు S. K.



నాగేశ్వరస్వామి ఆలయము M. K. R.



నాగేశ్వరస్వామిఆలయము: అంతః ప్రాకారము S. K.



కుంభేశ్వర స్వామి ఆలయము; పొందామరకొలను M. K. R.



మహామఘదినమున కుంభేశ్వరస్వామి తీర్థికులకు దర్శనమిచ్చు మంటపము. M. K. R.

వలె నలంకరించి మేరుప్రదక్షిణమున నుట్టిగట్టి యందుంచెను. అంత మహాప్రళయము ప్రాప్తిం


నాగేశ్వరస్వామి ఆలయము: గర్భగృహముM.K.R.

చెను. అపుడు చరాచరప్రపంచము ప్రళయోదకమున నిమగ్నమయ్యెను. ప్రళయకాల ఝంఝామారుతాహతిచేత ఉట్టి అల్లలనాడి యందలికలశము, దానిపయినున్న యలంకారములు చెల్లాచెదరయి నేలపయి బడిపోయెను. ఈ కలశము పడినచోటు మహామఘుక్షేత్ర మనబరగినది. కలశముపయి నున్న యలంకారాదులన్నియు అచ్చటచ్చట క్రింద బడినతోడనే లింగాకృతులయినవి. కలశము మాత్రము భిన్నము కాకుండినది. దానిని పరమేశ్వరుడు వ్యాధరూపమున నొక బాణముతో బ్రద్దలుకొట్టెను. అందలి యమృతమంతయు నేలపాలయిపోయినది. కొంత యొకపల్లమున నిలిచెను. దీనికి కన్యాతీర్థమను పేరు కలిగెను. అదియే మహామఘుతీర్థతటాకమనబడునది. అమృత సిక్తమగు మృత్తికతో లింగము నొకదానిని చేసి పరమేశ్వరుడు తానందైక్యము నందెను. ఈకార్యమంతయు జరిగిన స్థలము కుంభఘోణ నామకక్షేత్ర మయ్యెను ఈకలశపతనము కారణముగ తత్పరిసరముల కతిపయక్రోశములమేర ననేక దేవతానిలయములు, పెక్కుతీర్థములు నేరుపడినవి.

మఘానక్షత్రమున గురుచంద్రులును, కుంభరాశియందు సూర్యుడును ఉన్నసమయమున నీకలశము క్రింద బడియెను. అయ్యది మహామఘపుణ్యకాలమన ప్రసిద్ధికెక్కినది. ఈ పుణ్యకాలము పండ్రెండేడుల కొకమారు సంప్రాప్తమగుచుండును. అయిదుదినము లీ


నాగేశ్వరస్వామి ఆలయమునందలి సుబ్రహ్మణ్యస్వామి గర్భగృహము రథాకృతి నున్నది. M. K. R.

పుణ్యకాలము. ఈ సమయమున ముప్పది మూడుకోట్ల దేవతలును, నిఖిలతీర్థములును, నదులును నీమహామఘతీర్థమున ప్రవేశించి



శార్ఙ్గపాణి దేవాలయము, పొందామరకొలను M. K. R.

యుండును. గంగ, కావేరి, గోదావరి, నర్మద' సరస్వతి, సింధు, యమున, పయోష్ణి, కన్య యనునదు లీతీర్థమున కూపములరూపమున నిత్యనివాసము లేరుపరచుకొని యున్న వని ప్రతీతి.

ఈ మహాపుణ్యకాలమున నియమానుసారము ఈతీర్థమున గ్రుంకులాడి యాక్షేత్రమున నెలకొనియున్న దేవతలను సేవించిన వారికి సకలపాపములు నశించి పుణ్యలోక ప్రాప్తి గలుగును.

'అన్యక్షేత్రే కృతం పాపం
పుణ్యక్షేత్రే వినశ్యతి,
పుణ్యక్షేత్రే కృతం పాపం
వారాణస్యాం వినశ్యతి.
వారాణస్యాం కృతం పాపం
కుంభఘోణే వినశ్యతి,
కుంభఘోణే కృతం పాపం
కుంభఘోణే వినశ్యతి.'

(ఇతరక్షేత్రముల నొనర్చిన పాపము పుణ్యక్షేత్రముననను, పుణ్యక్షేత్రమున చేసిన పాపము కాశియందును, కాశియందు కావించిన పాపము కుంభఘోణముననను, కుంభఘోణమున జేసిన పాపము కుంభఘోణముననను నశించును.) అని యీ క్షేత్రముయొక్క సర్వోత్తమత్వము పేర్కొనబడినది."



శార్ఙ్గపాణి దేవాలయగోపురము M. K. R

తిరువిడమరుదూరు, తిరునాగేశ్వరము, తారాసురము, స్వామిమల, త్రిభువనము అనునవి అమృతకలశపతనము కారణముగా కుంభఘోణము చుట్టుపట్టుల నేరుపడిన క్షేత్రములలో ప్రధానములు. వీనిని పంచక్రోశము లందురు.



కావేరితటమున కళాశాల　　　M. K. R.

ఈక్షేత్రమున కాశీ విశ్వనాథాలయము, నాగేశ్వరాలయము, సోమేశ్వరాలయము, శార్ఙ్గపాణి-ఆలయము, (ఆది) కుంభేశ్వరాలయము, (ఆది) విశ్వేశ్వరాలయము, భూవరాహమూర్తి-ఆలయము, లక్ష్మీనారాయణాలయము, వరదరాజస్వామి-ఆలయము మొదలయిన దేవాలయము లనేకములు గలవు; పదునయిదు తీర్థములు గలవు. ఇచటి దేవాలయములు, తటాకములు రమణీయ శిల్ప విరాజితములు. మహామఘతీర్థము దక్షిణదేశమునందలి తటాకములలో నెల్ల సుందరమయినది. నలుకెలకుల చక్కగా నమరిన విశాలసోపానము లీతటాకమునకు గలవు తటముల, లింగములు నెలకొలుపబడిన విమానాదులు, చిన్నచిన్న దేవాలయములు గలవు. ఇవి యన్నియు తటాకము సొంపునకు పెంపు నొసగుచుండును.



కావేరి స్నానఘట్టము　　　S. K.

కుంభఘోణమున కొకవైపున కావేరియు, రెండవవైపున తచ్ఛాఖయు గలవు. నగరమునకు చక్కని నీటివసతి గలదు. లక్షులకొలదిగ నేతెంచు తైర్థికులకు సౌకర్యములును సమకూర్పబడుచుండును. నానాజాతులయు, నానాభాషలయు జనులు అపుడు ఇచ్చట జేరుదురు. సమ్మర్దము అత్యధి

కముగ నుండును. ప్రతి తైర్థికుడు తోడితైర్థికుని సౌహార్దమును సంపాదించుకొని, తన యారోగ్యమును కాపాడుకొనవలెను. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' (శరీరము ధర్మసాధనలలో మొదటిది) అని సూక్తి. ఆరోగ్యవంతుని హృదయము నిర్మలముగ నుండును. దైవ చింతాపరాయణుని హృదయ మపుడు దైవమునందు నిశ్చలముగ లగ్నము కాగలదు. అది యపవర్గ సౌధమునకు ప్రథమసోపానము.

ఇట్టిమహోత్సవమువలన లౌకికప్రయోజనము బహుళముగ గలదు. తైర్థికు లెల్లరు నేకకార్యాసక్తులు; అనుద్రిక్త మనస్కులు. వారి స్వరూపస్వభావములు యథాప్రకృతికములుగ నుండును. అపుడు వారు పరస్పర వేష భాషలయు, ఆచారాదులయు తత్త్వములను చక్కగా గుర్తించుటకును, తద్వినిమయమును గావించుకొనుటకును, సౌహార్దము నలవరచుకొనుటకును చక్కని యవకాశము లభించును.



కాశీవిశ్వనాథస్వామి ఆలయము        M. K. R.

లోకజ్ఞత యిందువలననధికముగ చేకూరగలదు.

ఈ యుత్సవమును పురస్కరించుకొని కుంభఘోణమున అఖిలభారత స్వదేశీ వస్తు ప్రదర్శనమును జరుగుచున్నది.



# గుంటూరు మండల గ్రంథాలయములు

ఉ. వేం. శ్రేష్ఠిగారు

ఆంధ్రదేశమున ప్రథమగ్రంథాలయమును స్థాపించిన గౌరవము గుంటూరుమండలమునకే లభించినది. ౧౮౯౪-వ సంవత్సరమున ఒంగోలు నగరమున 'శ్రీ రీడింగురూము'ను పురజనులు స్థాపించిరి. తదుపరి యితర గ్రామాదులలో గ్రంథాలయములు, పఠనాలయములు స్థాపింపబడెను. గ్రంథాలయముల సంఖ్య నానాట వృద్ధి చెందుచుండెను. సమస్తోద్యమములకు పునాదియైన గ్రంథాలయోద్యమమును పెంపొందింపదలచి ౧౯౧౬-వసంవత్సరమున శ్రీయుత తాడంకి వెంకయ్య ప్రభృతులు తెనాలియందు మండల గ్రంథాలయమును స్థాపించి తద్ద్వారా వివిధగ్రామములలో గ్రంథాలయ స్థాపనకు కృషి యొనర్చిరి. తదాది ౧౯౨౧-వ సంవత్సరము పర్యంతము మండల గ్రంథాలయ మహాసభలు జరిగినవి. అప్పటినుండి పదిసంవత్సరములపాటీ యుద్యమము నిద్రచెందుటచే కొన్ని గ్రంథాలయములు ప్రోత్సాహము లేక నామమాత్రావశిష్టము లైనవి.

ఈ దుఃస్థితిని బాప ౧౯౩౧లో మండల గ్రంథాలయ సంఘము పునరుద్ధరింపబడినది. ౧౯౩౧ లో వేటపాలెమునందు మరల గ్రంథాలయసభ జరిగినది. ఉద్యమాభిలాషుల ప్రచారమువలనను, ప్రోత్సాహమువలనను కొన్ని గ్రంథాలయములు జీర్ణోద్ధారణ గావింపబడినవి. సంఘ యాజమాన్యమున గుంటూరుమండలగ్రంథాలయ చరిత్ర ప్రకటింపబడినది. మరల ఈ సంవత్సరము తెనాలి తాలూకా అమృతలూరు గ్రామమునందు మండల గ్రంథాలయ మహాసభ జరిగినది. గ్రంథాలయోద్యమము వర్తమానకాలమున జిల్లాలో తీవ్రోత్సాహముతో నిర్వహింపబడుచున్నది. ౧౯౨౦-వ సంవత్సరంలో ఈజిల్లాలో ౧౩౬ గ్రంథాలయములు పనిచేయుచుండెను. ౧౯౩౧లో ౭౧ గ్రంథాలయములే పనిచేయుచుండెను. ఇందు వేయింటికి పైబడిన గ్రంథములు గల గ్రంథాలయములు బాపట్ల తాలూకాలో ౬, తెనాలి తాలూకాలో ౫, గుంటూరు తాలూకాలో ౩, రేపల్లె తాలూకాలో ౧, ఒంగోలు తాలూకాలో ౧, నర్సరావుపేటతాలూకాలో ౨, సత్తెనపల్లి తాలూకాలో ౨ మాత్రము గలవు. సొంత భవనములు గల గ్రంథాలయములు బాపట్ల తాలూకాలో ౬, తెనాలి తాలూకాలో ౬, గుంటూరు తాలూకాలో ౩, రేపల్లె తాలూకాలో ౧, ఒంగోలు తాలూకాలో ౨, నర్సారావుపేట తాలూకాలో ౧ మాత్రము గలవు. మూలనిధివసతి గాని, భూవసతి గాని గల గ్రంథాలయములు జిల్లా మొత్తముమీద ౫ మాత్రము గలవు. ౧౯౬౦ సం. ౨౧-వ చట్టముక్రింద రెజిస్టరు చేయబడిన గ్రంథాలయములు ౫. ఈ ౭౧ లో పురపాలక గ్రంథాలయములు ౨ న్నూ, పంచాయితీ గ్రంథాలయములు ౯ న్నీ గలవు. ౮-వ మండల గ్రంథాలయసభవారు వేటపాలెం సారస్వత నికేతనమును మండల కేంద్ర గ్రంథాలయముగా అంగీకరించియున్నారు. ౭-వ మండల గ్రంథాలయసభవారు అమృతలూరు భాషాసంజీవినీ గ్రంథాలయముగా అంగీకరించియున్నారు.

దేశాభ్యుదయము నభిలషించు మండలవాసులు శ్రద్ధతో గ్రంథాలయోద్యమ పునరుద్ధరణకార్యమునందు పాల్గొని మాకు చేయూత నొసంగగోరుచున్నాము.

పట్టిక ౧.

## గ్రంథాలయములు, వానియందు గల గ్రంథములు

బాపట్లతాలూకా :—

౧. ఆంధ్ర వాణీ గ్రంథనిలయము, ఇనగల్లు, ౨,౦౦౦.

ఇవి నిరపాయకరములు. లండను జంతుశాలయందు గలవు. G. S. A.



అమెరికా పిల్లిసాండోా

మూడేండ్లవయస్సు. మీదికెత్తిపట్టియున్న లంగరు ౪౬ పౌనుల బరువుగలది. G. S. A.



సముద్రపు ఉడుము

ఈజంతువులు నాలుగుమాత్రమే బ్రతికినవి దొరికినవి. పొడవు నాలుగడుగులు. ఇవి ముక్కులనుండి నీటియావిరి విడుచుచుండును. వీటికి ఆహారము సముద్రపుమొక్కలు. ఇవి దక్షిణ అమెరికాకు దూరముగానున్న 'కలపెగోసు' దీవులయందు దొరకినవి. వీపుపయినుండి నెత్తిమీదికి ముండ్లు చాలుగను, చర్మము కవచమువలెను ఉండును.



౮. మోట



౭. పిడివాటు

శ్రీ వి. యస్. గోపాలదేశికాచారి ఫోటోలు



సెంటుమారిజులో పేరుడుమంచుపయి, జారుచు ఆడు టెన్నిసుఆట

G. S. A.

౨. ఆంధ్ర సరస్వతీ గ్రంథనిలయము, నిడుబ్రోలు, ౧,౫౦౦.
౩. ఆంధ్ర సరస్వతీ గ్రంథనిలయము, గోళ్లమూడిపాడు, ౬౧౫.
౪. కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము, చినగంజాం, ౪౨౧.
౫. కన్యకా పరమేశ్వరీ గ్రంథాలయము, పందిళ్లపల్లి, ౫౯౦.
౬. కడలిశయన గ్రంథాలయము, వాడరేవు, ౧౦౬.
౭. కోదండరామ పుస్తకభాండాగారము, నండూరు, ౩౫౦.
౮. గ్రామపంచాయితీ గ్రంథాలయము, పావులూరు, ౧౪౫.
౯. గోఖ్లే విద్యానిలయము, పచ్చల తాడిపఱ్ఱు, ౨౦౦.
౧౦. గోఖ్లే పఠనమందిరము, చేబ్రోలు, ౩౦౦.
౧౧. గౌరీ సరస్వతీనిలయము, చేబ్రోలు, ౩౨౦.
౧౨. చిదానంద సరస్వతీ గ్రంథాలయము, పెదచెఱుకూరు, ౧,౨౦౦.
౧౩. చౌడేశ్వరీ విద్యానిలయ సమాజము, పందిళ్లపల్లి, ౫౨౦.
౧౪. జాతీయసమితి గ్రంథాలయము, పెదనందిపాడు, ౮౦౦.
౧౫. పంచాయతీ గ్రంథాలయము, ఇంకొల్లు, ౭౦౦.
౧౬. ,, ,, పరుచూరు, ౩౦౦.
౧౭. ,, ,, పూండ్ల, ౧౨౪.
౧౮. ,, ,, పాలపఱ్ఱు, ౭౦.
౧౯. ,, ,, అన్నవరం, ౨౯.
౨౦. ,, ,, తుర్లపాడు, ౨౬.
౨౧. ,, ,, సంతెపూడి, ౪౫.
౨౨. బాలభక్త పుస్తక భాండాగారము, కారంచేడు, ౬౦౦.
౨౩. భగత్పుస్తకభాండాగారము, లింగంగుంటపాలెం, ౩౫౦.
౨౪. భారత యువజన సంఘము, బాపట్ల, ౧,౦౦౦.
౨౫. మారుతీరాం గ్రంథాలయము, ఈతేరు, ౬౦౬.
౨౬. మహా త్రిపురసుందరీ గ్రంథాలయము, కాకుమాను, ౩౦౦.
౨౭. మార్కండేయ గ్రంథాలయము, పేరాల, ౩౦౦.
౨౮. రామమోహన గ్రంథాలయము, ఈపూరిపాలెం, ౭౫.
౨౯. రామసుబ్బయాంధ్ర గ్రంథాలయము, పొన్నూరు, ౫౦౦.
౩౦. వాణీ నికేతనము, చీరాల, ౩౫౨.
౩౧. వీరాంజనేయ పుస్తక భాండాగారము, మునిపల్లె, ౩౫౭.
౩౨. శంకరపుస్తకభాండాగారము, మన్నవ, ౫౦౦.
౩౩. శంకరగ్రంథాలయము, మర్రిపూడి, ౧,౨౦౦.
౩౪. సారస్వతనికేతనము, వేటపాలెం, ౬,౨౭౫.
౩౫. సరస్వతీగ్రంథాలయము, వద్దబాడు, ౨౫౦.
౩౬. సరస్వతీ నిలయము, జాగర్లమూడి, ౨౨.

౩౭. సత్యజ్ఞానానంద గ్రంథాలయము, మామిళ్లపల్లి, ౩౦౦.
౩౮. హనుమత్ పుస్తక భాండాగారము, నాగులపాడు, ౪౦౦.

తెనాలితాలూకా :—

౩౯. ఆర్య బాల సమాజము, పెదపాలెము, ౫౦౦.
౪౦. ఆంధ్ర సరస్వతీనిలయము, మందూరు, ౧,౦౦౦.
౪౧. ఇందిరానిశాంత గ్రంథనిలయము, మూలుపూరు, ౭౨౫.
౪౨. నన్నయార్య సరస్వతీ నిలయము, ప్యాపర్రు, ౪౦౦.
౪౩. నన్నయాంధ్ర గ్రంథనిలయము, పెదపూడి, ౧,౦౦౦.
౪౪. నవనీతహార గ్రంథాలయము, చినపులివర్రు, ౪౫౦.
౪౫. పురపాలక సంఘ గ్రంథాలయము, తెనాలి, ౬౪౫.
౪౬. భాషా సంజీవినీసంఘము, అమృతలూరు, ౪,౦౦౦.
౪౭. భారతీవిలాస విద్యానిలయము, అనంతవరము, ౧,౧౦౦.
౪౮. రాజరాజనరేంద్ర గ్రంథాలయము, గోవాడ, ౬౨౦.
౪౯. రామచంద్ర పుస్తకభాండాగారము, వరహాపురం, ౩౧౪.
౫౦. వాణీవిలాస గ్రంథనిలయము, కొల్లిపర, ౫౦౦.
౫౧. వెంకటేశ్వరనిలయము, కొల్లూరు, ౭౦౦.
౫౨. కృష్ణమోహనవిలాస గ్రంథాలయము, నాజరుపేట, ౩౦౦.
౫౩. సప్తకోటేశ్వర గ్రంథాలయము, అనంతవరం, ౫౦౦.
౫౪. సరస్వతీనిలయము, కూచిపూడి, ౧,౧౦౦.
౫౫. సారస్వతనిలయము, వామనగుంటపాలెం, ౩౦౦.

గుంటూరు తాలూకా :—

౫౬. ఆర్య వైశ్యయువకుల సాహితీ సంఘము, గుంటూరు, ౩,౪౦౦.
౫౭. జ్ఞానాభివర్ధనీ గ్రంథనిలయము, ముట్లూరు, ౧,౨౦౦.
౫౮. పురపాలక గ్రంథాలయము, గుంటూరు, ౨,౮౧౦.
౫౯. బాలసరస్వతీ పుస్తకనిలయము, శేకూరు, ౫౫౮.
౬౦. మురళీధర గ్రంథాలయము, అబ్బనేని, గుంటపాలెం,౦
౬౧. వేదాంతగ్రంథాలయము, గారపాడు, ౧౫౦.
౬౨. సీతారామ గ్రంథాగారము, సుద్దపల్లి, ౧,౦౦౦.
౬౩. శ్రీసనాతన గ్రంథమండలి, గుంటూరు, ౪౦౦.

రేపల్లె తాలూకా:—

౬౪. బాలగంగాధర పుస్తకాలయము, పెదపులివర్రు, ౭౫౦.
౬౫. రైతుగ్రంథాలయము, మాచవరం, ౧,౧౦౦.
౬౬. సీతారామాంధ్ర గ్రంథాలయము, కావూరు, ౭౦౦.

ఒంగోలు తాలూకా:—

౬౭. ఆంధ్రభాషానిలయము, కొణికి, ౩౧౦.
౬౮. గౌరీశంకర గ్రంథాలయము, టంగుటూరు, ౮౦౦.
౬౯. శంకరమనోరంజనీ గ్రంథాలయము, తిమ్మసముద్రము, ౩౫౦.
౭౦. సరస్వతీగ్రంథాలయము, ఒంగోలు, ౨,౮౨౦.
౭౧. సర్వోత్తమ గ్రంథాలయము, పెళ్లూరు, ౮౫౦.

నరసరావుపేట తాలూకా:—

౭౨. కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము, నరసరావుపేట, ౩,౧౧౫.
౭౩. రామకవి గ్రంథనిలయము, ఏర్చూరు, ౫౦౦.
౭౪. వివేకానంద గ్రంథాలయము, అనంతవరం, ౧,౪౦౦.

సత్తెనపల్లి తాలూకా:—

౭౫. కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము, బెల్లంకొండ, ౨౫౦.
౭౬. వేణుగోపాల గ్రంథాలయము, నెమలికల్లు, ౧,౦౫౨.
౭౭. శారదానిలయము, సత్తెనపల్లి, ౧,౦౦౦.
౭౮. సీతారామ గ్రంథాలయము, ఇరుకుపాలెం, ౪౦౦.

పల్నాడు తాలూకా:—

౭౯. ఆంధ్ర గ్రంథాలయము, రెంటచింతల, ౩౦౦.
౮౦. లక్ష్మీచన్నకేశవగ్రంథాలయము, కారెంపూడి, ౨౭౫.
౮౧. శారదా గ్రంథాలయము, జూలకల్లు, ౨౦౦.

పట్టిక ౨.

గుంటూరు మండల గ్రంథాలయముల సంఖ్య

| తాలూకా | | ౧౯౨౦ | ౧౯౩౨ |
|---|---|---|---|
| బాపట్ల | ... | ౩౫ | ౩౮ |
| గుంటూరు | ... | ౨౨ | ౮ |
| నరసరావుపేట | ... | ౮ | ౩ |
| ఒంగోలు | ... | ౧౬ | ౫ |
| పల్నాడు | ... | ౪ | ౩ |
| రేపల్లె | ... | ౧౪ | ౩ |
| సత్తెనపల్లి | ... | ౩ | ౪ |
| తెనాలి | ... | ౩౩ | ౧౭ |
| వినుకొండ | ... | ౧ | ౦ |
| | | ౧౩౬ | ౮౧ |

# ఆయుర్వేదము-భారతీయదృష్టి

డాక్టర్ కనగాల లక్ష్మీనరసింహారావుగారు

వైదికకాలంలో మహర్షులు యోగదృష్టితో సాధించి సూత్రరూపంగా చెప్పిన మహాసత్యాలతో ఆయుర్వేదం నిండిఉందనీ అది విశాలమైనభావమూ, గంభీరమైన అర్థమూ కలిగి సమస్త శాస్త్రాలకూ ప్రసూతి స్థానము మాత్రమే కాకుండా పరమావధికూడా అయి ఉందనే విషయాలు యిదివరకే సూచించినాను.

సమస్త మానవజాతికీ ఇహలోకసంబధమైన ఆయురారోగ్య సౌభాగ్యాలు మాత్రమే కాకుండా పరలోక సుఖంకూడా సమకూర్చడమే పరమప్రయోజనముగా కల ఆయుర్వేదమూ తత్తుల్యములైన యితరవేదశాస్త్రములూ పాశ్చాత్యదేశాల్లో యెక్కడా పుట్టకుండా భారతదేశంలోనే ఎందుకు పుట్టవలెను? మనుష్యుడు యీలోకంలో పొందతగిన వివిధసౌకర్యాలు మాత్రమే కాకుండా అత డనుభవించతగిన అనేకవిధములయిన భోగభాగ్యాలుకూడా సమకూర్చకలిగిన ఆధునికశాస్త్రములు పాశ్చాత్యదేశాల్లోనే ఎందుకు పుట్టవలెను? వైదిక సత్యములను దర్శించగల యోగదృష్టి పూర్వంభారతదేశములో ఉండే మహర్షులకే ఎందుకు లభించవలెను? ఈవిధమైన యోగదృష్టి పాశ్చాత్యదేశములలో ఎక్కడా కనుపించకపోవడానికి కారణము ఏమయిఉంటుంది? శాస్త్ర సత్యములను నిర్ణయించడానికి పాశ్చాత్యు లవలంబించే శాస్త్రప్రయోగమూ (scientific experimentation), తర్కమీమాంసా (logical process) పూర్వం భారత దేశములో కనుపించకపోవడానికి కారణ మేమయి ఉంటుంది? పాశ్చాత్యుల ఆధునికశాస్త్రములకూ ప్రాచీనములైన హిందూశాస్త్రములకూ వస్తుతః ఏదైనా భేదం ఉందా? ఉన్నట్టయితే ఆభేద మేమిటి? అది ఎందుకు కలిగింది? ఇటువంటి ప్రశ్నలు కలుగుతవి. ఈసందేహాలన్నిటికీ కారణం మాత్రము ఒక్కటే. ప్రాచ్యదేశాలవారి దృష్టికినీ, పాశ్చాత్యదేశాలవారి దృష్టికినీ ఉన్న భేదమూ, ఆభేదానికి గల కారణమూ తెలుసుకొంటే ఈసందేహాలన్నీ నివారణ అయిపోతవి. కనుక ఆవిషయమై క్లుప్తముగా చెప్తాను.

ప్రాచ్య దేశాలలోనూ పాశ్చాత్య దేశాలలోనూ పూర్వకాలంలో నామరూపాలు కలవి చాలా తక్కువ. ప్రాచ్యదేశాలకు భారతదేశమూ పాశ్చాత్య దేశాలకు గ్రీసుదేశమూ ప్రాచీనవిజ్ఞానమునూ, నాగరకతనూ భిక్షపెట్టినవి. ఈజిప్టూ, రోమూ తరువాత తల యెత్తినవే. కనుక ప్రాచీనకాలములో, అంటే మానవ జాతియొక్క బాల్యదశలో, భారతదేశమూ గ్రీసు దేశమూ ఎటిస్థితిలో ఉండేవో తెలుసుకొంటేనే తప్ప కావలసిన విషయం బోధపడదు. కాని యీదేశాల పురాతనస్థితిగతులను గురించి తెలుసుకొనడానికి ప్రస్తుతం చరిత్ర అనుకొనేది ఏమీ ఉపకరించదు.

మనుష్యుడి స్వరూపస్వభావాలూ, రూపరేఖావిలాసాలూ, తెలివి తేటలూ, మనస్తత్వం మొదలయినవి చాలావరకు అతని జన్మయొక్క పూర్వాపరపరిస్థితులవల్ల కలుగుతవి. ప్రత్యేకవ్యక్తి విషయములో ఎలాగో వ్యక్తిమయం అయిన జాతివిషయంలోనూ అలాగే. అయితే ఒక్క భేదం మాత్రం ఉంది. ప్రత్యేకవ్యక్తికి పుట్టడం చావడం ఉండడము చేత ఆవ్యక్తి జన్మించిన కాలాన్నిబట్టి పూర్వాపరపరిస్థితులు నిర్ణయించడానికి వీలుంది. జాతివిషయంలో అట్లా కాదు. జననమరణాలు జాతికి లేవు. చచ్చేవాడు చస్తూఉంటే పుట్టేవాడు పుడుతూఉండడముచేత, గమనించతగినంత మార్పు జాతిలో ఏమీ కనబడదు. జాతివిషయంలో ఏకాలాన్ని గురించి వ్యవహరిస్తామో దాన్ని బట్టే పూర్వాపరసంజ్ఞ కలుగుతుంది. పురాతనమునకు పూర్వం లేదు. కనుక మన మొకదేశము యొక్క పురాతనస్థితిని గురించి యోజించదలచుకొన్నప్పుడు పూర్వమును విడిచి పరమునే స్వీకరించవలెను.

ప్రస్తుతము భారతదేశాన్ని గురించీ గ్రీసుదేశాన్ని గురించీ పరిశీలించవలసిఉంది. పూర్వార్ధగోళంయొక్క

నాభిస్థలమందు భారతదేశ మున్నట్టు కనుపిస్తుంది. భూభాగములో ఆక్రమించిన స్థానమును బట్టీ స్వీకరించిన స్వరూపమునుబట్టీ భారతదేశము అన్ని దేశముల వంటిదీ కాదనీ, దీని కొక ప్రత్యేకవ్యక్తిత్వం ఉన్నట్టూ చటుక్కున స్ఫురిస్తుంది. ప్రపంచమందుండే సమస్తమూ యథోచితముగా భారతదేశమం దుండడంచేత భారతీయులు దేనికొరకూ దేశము విడిచి బయటకు పోవలసిన అవసరము కలిగేది లేదు. భారతీయులశాంతికి ఇతరదేశములవారు ఏవిధమయిన భంగమూ కలిగించకుండా ఉండడానికి పర్వతపంక్తు లనే రాతిగోడలూ, సముద్రము లనే లోతైన అగడ్తలూ నిర్మించినట్లు తోస్తుంది. ఏవంక చూసినా సస్యసమృద్ధములయిన పచ్చని పయిరులతోనూ పుష్పఫలసమృద్ధములయిన వృక్షములతోనూ దేశమంతా నిండిఉండేది. అంతే కాకుండా ఎక్కడ బడితే అక్కడ అనేక విధములయిన ప్రకృతిసౌందర్యాలూ విచిత్రపరిణామాలు కనబడడమువల్ల భారతీయునికి దేశమంతా ఒకస్వాభావికమయిన చిత్రవస్తుప్రదర్శనశాలలాగా తోచేది: అన్నీ అతన్ని అద్భుతాశ్చర్యచకితమానసుణ్ణిగా చేసివేశేవి. కొంతసేపు అతడు వాటిలో లీనమయి తన్ను తాను మరచి పొయ్యేవాడు. తనకూ ప్రకృతికీ ఒక విధమయిన జీవసంబంధమూ ఆత్మసంబంధమూ ఉందని గుర్తించినాడు. సూర్యచంద్రనక్షత్రాదులను చూచి నమస్కరించి ఆరాధించేవాడు. అవన్నీ అతని హృదయాన్ని ఆకర్షించేవి. వాటి నన్నిటిని ఆప్తమిత్రులనుగా భావించి ప్రేమించేవాడు. దేవతలనుగా భావించి అమితగౌరవముతో ఆరాధించేవాడు. అతడారాధించేది చర్మచక్షువులకు గోచరమయ్యేదానిని కాదు. దానివెనక లీనమయి దానిలో అంతర్గతమయి ఉండే శక్తిని. అతనికి విశ్వమంతా శక్తిమయముగా కనబడేది. అతనికి ఆమహాశక్తికి మధ్యను ఉన్న పాంచభౌతికపదార్థము ఎంత స్థూలమయినప్పటికీ అతనిదృష్టిఎదట అద్దమువలె స్వచ్ఛము కావలసినదే. అతని దృష్టిప్రసారమును అడ్డగలిగినది ఏదీ ఉండేది కాదు. కనుక అతడేవంక చూచినా ప్రకృత్యంతర్గతమయినఆమహాశక్తి అతనికి ప్రత్యక్షమయ్యేది. ప్రకృతిమర్మాలన్నీ అతనికి కరతలామలకములు అయ్యేవి. తనకు బాహ్యప్రకృతికి నిజముగా ఏమీ భేదము లేదని గుర్తించినాడు. సృష్టికంతకూ కర్త ఒక్కడు ఉన్నాడనీ, అతడమితశక్తిజ్ఞానసంపన్నుడు మాత్రమే కాకుండా ప్రేమమయుడూ సుందరమూర్తి కూడా అయిఉన్నాడనీ అతనికి తోచింది. వివిధములైన ప్రకృతిపరిణామములలో అంతర్గతమయిన శక్తులన్నీ ఆమహాశక్తికి రూపాంతరాలేనని గుర్తించినాడు. ఆనాటి దేశకాలపరిస్థితుల ననుసరించి అతనికి అవసరములయిన ఆహారాది సమస్తసౌకర్యములూ కష్టపడనక్కరలేకుండా సమకూడడమువల్లనూ, అతన్ని ఆవరించిఉన్న ప్రకృతిసౌందర్యమూ దాని విచిత్రపరిణామములు అతని హృదయాన్ని ఆకర్షించి అతనిదృష్టిని వ్యావహారిక విషయములనుంచి పారమార్థిక విషయముల వంకకు మరలించడమువల్లనూ, దేన్ని చూచినా స్థూలదృష్టితో చూడక సూక్ష్మదృష్టితో చూడడము అతని స్వభావ మయిపోయింది. అందుచేతనే అతడు పారమార్థికదృష్టితో చూస్తాడుకాని వ్యావహారికదృష్టితో చూడడు. అతనికి కావలసినది అంతస్తత్వమే కాని బాహ్యస్వరూపము కాదు. నాశరహితుడై నిత్యకళ్యాణగుణస్వరూపుడయిన భగవంతుడొకడు ఉన్నాడనీ, అద్వితీయుడయిన అతడే యీజగత్తుకు సృష్టికర్త అనీ, మానవుడాదిగాగల సమస్తజీవకోటికి అతడే తండ్రి అనీ, ప్రకృతీ మానవుడూ తీరని అన్యోన్య సంబంధము కలవారనీ, మృత్యువు శరీరముకే కాని ఆత్మకు లేదనీ, యివి మొదలయిన విషయములను గుర్తించడమువల్ల అతడేమి చేసినా, చెప్పినా, ఏమి ఊహించినా, యీభావములే వ్యక్తము చేస్తూఉంటాడు.

ఇక గ్రీసుదేశవిషయము. ఈదేశము మధ్యధరాసముద్రములో తూర్పున మూలగాఉన్న ఒకద్వీపకల్పము. సముద్రము యీదేశముయొక్క భూభాగమును అనేక ప్రదేశములలో తొలిచివేయడమువల్ల ఓడలు నిలవడానికి తగిన ప్రదేశములు అనేకచిన్నచిన్నద్వీపకల్పములలో స్వాభావికముగా ఏర్పడ్డవి. దేశమంతా పర్వతమయము. వలయాకృతి వహించిన పర్వతపంక్తులు దేశాన్ని వివిధ భాగములుగా విభజించినవి. ఎక్కడనుంచి చూచినా పది మైళ్లలోపల పర్వతములూ నలభైమైళ్లలోపల సముద్రమూ

కనబడుతూ ఉంటుంది. కొండలనుంచి శీఘ్రగతిని ప్రవహించే సెలయేళ్లు తప్ప వ్యవసాయమున కనుకూలమయిన నదులు లేవు. మురుగునీరు బయటకు పోవడానికి అవకాశము లేనందువల్ల అనేక ప్రదేశములు తేమతోనూ దొంగ యూబులతోనూ ఉండేవి. ఇందువల్ల చాలా అపాయకరముగానూ అనారోగ్యముగానూ ఉండేది. అయినప్పటికీ అనుకూలమయిన శీతోష్ణస్థితీ, నేత్రానందకరములయి ప్రకృతిసౌందర్యముతో నిండిఉన్న ప్రదేశములూ ఉన్నవి. కాని అగ్నిపర్వతములున్న ప్రదేశములు సమీపములో ఉండడమువల్ల భూకంపములవల్ల బాధలు నేటికిని కలవు. లోపలిపర్వతపంక్తులూ వెలుపలిసముద్రమూ దేశాన్ని శత్రువునుంచి రక్షించినా వలయాకారములయిన పర్వత పంక్తులు మండలములుగా విభజించడముచేత ఒక్కసారి ప్రవేశించిన శత్రువును వెలుపలికి తరమడానికి దుస్తరమే కాకుండా అతడు దేశమంతా ఆక్రమించడానికి అవకాశముకూడా ఉంది. మనుష్యున కాహారసౌకర్యములు ఏమీ లేవు. తెల్లవారి లేస్తే తిండికి వెతుకవలసినదే. అక్కడ కొన్నిపండ్లు దొరికినా అవి ఒకలెక్కలోనివి కావు. సముద్రానికి పోయి చేపలు పట్టుకోవడమో, కొండకో కోనకో పోయి జంతువులను వేటాడ్డమో తప్ప మరి గతి కనిపించదు. తెల్లవారి లేచి తిండికి పాకులాడుతూ కడుపు చేత పట్టుకొని బయటకు బయలుదేరినవాడు తిరిగి ప్రాణాలతో యింటికి వచ్చేదాకా నమ్మకము లేదు. ఒక్క రోజు బయటకు పోవడము మానివేస్తే కడుపు కాలి చావవలసినదే. అందువల్ల జీవితము దుర్భరముగా ఉండేది. కొండా, అడవీ, సముద్రమూ, భూమీ, వీటిల్లో ఏదో క్రూరమయిన మహాశక్తి దాగిఉందని, అది మనుష్యునికి ఎప్పుడూ ఏదోవిధమయిన అపకారము చేస్తూఉంటుందనీ భావించేవారు. అందుచేత భగవంతుడు దయామయుడనీ, సౌందర్యరాశిఅనీ, న్యాయమూర్తిఅనీ ఎన్నడూ అతనికి తోచేది కాదు. అనుక్షణమూ ఏవంక తిరిగినా ప్రకృతి అతన్ని ప్రతిఘటిస్తున్నట్టే కనబడుతూ ఉండేది. ఏరోజుకారోజు తిండీ బ్రతుకూ కూడా నిశ్చయము కాకపోవడముచేత మన స్తిమితము ఎన్నడూ ఉండేదికాదు. తన ప్రయోజకత్వముచేత తానే ప్రకృతితో పోరాడి దాన్ని భేదించో ఛేదించో తనకు కావలసినవాటిని బలవంతముగా లాగుకొనవలెననే స్వభావము అయిపోయింది. ఎంతో కష్టపడితేనే కాని ఏదిన్నీ లభించేదికాదు. కాబట్టి అతనికి మంచి పట్టుదల, చురుకుతనము, శరీరపాటవము మొదలయిన యోధలక్షణాలు అబ్బినవి. ఇందువల్ల అతడు దేన్ని చూచినా వ్యావహారికదృష్టితో చూచేవాడే కాని పారమార్థికదృష్టితో చూడలేకపొయ్యేవాడు. క్షుద్బాధ, మృత్యుభయము, ఎప్పటి కప్పుడు అతన్ని పీడించడమువల్ల అతనికి ప్రకృతిపరమేశ్వరులు పరమశత్రువులవలె కనబడుతూఉండేవారు. ప్రకృతిసౌందర్యము అతనికి ఆనందము కలిగించడానికి బదులు వెక్కిరించినట్లుండడమువల్ల అతనిహృదయాన్ని ఆకర్షించలేకపోవడమే కాకుండా వగటుగాకూడా కనుపించేది. ఆకారణముచేత ప్రకృతిరహస్యములను జీవేశ్వరసంబంధమును యోజింపతగిన పరిస్థితులు కాని, అనుకూలమయిన దృష్టికాని అతనికి లభించలేదు. అతని తలపులూ పలుకులూ చేతలూ అతని వ్యావహారికదృష్టిని అనుసరించేఉంటవి.

జాతకశాస్త్ర రీత్యా కూడా ఈరెండుదేశముల దృష్టులూ ఇదేవిధముగా ఉంటవని అనేకజ్యోతిశ్శాస్త్రవేత్తలు తెలిపిఉన్నారు. ఆవిషయములను దిజ్మాత్రముగా రాబోయే వ్యాసములో కనబరుస్తాను.

ఇంతవరకూ ప్రాచ్యపాశ్చాత్యదృష్టులకు కల భేదమూ, ఆభేదమునకు గలకారణమూ తెలపడానికి ప్రయత్నముచేసినాను. ఈభేదమే వారి జాతీయజీవితములూ, మతసాంఘికసంస్థలూ, సారస్వతములూ, శాస్త్రములూ, కళలూ మొదలగు వాటియందు మాత్రమే కాక వారి వైద్యసంప్రదాయములందు కూడా ఎట్లు ప్రతిబింబితములైఉన్నవో ముందు క్లుప్తముగా వ్యక్తము చేస్తాను.

---

## శ్రీయుతులు

# రాయప్రోలు వెంకటరామ సోమయాజులుగారు



రాయప్రోలు వెంకటరామసోమయాజులుగారు

ఇరువదియారు వత్సరములు నిజాంరాష్ట్రము హైద్రాబాదునందలి యున్నతకలాశాలలో, సంస్కృతాంధ్రపీఠము నధివసించి, ఉభయభాషలయందును నసమానపండితుడై బహుగ్రంథనిర్మాత యయ్యు వినయుధనుడై, సనాతనమతోద్ధారకుడై, కొలది దినముల క్రిందట నుపకారవేతనము నొందిన శ్రీయుత వేంకటరామసోమయాజులుగారు క్రీ. శ. ౧౮౭౫ సం. మార్చి నెలలో మిక్కిలి ప్రాచీనమైన యొక యాంధ్ర వైదిక కుటుంబమున జనించిరి. వీరివంశనామము వరంగల్లు రాజ్యరమాధురంధరుడగు రెండవ ప్రోలరాజిచ్చిన యగ్రహారమునుండి వచ్చెనని వీరియాశయము. ఈవంశము ప్రథమమునుండియు నోరుగల్లురాజ్యమున నుండిన దయ్యు మహమ్మదీయు లారాజ్యమును స్వాధీనపరచుకొనిన వెనుక దేశాంతరము (గుంటూరు) వెడలవలసివచ్చెను.

వీరి తండ్రితాత లందరును వైదికకర్మనిష్ఠాగరిష్ఠులై సోమయాజులై వరలిరి. వీరిని తండ్రిగారతి బాల్యముననే వేదవాక్యోచ్చారణమున దక్షుల నొనర్చిరి. వీరి గ్రామ మొకమారు పుష్పగిరి పీఠాధిపతులు వేంచేసినపుడు బాలురగు వీరివేదోచ్చారణమున కచ్చెరువంది పితృసహితముగా వీరికి తమయాస్థానగజముపై స్థాన మొసంగిరట. దీన బాల్యమునుండియే వీరిశక్తిసామర్థ్యములు సువిదితములు. వీరికి మిక్కిలి బాల్యముననే పితృవియోగము తటస్థించెను. అప్పటికే వైదికవిద్యయం దాదరము తగ్గుచున్నందున వీరితల్లిగారు వీరికి రాజకీయవిద్య చెప్పింపనెంచి, యది బహుధనసాధ్య మగుటచే వీరికిని వీరిసోదరునికిని (వా రిప్పుడు దివంగతులైరి) తమ స్వల్ప కుటుంబాస్తిని విక్రయించి చెప్పించెను. పేదకుటుంబమగుటచే నప్పుడప్పుడు గల్గెడి యంతరాయములతో నెట్టెట్లో వీరు పట్టపరీక్షవరకు చదివి మొదట చెద్దరుఘాటు గవర్నమెంటువారి యున్నతపాఠశాలయం దుపాధ్యాయ పదవిని స్వీకరించి కొన్నివత్సరము లచ్చటనుండి తదనంతరము నిజాంకళాశాలలో నాంధ్రగీర్వాణ విద్యాపీఠము నధిష్ఠించిరి. మధ్యకాలములో, ౧౯౧౮-వ వత్సరమున వేదాంతగ్రంథపఠనముచే వీరికి వైరాగ్యము జనించి ప్రవ్రజింప నిచ్ఛ కల్గెను గాని గురువర్యుల సలహా గొని కర్మసన్న్యాసము కంటె కర్మయోగము విశేషమను గీతావాక్యమును స్మరించి వీరట్టి ప్రయత్నమునుండి విరమించిరి. అప్పటినుండియు జీవితమున జనకమహారాజు నాదర్శముగ గొని నిరభిసంధికర్మానుష్ఠానము నాచరించుచు, శిష్యులకు పాఠముల గరపుచు, విధ్యుక్తముగా జీవితమును గడపుచున్నారు. వీరి స్వచ్ఛజీవితము వీరి దుస్తులలో ప్రతిబింబితమై యున్నది. వీరి మనస్సంతృప్తి వీరి నిరంతరమందహాసభూషితవదనము చాటుచున్నది. నిరాడంబర జీవనము వీరియాదర్శము.

వీరిప్రతిభ సర్వతోముఖము. వీరు రచించిన గ్రంథముల దిలకించిన నిది విదితము కాగలదు. భూగోళ

శాస్త్రము, రసాయన శాస్త్రము, మొదలగు వానినుండి వేదాంతముపరకు వీరిపాండిత్యము వీరిగ్రంథములవలన స్పష్టము. మహారాష్ట్రకవివర్యుడగు మోరోపంతు వ్రాసిన "కేకావళీ" యను నత్యుత్తమపద్యకావ్యమును వీ రాంధ్రగీర్వాణములలోని కనువదించి మించిరి. షేక్స్పియరు మహాకవి రచితమగు 'టెంపెస్టు' అను నాటకమును 'మిహిరాంధభారతి' యను నామముతో నాంధ్రీకరించిరి. వయోవృద్ధులగు వీరితల్లిగారిప్పటికిని బెజవాడ పట్టణమున నొక సంస్కృత పాఠశాలను నడుపుచున్నదన్న వీరి కుటుంబముయొక్క దృక్పథము తెల్లము కాగలదు. వీరు ఆరోగ్యసంపన్నులయి తమజీవితశేషమును స్వార్థ పరార్థములకొరకుపయోగించుచుందురు గాత యని సవినయముగా ప్రార్థించుచున్నాను.

(కు. సీ.)



గడగంతు (Pole Jump) మదరాసు

కొచినువారగు శ్రీ సి. కృష్ణదాసుగారు. వీరికి మొదటి బహుమతి లభించినది.




## నేటి భారతరమణులు

దేశాభివృద్ధికయి నేటి భారతరమణులు కావించుచున్న సర్వవిధములగు కార్యములను గూర్చి శ్రీ పి. సత్యనాథను కన్య 'యంగ్' బిల్డర్ పత్రికయం దిట్లు వ్రాసెను.

భారతవర్షమునందలి స్త్రీ ప్రపంచమునందు ప్రజ్ఞావిజ్ఞానములు త్వరితముగ వ్యాపించుచున్నవి. మన దేశమునం దుత్తమజాతులం దెప్పుడును సభ్యత కొరవడి యుండలేదు. కాని జనసామాన్యమునందు విద్యావ్యాప్తి లేకుండెను ఆధునికవిద్య ఆలోపమును తీర్చెను. ఇప్పుడు మనదేశమునం దెన్నియో నారీకళాశాలలు పాఠశాలలు తలయెత్తుచున్నవి. వానియం దెందరో కన్యలు విద్య నభ్యసించుచున్నారు. చాలమంది ప్రవేశము గోరుచుండుటచే నెందరినో చేర్చికొనుటకు వీలు కలుగుటలేదు. ఏబదియేండ్లక్రిత మిటు లుండలేదు. అప్పుడు స్త్రీ యున్నత విద్యాభ్యాసమునకు తలపెట్టుటయే అబ్బురముగ నుండెను. అప్పటికి నిప్పటికి నెంత తారతమ్యము? నూతనదశ యెంతలో తలయెత్తుచున్నది?

స్త్రీలలో విద్యావంతులు నేడు చాలమంది తలయెత్తుచుండుటచే వారు సంఘసేవ చేయుట కెక్కువ యవకాశము లుదయించుచున్నవి. స్త్రీలు చాలమంది విద్యాలయ నిర్వాహకురాండ్రుగ నున్నారు. వారు దక్షతతో వానిని నిర్వహించుచున్నారు. స్త్రీలెందరో వైద్యవృత్తి నవలంబించి ప్రజాసేవను చేయుచున్నారు.

స్త్రీ లెందరో విదేశములకేగి యున్నతజ్ఞానము నార్జించుచున్నారు. వారికి విద్యాపేక్ష యతిశయించెను. వారు కేవలము పరీక్షలందు కృతార్థత పొందుటతో తృప్తిపొందక జ్ఞానార్జనాతత్పర లగుచున్నారు. కేవలము కన్యలే కాక వివాహితలై గృహిణులైనవారును దేశాటనము చేసి లోకానుభవమును జ్ఞానమును పొందవలయుననెడి తత్పరత్వమును కనుపరచుచున్నారు.

స్త్రీలయందు స్వాతంత్ర్యాభిలాష పెరుగుచు వారు పురుషులతో సరిసమాన హక్కులను గోరుచున్నారు. కొందరు పాశ్చాత్యాచారముల యనుకరణమును గోరుచున్నారు. ఇట్టి దగత్యము కాదు. పాశ్చాత్యానుకరణోత్సాహమునందు వారు తరుచు హద్దు మీరిపోవుట కలదు.

అట్టివారేమి, వారికంటె కొంచెము మితభావాదర్శములు గలవారేమి, యుత్తమకార్యములు నిర్వహించుచు సంఘసంస్కరణమును కొనసాగించుచున్నారు. దురాచారములను వారు పారద్రోలుచున్నారు. స్త్రీలు కొందరు శాసనసభ్యురాండ్రై యున్నారు. వారికి మునిసిపలు సభ్యత్వములు కూడ కలవు. జిల్లాబోర్డు విద్యాసంఘములందు వారికి సభ్యత్వము లున్నవి. ఇవి కాక యెన్నియో గౌరవోద్యోగములు నెరవేర్చుచున్నారు.

రాజకీయరంగమునందును నారీమణులు వెనుకబడి యుండలేదు. వా రద్భుతత్యాగములు చేసి దేశోన్నతికి పాటుపడుచున్నారు. స్వదేశీ ప్రచారమునకు స్త్రీలెక్కువగ కృషిచేయుచున్నారు. అస్పృశ్యతానిర్మూలనమునకు వారు సర్వవిధముల పనిచేయుచున్నారు.

నేటి స్త్రీల సంచలనమును పాటించినప్పుడు వారు వెనుకబడి యుండలేదని తేలును. వా రసమర్థ

రాండైరి యుండ లేరు. పూర్వము వారియందట్టి భావము లుండినను ఇప్పుడవి యన్నియు పోయి వారభ్యున్నతికి ముందుకు దుముకుచున్నారనుట నిశ్చయము!

---

## సోవియటురష్యాలో స్త్రీలు

సోవియటురష్యా ఆధునికులకు యాత్రాస్థలమై పోయినది. ప్రిన్సుహాప్‌కిన్సు అను పాశ్చాత్య మహాశయుడీమధ్యనే తన రష్యాయాత్ర ముగించినాడు. కార్మిక యుగము (Labour Age) అను ఆంగ్లపత్రికలో 'రష్యాలో స్త్రీలు' అను శీర్షిక క్రింద హాప్‌కిన్సుగారిట్లు వ్రాయుచున్నారు:

"మేము వివాహములు, విడాకులు రేష్టరుచేయు కచేరికి వెళ్లినాము. ఆదేశములో వివాహములకు ఏమీ ఆడంబరము లేదు. వధూవరు లిర్వురూ కచేరికి వచ్చి తాము ౧౮ సంవత్సరముల వయస్సు దాటితిమని రుజువుచేయవలెను. ఏవిధమైన తీవ్రమగు వ్యాధులు లేవని రూఢిపరచి కొన్ని కాగితములు సంతకము చేయగానే వివాహము పూర్తియగును. రుజువులలో తకరారులకు మూడునెలల శిక్ష.

ఒకపోస్టుకార్డు సహాయముతో భార్యాభర్తలలో నెవరైనను విడాకులు పొందవచ్చును.

౧౬ సంవత్సరములవరకు పిల్లలను తండ్రియే పోషించవలెను. ఎవరి యాజమాన్యము క్రింద పెంచవలెనో కోర్టువారు నిర్ణయించెదరు.

తదితర పశ్చిమ దేశములలోవలె బహిరంగ ప్రదేశములలో స్త్రీపురుషులు అనుమానాస్పదములగు అన్యోన్యసంభాషణాది క్రియలలో ప్రవర్తింపరు. స్త్రీలు తమ సౌందర్య శృంగారాది విషయములపై నంత ఆసక్తి చూపరు. అత్తరులు, సువాసన తలనూనెలు, ముఖపు మెరుగులు, మొదలగు అలంకారద్రవ్యములు ఆదేశపు పట్టణములలో అంతవిరివిగా చలామణీకావు. మాతో యాత్రార్థమై వచ్చిన స్త్రీలు రషియను పురుషులెవ్వరూ తమను కన్నెత్తిమాడనైన లేదని విచారించుచున్నారు. కేళీవనములకు కూడ వెళ్లినాము. తక్కిన పాశ్చాత్యదేశములలో కేళికావనములందునూ, ఉద్యాన వనములందునూ, గుంపులుగూడిన స్త్రీపురుషులలో విచిత్రములయిన కామవికారములు గాంచుట పరిపాటి. కాని రష్యాలో స్త్రీపురుషు లట్టి నీచక్రియలయందు దాసక్తి చూపించునట్లు లేరు. అట్టి అవినీతులు సంఘములో నిరసింపబడును. ఆర్థిక పునర్నిర్మాణమునందు ప్రమత్తులై పనిచేయుచున్న ఆధునిక రషియనులకు అట్టి యప్రస్తుత చేష్టలు వికారముగ తోచును. స్త్రీపురుషులు అన్యోన్యలోలురు కారు. ఇట్టి నీతివంతమగు ఆరోగ్యచిహ్నములు అనేకము లీదేశమందు చూడవగును.

తరువాత "ప్రాఫిలాక్టోరియము" అను దుశ్చరిత్రలగు స్త్రీల రక్షణమందిరమునకు పోతిమి. దుర్వినీతలగు స్త్రీలను సన్మార్గములోనికి మరల్చి వారికి జీవనోపాధి కలిగించి సంరక్షించుటకు, సంఘ సంస్కారులగు దేశసేవకులచే ఈసంస్థ నిర్మింపబడినది. పోలీసువారికిగాని, ప్రభుత్వమువారికిగాని దీనితో నేమీ సంబంధములేదు. ఈసంఘసభ్యులు దేశములో ప్రచారము చేసి, వీధులు, వాడలు తిరిగి అట్టి స్త్రీలకు నీతిబోధగావించి రక్షణమందిరమునకు తీసికొనివత్తురు. జీవనోపాధిలేని పల్లెటూరి పడుచులే ఈవృత్తి నవలంబించుచుండిరి. రోగపీడితలై, చివరకనాథలై జీవములు చాలించుటతప్ప వీరికి వేరు తరణోపాయము లేదు.

రక్షణమందిరమువారు అట్టి వారిని గ్రహించి, రోగచికిత్స గావించి జీవనోపాధి చూపుచుందురు. మందు పుచ్చుకొను కాలములో పనిపాటులు చేయగలవారికి ఉదయము ౮గంటలు మొదలు సాయంకాలము ౪గంటలవరకు ఫ్యాక్టరీలో పనిచేయింతురు. గుంపులు గుంపులుగా ఒక్కచోట పనిచేసిన వారి కాభిజాత్యము కల్గునేమోనని వేరు వేరుగా పంపుదురు. కాయకష్టముచే పొట్టకు సంపాదించుకొనుటకు నేర్చుకొన్న రక్షణమందిరములోని స్త్రీలు తిరిగి దుర్మార్గమునకు మరలుట లేదు. పనిలేక సోమరులగు సంపన్నయువకులు వీరి నాదరించుచుండిరి. సంఘవైరులగు వారి నుండి ఈఅనాథలను వేరుచేయగానే ఈవృత్తి నెమ్మదిగా నశించుచున్నది.

౧౯౧౩ సంవత్సరములో మాస్కో పట్టణములో వ్యభిచారిణులు ౨౦,౦౦౦ మంది ఉండిరట. కాని ప్రస్తుతము వారిసంఖ్య ౪౦౦ మాత్రమే. ప్రబలమగు దుర్నీతి సమసిపోవుటకు సంఘసంస్కారులను సేవాసక్తియే కారణము.

మాస్కో జిల్లాలో నేడు ౬౦౦మంది వ్యభిచారిణు లున్నారు. వారుకూడ ఒక్కొక్కరే ఉచితవైద్య సహాయమునకై రక్షణమందిరమునకు వచ్చుచున్నారు. వచ్చినవారు తిరిగిపోవుటలేదు

కమ్యూనిజమ్ ప్రపంచమునకు పట్టిన పెద్దవ్యాధి యని ధనవంతులు మనకు బోధించుచున్నారు. కాని పై చెప్పబడిన సుగుణములవంటివెన్నియో కమ్యూనిజమ్‌లో కానవచ్చును.

---

## జర్మనీ వ్యవసాయపరిస్థితులు; రైతుల దీక్ష

భారతదేశ పరిస్థితులకును, జర్మనీదేశ పరిస్థితులకును ఎంతయో వ్యత్యాసము కలదు. జర్మనీ రైతులు తమవృత్తియం దప్రమత్తులై తదేకదీక్షతో నుందురు.. గృహ నిర్వహణమునను అటులనే ప్రవర్తించెదరు. భారత దేశపు రైతులు ఆ సదును పంట కాలములోనే వ్యవసాయము చేయుదురు. తక్కిన మాసములయందు ఊరక యుండవలసివచ్చును.

అందుచేతనే మహాత్ముడు చరఖామంత్రము నుపదేశించెను.

జర్మనీలో అటులు కాదు. వ్యవసాయమును ఒక వ్యాపారముగ వారు తలంపరు. ఆ వ్యాపారము లాభకరముగ నుండుట మానినవెంటనే దానిని విడిచిపెట్టరు. జర్మనీలో ముఖ్యముగ జాతీయపరిశ్రమలలో వ్యవసాయమును ఒకటిగ పరిగణింపబడుచున్నది. జర్మనీ యుద్ధమునకు పూర్వము వ్యవసాయము నిదానముగ యభివృద్ధిగాంచెను. అయ్యది తాత్కాలికముగ క్షీణించినను యుద్ధానంతరమున మరల నభివృద్ధి గాంచెను. పంట ఇంత ఎక్కువగా పండుటకు వారు క్రొత్తపద్ధతుల నవలంబించి క్రొత్తవ్యవసాయమునకు భూమి కొంచెముగ నుండుటచే ఆ కొద్దిపాటి భూమిలోనే ఎక్కువ పంటను బడయుటకు తోడ్పడు పద్ధతులను అవలంబించిరి. వ్యవసాయ సాధనము లన్నిటిని యభివృద్ధిచేసి క్రొత్త ఎరువులను ఉపయోగించిరి. ప్రకృతి పరిస్థితుల ననుసరించి పంటలను ఒక పంటవెనుక ఇంకొక రకపు పంటను పండించిరి. ఇట్టిపద్ధతులవలన పంట ఎక్కువయ్యెను కాని యుద్ధభారముచే ప్రజలు భూములపయి శ్రద్ధమాని కృషి తగ్గించుటచే భూమిసారము తగ్గెను. దానివలన ఏర్పడిన ప్రతికూలపరిస్థితు లింకను అంతరించలేదు. జర్మనీ అంతటను వ్యవసాయ పరిస్థితులు ఒకే రీతిగ లేవు. భూసారము శీతోష్ణపరిస్థితులు పంట విక్రయమగుటకున్న అవకాశములను బట్టి వ్యవసాయము సాగుచుండును.

జర్మనీలో తూర్పుభాగమున ఎండ లెక్కుడు విస్తారముగ నుండును. శీతోష్ణ పరిస్థితులు మారుచుండును. నిలకడగా నుండవు. ఈ ప్రదేశమున భూములు విస్తారముగ గలవు. మైదానములు మెండు. వ్యవసాయపు జిల్లాలలో పరిశ్రమలు లేవు. అందుచే జనసంఖ్య విస్తారముగ లేదు. చాలభాగములందు భూసారము అంత మంచిదికాదు. భూమి ఇసుకతో గూడుకొన్నది. మరి యితర స్థలముల మంచిపంటను ఇవ్వగల భూములు గలవు. ఉరలగడ్డలు ముఖ్యముగా పండును. మధ్యజర్మనీలోను ఫలవంతమగు తూర్పు జర్మనీ భాగములందును గోధుమలు చెఱకుపంటయు విస్తారముగ నుండును. పశ్చిమోత్తరజర్మనీలో చల్లగా నుండును. శీతోష్ణపరిస్థితులందు అంతగా మార్పుండదు. వేసవి అంత వేడిగా నుండదు. భూములు సారవంతములు గావు. బంజరుభూము లనవచ్చును. పట్టిగడ్డి, పచ్చిక, గుల్మములు తిను ఆహారము లభించును. ఈ ప్రాంతమందు ఇవే ముఖ్యముగ లభించును. పశువులు పందులు బాగుగ పెంచబడును. రైతుల ధాన్యపుపంట బహుస్వల్పముగ నుండును. ఎట్టి పంపకము లేకనే భూములు జ్యేష్ఠకొమారునకు దాఖలుపడును. శతాబ్దములకొలది ఆకుటుంబములోనే మంచిభూము లుండును.

జర్మనీ పడమర దక్షిణ భాగములందు పరిస్థితులు వేరు. ఈ ప్రదేశమున పర్వతములు మంచి ఆకర్షణీయమగు లోయలు కలవు. భూములు పెక్కు చీలికలుగ జేయ బడినవి. ఏకచెక్కలుగ నున్న భూములు తక్కువ. చిన్న చెక్కలే ఎక్కువ. కుటుంబములో పంపుళ్లచే ఇట్టి చిన్నచెక్కలు ఏర్పడుచుండుటవలన దక్షిణ పడమర జర్మనీలో పంట విక్రయమును అవకాశములు విస్తారముగ గలవు. లోయలలో మరింత అనుకూలముగ నున్నవి. రైనులోయలో ఫలములు, ద్రాక్షతోటలు చక్కగ పండును. రైనునది శాఖలు ప్రవహించు భూములయందు కూడ ఈపంట బాగున్నది. గోధుమ వ్యాపారము ఇచట విస్తారముగ నున్నది. కొన్నిచోట్ల పొగాకు పండును జర్మనీలో ౩,౮౧౦,౫౦౦ అశ్వములు, ౧౭,౩౯౬,౨౦౦ పశువులు, ౨౦౦,౮౨,౩౦౦ పందలు, ౩,౬౨౫,౬౦౦ గొఱ్ఱెలు కలవు. అడవులు చాల ముఖ్యము. ౧౯౨౮ జనాభా ప్రకారము జర్మనీలో ౩౧,౪౮౩,౭౪౭ ఎకరముల నేల అటవులతో నిండి యున్నది. చాలవరకు ఈ అడవులు ప్రభుత్వపాలనము నందే కలవు. జర్మను ప్రభుత్వ అటవీపాలన పద్ధతులు ప్రపంచ మందు ప్రసిద్ధిగాంచెను. ప్రత్యేకముగ వీటిని నేర్చుకొనుటకు విదేశీయులు జర్మనీకి పోయెదరు.

వ్యవసాయపరిపాలనము తత్సంబంధమగు పను లన్నియు వ్యవసాయసంఘమువారి హస్తంగత మైనవి. అనేకరకముల వ్యవసాయపాఠశాలలు ఎన్నియో కలవు. వ్యవసాయకళాశాలలందును, విశ్వవిద్యాలయము లయం దును వ్యవసాయవిద్య నేర్పెదరు. వీటిలో ప్రత్యేకముగ వ్యవసాయశాఖల నేర్పాటుచేసిరి. వ్యవసాయపరిశోధ నలు ఈసంస్థలలోనే గాక ఇతరసంఘములవారిచే కూడ జరుపబడుచున్నవి. ప్రభుత్వమువా రెంతయు ఈ విషయమై శ్రద్ధవహించుచున్నారు. ఇటీవల జర్మనీ వ్యవసాయపంటసరుకులను ఎంతయో యభివృద్ధిచేయు టకు ప్రభుత్వమువారు విశ్వప్రయత్నములను సల్పిరి. వ్యవసాయదారులు చాల ప్రతికూలముగ ఏర్పడుట చేతను పన్నులభారము హెచ్చిపోవుటచేతను ౧౯౨౩ నుండి వ్యవసాయము కష్టదశయం దున్నది.

ప్రతిసంవత్సరము వ్యవసాయ ప్రదర్శనములు జరుగును. ముఖ్యముగ జర్మను వ్యవసాయసంఘమువారు తమ ప్రదర్శనములను గావించెదరు.

---



చెలిమి కలిమి   డాక్టరు మోహనరంగంగారు తీసినఫోటో.




## శ్రీ అంకాల వెంకటసుబ్బరావుగారు



ఆంధ్రదేశమున నెన్నికగన్న చిత్రకారులలో నొకరగు శ్రీ అలంకాల వెంకటసుబ్బరావుగారు భీమవర నివాసులు. అచ్చటి ఉన్నతపాఠశాలయందు చిత్రకళా బోధకులుగ నున్నారు. నవీనభారతీయచిత్రకళావైఖరి ననుసరించి నీటిరంగులతో 'మోహిని,' 'బావిచెంత,' 'అచ్చర,' 'తక్షక,' 'శ్రీమహావిష్ణు,' 'దివ్యనృత్తము', 'పురుషోత్తమ,' 'పుండరీకాక్ష' మొదలగు చిత్రములను రచియించిరి. వీరిచిత్రములు బొంబాయి, బెంగుళూరు, ధార్వాడ, రాజమహేంద్రవరము, చెన్నపురము మొదలయిన నగరములయందు జరిగిన చిత్రప్రదర్శనముల పొగడ్తను గనినవి. రెండుమూడు బహుమతులను బడసినవి. రెండుచిత్రములు మైసూరుదివాణము నలంకరింప విక్రీతములయినవి. 'మోహినీ,' 'బావిచెంత' అనుచిత్రములు భారతియందును, 'అచ్చర' అనుచిత్రము ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికయందును ప్రకటితములయినవి. వీరిరేఖాచిత్రములు కొన్ని భారతియందు ముద్రితములయినవి. ఇతోధికసుందరచిత్రముల నీచిత్రకారుని తూలిక సృష్టింపగలదను సూచనలు తచ్చిత్రములయందు కానుపించుచున్నవి.

---

## శ్రీ కె. రఘురామయ్యగారు



లక్నో విశ్వవిద్యాలయపుటాంధ్రవిద్యార్థి. అఖిల భారతవిశ్వవిద్యాలయోపన్యాసముల పోటీయందు జయము బడసినవారు. వీరికి ప్రథమబహుమతి బంగారుపతక మొసగబడెను.

---

**శ్రీ యస్. వి. యస్. రామారావుగారు**



చెన్నపురపు లలితకళాసంఘమువారి నలుబదేనిమిదవ చిత్రప్రదర్శనమున సుద్దరంగులతో (Pasters) వీరు చిత్రించిన రూపచిత్రమునకు లలితకళాసంఘమువారి ప్రథమబహుమతి (రూ. 50) లభించినది.

---

**శ్రీ న్యాయపతి శ్రీనివాసరావుగారు**



ఈమధ్యనే విశాఖపట్టణమునందు జరుపబడిన అఖిలభారతస్వదేశీ వస్త్రాదిప్రదర్శనమున వీరికి శిల్పమునకుగాను ప్రథమబహుమాన మొసంగబడినది. మఱియు అద్దపుచట్రములపైవేసిన వర్ణచిత్రములకై యొకప్రశంసాపత్రముకూడ వీరి కొసంగబడినది.

---








తూములూరి శివకామయ్యగారు

నెల్లూరుపుర నివాసు లగు శ్రీ శివకామయ్యగారు (క్రిందిచిత్రము) కాళ్లకూరి గోపాలరావుగారు రచియించిన 'వాల్మీకి' నాటకమున 'ప్రాచేతస' పాత్రమును (కుడివైపు చిత్రము), శ్రీ గుండిమెడ వెంకటసుబ్బరావు రచియించిన 'ఖిల్జీ రాజ్యపతనము' నాటకమున 'ఖిజీర్' పాత్రమును ధరించిరి. పైన పేర్కొనినపాత్రము లా నాటకములయందు ప్రధానపాత్రములు. ప్రధానపాత్రనిర్వహణము సమర్థు డగు నటకునికిమాత్రమే సాధ్యము గాగలదు. శివకామయ్యగారు ప్రధానపాత్రములను ధరించి రంగమున కెక్కిరన్న వారి సామర్థ్యమును వేరుగ పేరుకొను టనావశ్యకము.






శ్రీమతి రెడ్డి లక్ష్మమ్మగారు

పత్తికొండతాలూకా కో-ఆపరేటివుసంఘములకు అధ్యక్షురాలు, కో-ఆపరేటివు బ్యాంకికి డైరెక్టరు నయిన యీ శ్రీమతి కర్నూలుజిల్లాబోర్డు మెంబరుగా నియమింపబడెను.

---



శ్రీమతి ఆచార్య సతిగారు

ఈమహిళామణి చెన్నపురమున గౌరవన్యాయాధికారిణిగా నియమిత యయ్యెను.

---




## స్వప్నము

గ్రంథకర్త: నందివాడ కామేశ్వరరావు గారు, బి. యే., కాకినాడ.

రాయలు ౧౬ సైజు, ౪౫ పుటలుగల చిన్న నాటకము. తలిదండ్రులు మొదలగు ఇరుగుపొరుగు దంపతుల ప్రేమచర్యలు సంభాషణములు చూచుటవలనను వినుటవలనను క్రీడాప్రాయమగు ౭-౧౨ సంవత్సరములలోనే బాలురకును బాలికలకును శాశ్వతవివాహప్రేమయొక్క అంకురము ఉదయించునని చూపుటకే ఈగ్రంథము వ్రాయబడెనని తోచుచున్నది. కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల తెలియదు. గ. స.

---

## My Experience as A Legislator:
## (నాయొక్క శాసనసభానుభవములు)

వెల రు. ౨-౦-౦.

డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి సతీమణిగారు, బి. యే., ఎమ్. బి. సి. యమ్.

తా మెట్టిసందర్భములలో శాసనసభ్యురాలును శాసనసభా ఉపాధ్యక్షురాలును నైనదియు, యేయే బిల్లులవిషయములో నెట్లు ప్రసంగించి శ్రమపడినదియు ఆంగ్లేయభాషలో డెమ్మీసైజున సుమారు ౨౫౦ పుటలలో విస్తరించి వ్రాసినారు. ఆమెయొక్క దేశాభిమానము, స్త్రీజనోద్ధరణాభిలాష, ఆరోగ్యవిషయముల యందలి శ్రద్ధ, నవీనభావ తరంగములయందు పక్షపాతము, మొదలగు లక్షణము లిందు అందముగ వ్రాయబడినవి. శైలి సుమధురము, సులభము, ధారాతుల్యము నైయున్నది. దీనిని పఠించినవారికి మంచి రాజకీయపరిజ్ఞానము కలుగును. మదరాసు కరెంటుథాటు ముద్రణాలయమున, (ట్రిప్లికేను) ముద్రితము. గ. స.

---

## శ్రీగౌతమక్షేత్ర (బుగ్గ) మాహాత్మ్యము

గ్రంథకర్త: శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు, క్రిస్టియను కళాశాల, మద్రాసు. క్రౌను సైజు సుమారు ౧౪౦ పుటలు. వెల రు. ౦-౧౦-౦.

మునివర్యుడగు గౌతముడు తనసతికిని ఇంద్రునకును శాపములిచ్చి తీర్థయాత్రాపరుడగుటయు, ప్రమాదవశమున గోవును సంహరించుటయు, దానిని బ్రతికించుటకు తపస్సుచేసి గౌతమిని భూలోకమునకు రప్పించుటయు, గౌతమీప్రవాహము, తత్తీర పుణ్యక్షేత్రముల మాహాత్మ్యము, మొదలగు విషయములు సులభమగు శైలిలో శివభక్తిరసపోషకముగ వ్రాయబడినవి.

గ. స.

---

## దస్తావేజుల మతలబులు

గ్రంథకర్త: కర్లపాలెం కృష్ణరావుగారు. డెమ్మీ సైజు ౭౦ పుటలు. వెల రు. ౦-౧౨-౦.

ఇందు నోట్లు, రసీదులు, అద్దెచీట్లు, తనఖాలు, క్రయచీటులు, పట్టాట్రాన్సుఫరులు, దత్తతాధికారములు వగైరా ౩౦ విధముల పత్రములకు మతలబు లున్నవి. ఇది వ్యవహారస్థులకు చాలా ఉపయోగకరము. సాధారణజనులు కూడ వీని ననుసరించి తమ వ్యవహారములు చేసుకొన్నచో వ్యవహారస్థులవలన నెట్టి దగా కాని

కలుగకుండ చూచుకొనగలరు. పులిపాటి రంగయ్య, బుక్కుసెల్లరు, చీరాలకు వ్రాసి, పుస్తకములను బడయ నగును. గ. స.

---

## కిశోరవీరులు

## ( Wolf Cubs )

గ్రంథకర్త: పరిగె వెంకటరమణ రావుగారు, బి. ఏ., బి. ఇడి. క్రౌను సైజు ౭౬ పుటలు.

ఇది బాలభటులకు శిక్షణము నొసగగోరు వివిధ పాఠశాలల ఉపాధ్యాయులకు మిగుల ఉపయోగకరము. ఇందు దీక్షాస్వీకారము, తరగతులు, డ్రిల్లు, చిహ్నములు, ముడ్లు, ఆరోగ్యవిధులు, దేశీయగీతములు, ప్రథమసహాయములు మొదలగు విషయములు తేటతెనుగున వ్రాయబడినవి. ఏలూరు రామకృష్ణవీరసమూహము వారిచే ప్రకటితము. గ. స.

---

## మనస్స్వాతంత్ర్యము—ప్రథమభాగము

## (Rationalistic Free Thought)

గ్రంథకర్త: పల్లూరి సూర్యనారాయణరావుగారు, బి.ఏ., బి.యల్., యల్. టి., అడ్వోకేటు, కొవ్వూరు. క్రౌనుసైజు, ౧౬౦ పుటలు. వెల రు. ౦—౮—౦.

అప్పుడప్పుడు పత్రికలకు వ్రాసిన వ్యాసముల నిట్లు సంపుటముగా ప్రకటించినారు. మతములను, ఆధ్యాత్మికశక్తిని, దైవప్రార్థనమును, దైవమును, దయ్యములను, పూజలను, కర్మకాండను మొగమోటమి లేకుండ ఖండించి కృతకృత్యులైనారు. అనేకమంది విద్యాహీనులును విద్యాధికులును గూడ ఇట్టిభావములకు లోనౌదురని యెఱిగికూడ తమ విశ్వాసములను ఢంకామీద దెబ్బకొట్టినట్లు ప్రకటించినారు. భౌతికశాస్త్రవేత్తలే మనకు ప్రమాణముకాని ఆధ్యాత్మిక చింతనాపరులు వట్టి భావదాస్యమునకు భాజనులై ప్రపంచమును దాస్యభావమున ముంచుచున్నారని వీరి వాదన. భగవంతుడు కర్మలను తప్పించలేకపోయినపు డతనిని ప్రార్థించుట వ్యర్థమనుచున్నారు. అసలు భగవంతు డెవడు? ప్రకృతి యుండగా వేరొకపురుషుని యొక్క యావశ్యకత యెచ్చట? అనికూడ ప్రశ్నించుచున్నారు. దయ్యములయందుండు భీతియే పితృపూజకు తద్దినములకు పునాదియనియు వ్యాసాదు లెల్లరును పొరబడినవారి యనియు మోక్షాసక్తి స్వార్థప్రేరితమనియు భౌతికసంపదను వృద్ధిపరచుకొని సుఖసల్లాపముల నోలలాడుచుండుటయే మానవజీవితమునకు పరమావధియనియు పురాణాదులను వ్రాసినవారు తమ కేమియు తెలియకున్నను తెలిసినట్లు నటించియో నమ్మియో పుక్కిటికథల నల్లి సృష్టి మొదలగు వానిని గూర్చి వింతవింత సిద్ధాంతములు వ్రాసినారనియు ఆఖరుమాట దైవవిశ్వాసమువల్ల జనించు ఆనందము కంటె అతనిని గూర్చి కాని తత్సంబంధ సిద్ధాంత గ్రంథములను గాని విశ్వసింపకుండ వర్తించు మనస్స్వాతంత్ర్యమునందే యెక్కువ సౌఖ్యము, శాంతి, ఘనత యున్నవనియు సెలవిచ్చిరి.

గ. స.

---

## ౧. శివతారావళి

చిన్నసైజున ౧౫ పుటలు. వెల తెలియదు.

పద్యములు. భక్తిరసపూరితములు. ఆశువుగ రచింపబడినవి.

## ౨. రామామృతము

పద్యములు. ఆశురచనములే. చిన్న ౬ పుటల పొత్తము. వెల తెలియదు.

## 3. స్నేహలతా కవితాసంఘము

క్రౌనుసైజున ౪౮ పుటలు. వెల తెలియదు.

పై మూడుపుస్తకములును శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయడు గారు, బి. ఏ. (ప్రెసిడెంటు, స్నేహలతా కవితాసంఘము, కొల్లాపురం, జటప్రోలు సంస్థానము) రచించినవి.

మానవప్రకృతి అనాదినుండియు కేవల భౌతికశక్తుల పరిణామములను ప్రత్యక్షముగ చూచి తృప్తినొం

ఢక దాని కతీతమగు శక్తిని ఆనందమును గోరుచు పరితపించుచున్నది. తనకొసంగబడిన ఇంద్రియాదులమూలముననే ఇంద్రియాతీతమగు జ్ఞానము నెఱుంగ ప్రయత్నించుచున్నది. కేవల మైహికసుఖపరాయణులగు భోగులు, ఈప్రపంచమును ఇందలి స్థావరజంగమములునే సర్వమును అనుకొను పరిమితజ్ఞానసంతృప్తులు, తప్ప తక్కినవారందరును ఆమహాశక్తియొక్క అనుభవముకొరకు, ఇం దువ్విళు లూరించు మోహములను, వాంఛలను, విశాలతరమానవసేవాసంకల్పములను గూడ అతిక్రమించి, తపశ్శాలులై ఆధ్యాత్మిక చింతానిమగ్నులై విరాగులై తామనుకొన్న ఈశ్వరశక్తి సాక్షాత్కారమునకై ప్రయత్నించి అనుభవములంది, వానిని ప్రపంచమునకు చాటినారు. ఇంద్రియాతీతజ్ఞానమును ఇంద్రియజన్యజ్ఞానమునకు నచ్చునట్లు సామాన్యభాషలో వ్రాయుట కష్టము కనుక అనేకకల్పనాలంకారములతో గూడి ఆ అనుభవములు వెలువడినవి. వాని నన్నిటినితూచా తప్పకుండ భౌతికపరముగ అర్థము చేసుకొన్నచో అజ్ఞానమునకు భావదాస్యమునకు బాల్పడకమానము. ఆధ్యాత్మిక జ్ఞానాసక్తు లట్లు చేయక ఆసంకేతముల అర్థము నెరిగి అందలి సూక్ష్మ రహస్యములను మాత్రమే పాటింతురు. దీని నెఱుగుట మొట్టమొదట సాధ్యముకాదు. అంతమాత్రమున వాని నసలే త్రోసిపుచ్చుట అవివేకము. బహుకాలపరిచయ, పఠన, మనన ధ్యానముల వలన నది లభ్యమగును. సాధ్యమైనంతవరకు వానిలో కొన్ని భౌతికశాంత సౌఖ్య జీవనమునకు కూడ సరిపడునట్లును ఆధ్యాత్మికాధిభౌతికములకు సామరస్యము కూడునట్లునే ఉన్నది. ఆధ్యాత్మికపు గొడవలే మాకక్కరలేదు, తత్ప్రయత్నములు చేసినవారును వారి సాక్షాత్కారములును వట్టిబూటకములు, అనువారితో మాకు వాదనయే లేదు. అసలు చర్చనీయమగు విషయములోనే అంగీకారము లేనప్పుడు చర్చ యెందులకు? ఒకరినొకరు మూర్ఖులనియు, మూఢులనియు, తిట్టుకొంటకా? ఇరువురియొక్క దృష్టిలోనె ఆశయములోనె భేద మున్నది. ఎవరంతట వారు తమ కార్యకలాప సంకల్పములయందు ఉన్ముఖులై యుండుటయే కర్తవ్యము.

లోకమును సంస్కరించు సంకల్పముతో ఇరువురును తమ విశ్వాసముల ప్రచారము చేయవచ్చును. వద్దన్నమానువారు లేరు. ఎవరి నైజముకొలది వారు ఆయా బోధనలకు వశ్యులగుదురు. సచ్ఛీలము కలిగినచో కాణాదుడు కపిలుడు, హక్స్లి, డార్విను, స్పెన్సరు, హ్యూము, మిల్లు మొదలగు భౌతికవాదులు దూష్యులగు నాస్తికులు కారు. జ్ఞానవంతులగు వ్యాస, వాల్మీకి, విద్యారణ్య, శంకర, మాధ్వ, రామానుజాచార్యులును మూర్ఖులు కారు. మనయజ్ఞానముచేతనో ఆశయభేదముచేతనో మనము వేఱుత్రోవ బడి అన్యులతత్త్వములను గ్రహింపలేక వారిని పాపులనిగాని, మూఢులనికాని, బూటకములవారనికాని నిందించినచో మన కది యేమాత్రమును అందమును చేకూర్పదు.

ఇక పాఠశాలలలోని విద్యార్థుల కేమి చెప్పడమా? అని ప్రశ్న. పూర్వకాలములో ఆధ్యాత్మికజ్ఞానమునం దెక్కువ గురి యుండెడిది. కనుక బాల్యమునుండియు గురుకులములందు విద్యను తత్సంప్రదాయముల ప్రకారము నేర్పెడివారు. నేడు భౌతికజ్ఞానమునే ప్రధానముచేసుకొని ప్రభుత్వములు బలవంతములై, అదిలేనివారిని భౌతికశక్తులతోను, తజ్జన్యములగు ఆర్థికశక్తులతోను పీడించుచున్నవి. కనుక, స్వయంసంరక్షణార్థమైనను భౌతికశక్తుల నారాధించి వశపరచుకొని శ్రీమంతులమును బలవంతులమును నై భౌతికశక్తులతో పరులను పీడించకున్నమానె (ఇది మహానాగరికత), మనము పీడింపబడి నశింపబడకుండనైన నుండవలెను. కనుక ఈ విద్యయే పాఠశాలలలో నేర్పవలెను. ఆధ్యాత్మికజ్ఞానమును జనులు తమ యిండ్లలోను, సంప్రదాయములలోను, గురువులదగ్గరను నేర్చుకొందురు. అక్కడ కూడ నేర్చుకొనకుండ మా విద్యాశస్త్రమును ప్రయోగింతుము చూడండని బోల్షివిక్కు ప్రభుత్వమును ప్రయోగింపవలచుకొన్నచో సర్వమును ఈశ్వరుడు నిర్ణయించినట్లే యగును.

గ. స.

---

## హరిజనుల పాటలు

సుప్రసిద్ధ జాతీయగీతముల ననేకము రచించి పేరొందిన శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు వ్రాసినవి. డెమ్మీసైజున ౧౫ పుటలు. వెల రు. ౦-౨-౦.

ఇందు గాంధీమహాత్ముని యుపవాస ప్రారంభసమయమున పాడబడిన హిందీపాటయు, అందుకు ఆంధ్రానువాదమును, 'హరిజనులము' 'జ్ఞానోదయము' 'నూతనతేజము' 'ప్రార్థన' 'హిందూసంఘీయులము' అస్పృశ్యతాసిద్ధాంతనిరసనము' 'వింతసనాతనమతము' 'ఎటువంటి మాలలము' 'క్రొత్తతీరులు' 'సర్వసమత్వము' 'భారతదేశప్రతిభ' 'రామనామ మంత్రోపదేశము' అనుపాటలు కలవు. దొరకుచోటు :—గ. సత్యనారాయణగారు, బి. ఏ., 5 కచ్చేరిలేన్, మైలాపూర్, మద్రాసు.

---

## నాటక మర్మము

శ్రీ పోరంకి వెంకటసుబ్బారావుగారిచే రచింపబడినది. సంపాదకుడు యేలూరిపాటి వెంకట సత్యనారాయణగారు, తాళ్లపూడి, పశ్చిమగోదావరి. క్రౌనుసైజున ౧౫౬ పుటలు. వెల రు. ౦-౮-౦.

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు దీనిగూర్చి యిట్లనిరి "చిరంజీవి సుబ్బారావుచే రచింపబడిన 'నాటక మర్మము' అచ్చుపడకమునుపే నేను ఆమూలాగ్రముగ వింటిని. ఈనాటి నాటకసమాజములలోని సభ్యులు చేయునట్టి అపకృత్యములన్నియు ఇందు వెలిపుచ్చబడినవి. నవలవలె నిది చదువుకొనుట కెంతో మనోహరముగ నున్నది."

---

## నారదోపన్యాసములు

కర్త: పిశిపాటి సత్యనారాయణగారు, రిపోర్టర్, "రంగూన్ డెయిలీన్యూస్," ౧౫౫-౪౦-వ వీధి, రంగూన్. క్రౌనుసైజున ౧౧౪ పుటలు. వెల రు. ౦-౬-౦.

"ఐరావతి" యను రంగూనులోని తెలుగు వారపత్రికాముఖమున నప్పు డప్పుడు లోకవ్యవహారములను గురించి వెలువడిన కొన్ని విమర్శ లిట్లు సంపుటీకరింపబడినవి.

---

# గ్రంథస్వీకారము

## సాంబోపాఖ్యానము

రామరాజు రంగప్పరాజకవి ప్రణీతము. ఇది శ్రీ పైడా వెంకటాచలపతి తెలుగు అముద్రితగ్రంథ ప్రచురణనిధి నుండి ముద్రితమయిన మొదటి పుస్తకము. ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారిచే (కాకినాడ) ప్రకటింపబడినది.

రాయల్ సైజున ౨౦౦ పుటలు. గట్టిఅట్ట బైండు. వెల రు. ౧-౦-౦.

---

## భగ్నకుంభము

టి. యల్. అహోబలాచారిగారి ఏకాంక ఆంగ్ల నాటకము ననుసరించి వ్రాయబడినది.

గ్రంథకర్త: చిట్టూరి సత్యనారాయణ చౌదరిగారు. గుంటూరులోని ఆర్యవైశ్యప్రెస్‌నందు ముద్రితము.

క్రౌనుసైజున ౧౨ పుటలు. వెల తెలియదు.

---

## భక్తజీవనము

గ్రంథకర్త: పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు. ప్రకాశకులు, పెదపాలెము లోని సేవాశ్రమమువారు. ఇది సేవాశ్రమ గ్రంథమాలా ప్రథమకుసుమము, ౧౯33 ప్రచురము.

ఇది భక్తప్రబోధకములగు దైవప్రార్థనములు గల సంపుటీకరణము. ఇందు అష్టోత్తరశతప్రార్థనములు గలవు. ఫూల్‌స్కేప్ 1/16 సైజున ౭౪ పుటలు. ఆంటిక్ టైపు. సుందరమగు బైండు. వెల ౦-౫-౦.

---

## చారుచర్య

పద్యకావ్యము. క్షేమేంద్రుని సంస్కృతమునకు తెనుగు. శతశ్లోక పరిమితము. ఒక్కొక్కశ్లోకము నొక్కొక ఇతిహాసమును సూచించును.

అనువాదకుడు: శ్రీమక్కపాటి వేంకటరత్నకవి గారు కవితావిలాసము, అనమనమూరు అగ్రహారము, గుంటూరు జిల్లా. ఈపొత్తము శారదారత్నమాలా తృతీయ రత్నము. క్రౌనుసైజున 30 పుటలు. వెల ౦-౬-౦.

---

## శ్రీ గాంధిదండకము, పద్యములు

రచయిత, బి. ఆంజనేయులుగారు. చిన్నిసైజున ౨౦ పుటలు. వెల ౦-౧-౦.

దొరకుచోటు: వారణాసి వీరరాఘవస్వామి, పొన్నూరు, గుంటూరుజిల్లా.

---

## సుమవల్లి

గ్రంథకర్త, 'కవిమిత్రులు.' శ్రీయుతులు రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి, కలపటపు రామగోపాలరావు, కొమరవోలు వెంకటసుబ్బారావు, కాశిరాజు రామమోహన శర్మ, పప్పు వెంకటసుబ్బారావుగార్ల తెనుగుపద్యములును, పి. కుమార్, కె. ఆర్. గోపాల్, ఆచంట వెంకటరామారావుగార్ల ఆంగ్లకవనములును, ఈ పుస్తకమున గలవు. కాకినాడ రంగాఅండ్ కో. వారిచే ముద్రింపబడినది. క్రౌనుసైజున ౨౪ + ౧౧ పుటలు. వెల తెలియదు.

---

## కలువలు

ఖండకావ్య సంపుటి. కర్త, ఉేకుమళ్ల కామేశ్వరరావుగారు, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరం. క్రౌనుసైజున 3౯ పుటలు. ౧౯33 జనేవరి ప్రచురము. వెల ౦-౪-౦.

---

## యోగదర్శని

శ్రీఅరవిందయోగి విరచితమయి "The Yoga and Its Object" అను పేర ఆంగ్లమున వెలసిన గ్రంథమునకు ఆంధ్రానువాదము. రాజమహేంద్రవరములోని వీరభద్రపురమునందలి భారతశక్తి నిలయమువారిచే దువ్వూరిరామకృష్ణారావు గారు, బి. ఏ. ద్వారా ప్రకాశితము.

సంపాదకులు: స్వామి శుద్ధానందభారతి, మంగిపూడి పురుషోత్తమశర్మగార్లు. డెమ్మీ ౧ పుటల సైజున ౮౯ పుటలు. చక్కనియచ్చు, ముచ్చటయినబైండు. వెల ౦-౬-౦.

---

## సుభాషితరత్నాష్టోత్తర శతకము

కర్మభక్తిజ్ఞాన నీతిబోధకము.

కర్త: ఊటుకూరు వేంకట గోపాలరావు గారు రిటైర్డు తహశీల్ దారు, బరంపురం, గంజాం జిల్లా.

ఫూల్ స్కేపు చిన్నసైజున ౨3 పుటలు. వెల తెలియదు.

---

## హృదయవిహంగము

భావగీతములు. గ్రంథకర్త: రెండుచింతల లక్ష్మీనరసింహ శాస్త్రి గారు, కాకినాడ. క్రౌనుసైజున ౨౬ పుటలు. వెల తెలియదు. కాకినాడ, రంగాఅండ్ కో. లో ముద్రితము.

---

## మహేశా

౧౦౧ కంద పద్యములు. కర్తలు, వేం.వీ.కవులు, విశాఖపట్టణము.

ఫూల్ స్కేపు చిన్నసైజున ౨౧ పుటలు. వెల ౦-౧-౦। ప్రతులకు, శ్రీయుత పూసర్ల నారాయణమూర్తి గారు, కొత్తపేట, విశాఖపట్టణము, అని వ్రాయవలెను.

---

## హంపీ క్షేత్రము

శ్రీ. శే. కొడాలి వెంకటసుబ్బారావు గారు, బి. ఏ. శ్రీ కామరాజుగడ్డ శివయోగానందరావు గారి పేరునుకూడ చేర్చుకొని భారతిలో ప్రచురించియుండిన పద్యకావ్య మిప్పు డీగ్రంథరూపమును దాల్చినది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారీగ్రంథమున కొక సవిమర్శముగు 'ప్రవేశము' ను గూర్చిరి.

క్రౌను సైజున ౪౪ పుటలు. మంచి అందమగు బైండు. వెల ౦-౧౦-౦. ప్రతులు వలయువారు, కొడాలి శివరామకృష్ణరావుగారు, ఆంధ్రపత్రిక ఆఫీసు, జి. టి. మద్రాసు అని గాని, విశ్వనాథ వెంకటేశ్వర్లుగారు, కృష్ణపత్రికాఆఫీసు, బందరు అనిగాని వ్రాయవలయును.

---

## శ్రీరామచక్రవర్తి

అనబడు

## కోసల సామ్రాజ్యము

శ్రీరామచక్రవర్తిని గుఱించిన యాఱంకముల నాటకము. కర్త, ఇదివరలో "మణిహారము" అను నవలను రచియించిన శ్రీ బులుసు వేంకటసుబ్బారావుగారు, బి.ఏ., బి.యల్., వకీలు, కాకినాడ. క్రౌనుసైజున ౧౬౪ పుటలు గలది. వెల ౦-౧౨-౦.

---

## కథాగుచ్ఛము

## (మూడవ భాగము)

విశ్వకవి రవీంద్రనాథ్ఠాకూర్ విరచితము. తెనుగు అనువాదము. ప్రకాశకుడు కారుమూరి వైకుంఠరావు గారు, ౩౨౩ తిరువత్తూర్ హైరోడ్, మద్రాసు. విశ్వభారతి చెన్నపురి ఏజెన్సీ వారి ౮-వ ప్రచురము. ౧౯౩౦. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, ౨౯-౨, ఎస్ప్లనేడ్, చెన్నపురి,ఈ. వద్ద ఈగ్రంథము వెలకు దొరకును. ఈసంపుటము నందు అక్క, చిన్క, నోటుబుక్కు, రామకనయుని బుద్ధిహీనత, నగదు, హేమమృగము, అతిథి, దాన ప్రతిదానములు, చివరరాత్రి, దాలియా, అనధికార ప్రవేశము,అను పదునొకండుకథలు ఉన్నవి. క్రౌనుసైజున ౨౩౦ పుటలు. వెల ౧-౪-౦.

సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ ముకుళదేవు విరచితము శ్రీ రవీంద్రనాథఠాకూరు గారి స్కెచ్ ఒకటి ఈసంపుటము ముఖచిత్రమయి యలరారుచున్నది.

---



దాహము

డాక్టరు మోహనరంగంగారు తీసిన ఫోటో.

---

# మనవిమాటలు

## గుంటూరుమండలము : గ్రంథాలయములు

గుంటూరుమండల గ్రంథాలయసంఘము గుంటూరుమండల గ్రంథాలయచరిత్రను (ప్రజోత్పత్తి) ప్రకటించినది. ఆమండలమున నేడున్న యెనుబదియొక్క గ్రంథాలయముల సంగ్రహచరిత్రము లిందు గలవు. ఆంధ్రదేశమున నాదిమ గ్రంథాలయ మీమండలముననే ఒంగోలునందు ౧౮౭౪-వ సంవత్సరమున స్థాపితమయియుండుట ప్రశంసార్హము. తరువాత నీమండలమున కొన్ని గ్రంథాలయములు మొలకలెత్తినవి. ౧౯౧౬-వ సంవత్సరమున మండలగ్రంథాలయసంఘ మేరుపడినది. తత్కృషివలన తదనంతర మింకను గ్రంథాలయములు పెరిగినవి. నేడున్న ౮౧ గ్రంథాలయములలో ౫౫ ౧౯౧౬ కు తరువాత పుట్టినవే. సంఘము పుట్టినది మొదలు ౧౯౨౧ వఱకు ఏటేట మండలగ్రంథాలయమహాసభలను జరిగి గ్రంథాలయాభివృద్ధికి చాల తోడుపడినవి. ౧౯౨౧-వ సం. నాటికి గ్రంథాలయములు ౧౩౬ దాక పెరిగినవి. తరువాత నవి క్రమముగ తరుగుచువచ్చి యీచరిత్ర ముద్రణకాలమునాటికి—నేటికిని *౮౧ మిగిలినవి. మరల నీగ్రంథాలయసంఘము ౧౯౩౧ వ సంవత్సరమున మండల గ్రంథాలయమహాసభను జరిపినది. ప్రతిగ్రామమునందును జీర్ణగ్రంథాలయముల నుద్ధరించుటకును, నూతన గ్రంథాలయములను స్థాపించుటకును అందుద్దేశింపబడినది. తపను గుణముగ నీసంఘము మండలమున గ్రంథాలయములను విరివిగ స్థాపించుటకు ప్రయత్నింపవలసియున్నది. ఇట్టి సంఘములు ప్రతిమండలమునకు నావశ్యకములు. వీని ద్వారా ఆగామండలముల గ్రంథాలయములు పెరుగుట కవకాశముండును. ఈగ్రంథాలయచరిత్రమువలన గుంటూరు మండలమున గ్రంథాలయములు, వాని ఆయతి, వాని యందలి గ్రంథములసంఖ్య, వానిపని, ఆంధ్రలోకమునకు వెల్లడియగుచున్నవి. తక్కినమండలములవారు ఈమండల కార్యమును మార్గదర్శకముగా స్వీకరింపదగుదురు.

గ్రంథాలయాభివృద్ధికి ప్రజాసామాన్యము విద్యావంతమగు టావశ్యకము. విద్యాసంపన్నులుకాని ప్రజలు గ్రంథాలయములవలని లాభములను గుర్తింప జాలరు. గ్రంథాలయస్థాపనము సులభముగనే కావచ్చును. తత్పోషణము సుకరముకాదు. వానివలని లాభము నెరిగిన ప్రజలు కావించుకొనవలసి యుందురు. నేటి విద్యావిధానమున ప్రజలెల్లరు విద్యావంతులు కావగు నవకాశములు మృగ్యములు. అత్యధికవ్యయప్రయాసములకు లోనయి పట్టములను పొందియు, ఉద్యోగములు లభింపక పరితపించుచు స్వపరార్థదూరులు, ఉత్సాహహీనులు నయి యూరూర దిరుగుచున్న యువకు లెందరో నేడు ప్రతిమండలమునను గలరు. వీరు తలపెట్టినచో ప్రజలెల్లరు విద్యావంతులు కాదగు నవకాశ మేర్పడును. వీరిలో జీవనోపాధి యేపాటియేని గలవారు, దాస్యదైన్యములకు పుట్టినిండ్లయిన యుద్యోగములకయి పరుగులువారక విద్యావిహీనులగు దేశీయులకు విద్యాదానము చేయుట వివేకము. జీవనోపాధిలేనివారి కిది జీవనోపాయముకూడ కాగలదు. ఇట్లుభయతారకమగు కార్యమును నిర్వర్తింప వారు పూనినచో ప్రజలెల్లరు విద్యావంతులు కాగలుగుదురు. అపుడు గ్రంథాలయ సౌధము చిరస్థితికి గట్టిపునాది యేర్పడగలదు.

తదుపరి సొంతభవనము, సమీచీన గ్రంథసంచయము, ప్రజోపయోగి వివిధవిషయపరిజ్ఞాతయు, పండితుడు నగు నధికారి, మూలధనము, గ్రంథాలయప్రవృత్తికి గావలసిన పరికరములు. అవి విజ్ఞానోపార్జనాసక్తులగు ప్రజలయు, ప్రజాక్షేమాభిలాషులగు శ్రీమంతులయు ధనసాహాయ్యమున సమకూరగలవు. ఇట్లు సర్వాంగ

* ఈసంచికయందు ప్రకటితమయిన 'గుంటూరుమండల గ్రంథాలయము'లను వ్యాసమును పరికింపదగును. అందు గ్రంథాలయములగూర్చిన వివరణము కొంత గలదు.

సంపన్నములయిన గ్రంథాలయములు చిరస్థాయులు కాగలవు!

---

## అభినవాంధ్రకవిపండితసభ

నవ్యవిధానము ఆంధ్రసరస్వతికతులు మార్చుకున్నతర్వాత నవీను లందఱూ కలిసి ఒక్కసారి పండుగు చేసికోలేదు ఇంతవఱకు. ఆలాటిది నిర్వర్తించడానికి ఎందఱికో కోరిక ఉంది. 'వీళ్ల నందఱినీ ఒక్కచోటికి చేరిస్తే — కోతులలాంటి వాళ్లు — దెబ్బలాడుకుంటారు. వాళ్ల నిలా వేరే ఉంచడమే మంచిది' అని ఒక కూటాధిపతి అయిన సారస్వతుని విరక్తి. కాని ఇట్టిభయమును గుఱించి అందఱూ తలచిఉండరు. అయినా ఆసంకల్పము సాగకపోవడానికి ఇంక కారణాలు లేవని యెవ రనుకుంటారు, మన దేశంలో?

ఈదశకము చాలా చిత్రమైన చరితము ముసుగులు తీసేట ట్టుంది—అసలు ప్రపంచానికే. మన తెలుగుభామకీ ఒకవికాససంఘటన చేపడుతుంది కాబోలు.

క్రొత్తవనముసహా మైకముగా నిల్చిన నేటి అవస్థలో 'అభినవాంధ్రకవిపండితసభ' కు గాను ఒక సాహసికమైన ఆహ్వానము వినవస్తూంది: బరంపురములో మార్చి ౧౧, ౧౨, ౧౩ తేదుల జరుగుతుంటట సభ. కిష్కింధా ప్రకృతికి భయనీరాజనము పెడుతూ బయలుదేఱ నక్కఱలేదు మనము—నిజముగా పనిచేయ దలచుకొన్నప్పుడు. కాని, దేశముకొఱను నిల్చి కొలదిలో సమావేశము సాధింపబూనడము తత్రత్యులకు పెద్ద పూనిక. దాని బరువుమాట యెటున్నా, విలువమాత్రము కొంచెపరచడానికి ఎవరికీ శక్యము కాదు.

నవ్యగతి పట్టిన ప్రతిచేయీ అక్కడ ఆహూతి పొందింది. రచనలు ప్రదర్శిస్తారట. వ్యాసాలు చదివిస్తారట.

"దేశమున చెదరియున్న అభినవాంధ్రకవికుమారులను, పండితులను, వారి సారస్వతరచనములను ఏకత్ర సమావేశపఱచి, అన్యోన్యపరిచయము కూర్చుట, వారి రచనముల జదివించి తదుత్కృష్టతను లోకమునకు వెల్లడిపఱచుట, దేశీయుల ఆదరాభిమానములను వారియెడల ప్రసరించునట్లు చేయుట, వారిగ్రంథములను దేశమున ప్రచారమునకు గొనివచ్చుట—అనునివి సభోద్దేశములు."

ఈసంగ్రహములో కావలసినంత పని ఊహింపవచ్చు.

ఈ 'ఏకత్రసమావేశము' చిరంజీవిగా చేసికోవచ్చు. ఆగునికులు కొన్ని సమితులుగా, సమాజాలుగా కూడి చక్కని నిర్వహణము చూపుతున్నారు. అందఱూ సమ్మతపడుతూ ఒక కేంద్రపరిషత్తు రచించుకోవచ్చు, తమసంస్థలకు భంగము లేకుండానే. అయితే అది సంస్థల సంస్థాత్వానికే గణనము ఈయ సమకట్టేది కాక, నికరమైన ప్రతిభావ్యక్తితో తన స్వత్వము లగ్నముచేసుకొనేది అవుగాక ఒక పాదాబ్దపత్రిక అను, ఒక వార్షిక సంచిక అను, ఒక వార్షికసమావేశ మను—అనేకవిధాల అది తన సంకల్పాలు వాస్తవపఱుచుకుంటుంది.

లేదా, ఆ మహదాశయాలకు మఱొక త్రోవ.

'ఆంధ్రమహాసభ' సారస్వతగోష్ఠి యేమీ జరుపుకోవడము లేదు. అక్కఱలేదని ఒకమతము కావచ్చు, కాని జరుపుకోవడము లేదు. 'ఆంధ్రసాహిత్య పరిషత్తు' ఆంధ్ర సాహిత్యగతుల జీవద్వ్యాపారమునుండి ఒక కోనకు మణిగిపోయింది ఈసభకు, ఒకకేంద్రపరిషత్తుకు, అవసరము, ఔచితి లే దని చెప్పవద్దు.

రాజధానీ, విశ్వకలాపరిషత్తూ లేక కుదించుకొని వ్యర్థపడిపోతూవచ్చిన ఆంధ్రప్రతిభకు విశ్వకలాపరిషత్తు సిద్ధించి చేయవలసిన మేలుకు ఇటుకూడా ఒక ముఖమున్నదని చాటవలసినది అడియాసచేత గాదు.

సారస్వతములైన ఫిర్యాదులు కావలసినన్ని; సంకల్పాలు కావలసినన్ని. అన్నిటికీ కల్పవృక్ష మొకటి ఉజ్జీవింప జేసుకొనేటందుకు పురుషుల సంకల్పము

తీండ్రిస్తే చాలు; తమతమ అంశలు, అస్త్రాలు హోమకుండములో విసరితే చాలు. అదియటు, మనవారిలో —ఆంధ్రులలో— ప్రత్యేకము చాలా తక్కువట. ఎంత ప్రసిద్ధి అనుకున్నారు మనది? అయితే ఈవశకము చాలా దివ్యార్థాలు సాధించేది అనుకున్నాము కాదూ? మనమే అనుకున్నదైనా సరే, సరిగా అనుకుంటే తప్పక జరుగుతుంది. (అనుకునేది మంచిది అనుకుంటూ ఉందాము.)

ఈసభవిషయమూ అంతే.

ఫూనినవారు ఇప్పటికి తెలుగువారి నిష్పాక్షికమైన, సహజమైన గౌరవమును పొందినవారు. గౌరవాస్పదులే కాక సమర్థులును అయిన వీరిఆహ్వానములో శుద్ధసంకల్పతయే చూచి, 'అభినవాంధ్రకవిపండితులు' పలికే బగులుపలుకు మనమూ మన ఇతిహాసములో అంకించుకోగల మార్గాలలో పడితే బాగుండును.

---

## చిత్రప్రదర్శనము, ౧౮-౧౯33, చెన్నపురి

చెన్నపురి లలితకళాసంఘము జరిపిన యీనలువదెనిమిదవ చిత్రప్రదర్శనమున వివిధ శాఖలకును, వివిధసంప్రదాయములకును చెందిన చిత్రములు నాలుగువందలు కలవు. వానిలో వర్ణాదిచిత్రములు 3౮౯; శిల్పచిత్రములు ౧౦; తక్కినవి అల్లికపనియందును, కుట్టుపనియందును గల కౌశలమును తెలుపునవి. అన్నివైఖరులచిత్రములలోను ఉత్తమములని, అందుకొరకు ఏర్పడిన కళాకుశలుల సంఘము నిర్ణయించిన చిత్రములకు బహుమతులు లభించినవి. కొన్ని ప్రశంసకుమాత్రము పాత్రములయినవి. యస్. ఆర్. సార్దేశాయిగారి చిత్రము ప్రదర్శనమున సర్వోత్తమముగా నిశ్చయింపబడినది. దీనికి గవర్నరుగారి సర్వోత్తమమగు బహుమతి నూరురూపాయలు కడచినది. ఇది తైలవర్ణచిత్రము కావున తైలవర్ణచిత్రములలో నుత్తమబహుమానము ఏబది రూపాయలును దీనికే కడచినది. సుద్దరంగుల చిత్రములలో, చెన్నపురి లలితకళాశాల విద్యార్థి యస్.వి. యస్. రామారావుగారు రచియించిన రూపచిత్రమును,* కర్రదిమ్మెపయి చెక్కి ముద్రించిన (Wood Cut) చిత్రములలో తేజోమూర్తుల కేశవరావు (చిత్రకారుడు, భారతిపత్రిక, చెన్నపురి) గారి పడవ చిత్రమును† ఉత్తమములుగ పరిగణింపబడి మొదటిబహుమతులకు పాత్రము లయినవి. మరియు యం. వి. నారాయణరావుగారి చిత్రములలో‡ రేఖాచిత్ర మొకటి, శిల్పచిత్ర మొకటి మొదటిబహుమతికి అర్హములయినవి. ప్రకృతి చిత్ర మొకటి ప్రశంసింపబడినది. గోపాలకృష్ణ గోఖలేగారి సుద్దరంగుల చిత్ర మొకటి ప్రశంసను గన్నది.§ వీ రిద్దరును

---

* వీరిచిత్ర మొక్కటే ప్రదర్శింపబడినది. సుద్దరంగుల చిత్రములు ప్రదర్శనమున ఏడుమాత్రము కలవు.

† వీరిచిత్రములు రెండు ప్రదర్శింపబడినవి. రెండును Wood Cut చిత్రములే. రెండవది 'బజారునకు' అనునది ప్రశంసింపబడినది. ఈ విధము లగు చిత్రములు ప్రదర్శనమున నయిదారుమాత్రము గలవు.

‡ వీరిచిత్రములు, అన్ని శాఖలకు చెందినవి పదొకండు ప్రదర్శింపబడినవి. వానియందు భారతీయ చిత్రకళావైఖరికి చెందిన నీటిరంగులచిత్ర మొకటిమాత్రమే యున్నది.

§ ఇతని చిత్రము, ప్రవర్శనమున నొక్కటియే కలదు.

చెన్నపురి లలితకళాశాల విద్యార్థులు. ఈచిత్రకారులు నలువురు నాంధ్రులు. వీరి కభినందనములు. బహుమతులలో నొకకొన్ని కళాభిమానులొసగునవి. తక్కినవన్నియు లలితకళాసంఘ మొసగునవి. ఏటేట నిట్లు చిత్రప్రదర్శనముల జరిపి చిత్రకళాభివృద్ధికి అవలంబనము నొసగుచు, చిత్రకారుల నాదరించుచు నున్న యీలలితకళాసంఘము, కళాభిమానులు నభినందనార్హులు.

ఈప్రదర్శనము కళాకుశలుని దృష్టికి సామాన్యముగ గోచరింపగలదు. చాలతక్కువగా నున్న సుప్రసిద్ధచిత్రకారుల చిత్రములు తప్ప తక్కినవన్నియు నించుమించుగ అనుకరణములు. రచనాకౌశల మొకింత యున్నచో భావుకత, భావుకత యొకింత గలదేని రచనాకౌశలము మృగ్యములగుచుండును. సంస్కారము చాలనియెడల చిత్రకారులు నిర్జీవానుకరణచిత్రములను సృష్టించుచుందురు.

చిత్రసంచయమున పాశ్చాత్యవైఖరి ననుసరించిన చిత్రము లధికముగ నున్నవి. నీటిరంగుల చిత్రములలో పాశ్చాత్యవైఖరి ననుసరించినవి ౧౬౩ గలవు. భారతీయవైఖరి ననుసరించినవి ౬౧ మాత్రమే కలవు. భారతీయ చిత్రవిధానము సులభసాధ్యము కాదు. భావన, సాహిత్యము, వైజ్ఞానికసంస్కారము, పరిశీలనము, కళాకౌశలము భారతీయచిత్రకళకు ప్రశస్తిని చేకూర్చును. ఇన్నిటిని సంపాదించుకొనుటకు ఓర్పు, నేర్పు కావలెను. సిద్ధహస్తుడగు చిత్రకారుడు తనచిత్రములయందు ప్రత్యక్షమగు కళాసౌందర్యమును, అప్రత్యక్షము, భావనాగమ్యము నగు నిగూఢతత్త్వమును నిండారజేయగలడు. సర్వలక్షణసంపన్న మగునట్టి చిత్రము కళావేత్తయగు ద్రష్ట కలౌకికానందమును సమకూర్పగలదు. పాశ్చాత్యచిత్రముల యందు ప్రత్యక్షవిషయములకుతప్ప అప్రత్యక్షవిషయములకు తావు తక్కువ. కావున తద్విధానము ననుగమించుటకు సంస్కారమెక్కువ పనిలేదు. మీదుమిక్కిలి రచనావిధానమునను సౌలభ్యము కలదు. ఇందుచేత చిత్రకారులు పాశ్చాత్య చిత్రకళావైఖరిని వెంటాడుచుందురు. ఈకాలమున ఎల్లవిషయములయందును అనుకరణమే శరణ్యమయినది. అనుకరణము అధమమార్గము.

ప్రదర్శింపబడిన ౧౬౩ పాశ్చాత్యవైఖరి చిత్రములలో ౧౮ చిత్రములుమాత్రమే అమ్ముడుపోవ, ౬౧ భారతీయవైఖరి చిత్రములలో ౧౮ అమ్ముడుపోయినవి. అమ్మకమునగల యీయంతరము భారతీయకళావైఖరి చిత్రముల సౌందర్యగౌరవములకు నిదర్శనము.

రాజధానినగరమున జరుగుచున్న యీ ప్రదర్శనమున ఆంధ్రదేశచిత్రకారుల చిత్రము లొకపదియేని లేకపోవుట ఆంధ్రదేశచిత్రకారుల గౌరవమునకు న్యూనత నాపాదించుచున్నది. ఆంధ్రచిత్రకారుల చిత్రములకేల యవకాశము లేకపోయెను? ఉన్న ఆకొన్ని

టిలో సి. బి. రావు (రాజమండ్రి)గారి 'పుష్కర స్నానఘట్టమున యాత్రికులు' అను తైలవర్ణ చిత్ర మొక్కటి గలదు. దానికి ఎనిమిదివేల రూపాయలు మూల్యము. చిత్రమునకును మూల్యమునకును గల సంబంధ మూహాతీత ముగ నున్నది.

ప్రకృతము ప్రదర్శనమున బహుమతు లను బడసిన చిత్రములకన్న ఆయాశాఖల యం దుత్తమ చిత్రములు కలవు. కాని బహూకరణయోగ్యచిత్రనిర్ణయము తదర్థము నియమితమయిన సంఘమునకు గల నిర్ణయావ కాశములను, దృక్పథమును బట్టి జరుగక తప్ప నది కాదు.

---

## చెన్నపురి సంగీతపరిషత్తు

చెన్నపురి సంగీతపరిషత్తువారి ౧౯౩౭ వార్షికనివేదిక చూడ, పరిషత్తు ఎట్టి అభివృద్ధి సాగుచున్నదియు వ్యక్తమగుచున్నది. ప్రసిద్ధులగు దాక్షిణాత్యులును ఆంధ్రులును పెక్కురు విద్వాంసులు, ప్రముఖులు నగువారు దీని నిర్వహణమున పలుతెఱగుల పాల్గొనుచు, సంగీతశాస్త్రమునకు మిక్కిలి ఒప్పిదమగు నట్టియు, వన్నెగూర్చునట్టియు సంస్థగ దీనిని నిల్పుచున్నారు.

వార్షికసమావేశమున పరిషత్సభ్యుల చర్చకు పాల్పడ్డవిషయములలో రాగస్వరూప నిర్ణయ మొకటి. ప్రాతనిర్ణయములకు కట్టు పడియేయుండక, వాడుకయందుగల రాగముల సంచారము ననుసరించి, అనుభవతః రాగ స్వరూపముల నూత్నముగ సంస్కరింపబూను చున్నదన, పరిషత్తు సంగీతకళాతత్త్వమున కంటె, మాధుర్యమునకు ప్రాధాన్య మిచ్చుచు తత్కళకు వికాసముచేకూర్చుచున్నదన్నమా ట. ఈగతిని క్రమముగ, ఇతరసంగీతపద్ధతులసార మును సహా స్వీకరింపసాగి, దాక్షిణాత్యసంగీత పద్ధతి శాస్త్రముగీతలలో నిఱికి కళగా వికసింప జాలకున్నదన్న సంకుచితత్వమును తొలగిం చుట పరిషత్తువారి కర్తవ్యము.

క్రిస్మస్ సమయమున తమ వార్షిక సమావేశసందర్భమున జరుపు ౧౨ సభలకును కలాభిమానుల కూరక ప్రవేశ మిచ్చియు, సీజన్‌టిక్కట్లు నేర్పఱచియు జనమునకు సంగీతమునం దాస్థ పెంపొందించిరి ఈపరిషత్తు వారు. వార్షికమహోత్సవమున చదివిన వ్యాసములు, కావించిన చర్చలు నటుండ, సాలుపొడవున పెక్కురుపండితులచే నుపన్యాసము లిప్పించి జనుల కందుబడి యిచ్చిరి. త్యాగ రాజాదికలాతపస్వుల జయంతులు నిర్వర్తించిరి. నగరమున జంత్రగాత్రాదులకు వేర్వేరుగ పోటీలు జరపి బహుమతు లిచ్చిరి. ఇట్లు ప్రజల నుత్సాహపఱుచుటయే కాక, వారికి శాస్త్రజ్ఞానము స్వాయముగ నందించుటకు 'The Teacher's College of Music' అనుపేర నొక కలాశాలను మంచి అధ్యాపకత్వమున నడపుచున్నారు. నగరమున పెక్కు స్థలములందు పాఠశాలలుకూడ నేర్పఱుప ప్రారంభములు చేసిరి. కొందఱకు ఊరక విద్య నేర్పుచున్నారు. ఇంకను చాలమందికి విద్యార్థి

వేతనము లిచ్చియు, మూల్యము లేక విద్య గఱపియు సంస్కారముగల పేదలకు విద్యాసంపద నందజేయుట ఈపరిషత్తు వికాసవీథిని తగులునని ఆశింపవచ్చును.

వీరి త్రైమాసికపత్రికయు ఉత్కృష్టము లగు వ్యాసములతో అలరారుచుండును. ఇది సకాలమున వెలువడ వీలుపడకుండుటకు గల కారణములలో, దీని ఉన్నతాభిరుచియు, సంగీతకలాజగత్తున వింతమార్పులు ఘటించు విప్లవశీలమును ఈపరిషత్తువారు లెక్కపెట్టినారు. ఇది సకాలమున వెలువడుచుండు నావశ్యకతను గుర్తించి, అట్లు వెలువడు భాగ్యము చేకూరెనేని దీని ఈఆశయములు లోకమున పాదుకొనినవని సంతసింప లోకులు సిద్ధముగ నుందురు.

ఇది పెక్కువిధముల ఆదర్శప్రాయమగు సంస్థగ నున్నదని చెప్పవచ్చును. ఔత్తరాహ సంగీతపద్ధతితో మనవారికి తగినంత సంపర్కము గలుగజేయుచు, సంగీతము శాస్త్రత్వమును దాని కలాత్వమునకు సార్థకముగ వినియోగపడుచు పూనికకై ఈపరిషత్తుశక్తు లింకనెక్కువగ వినియోగపడుట ముఖ్యముగ ఆంధ్రుల వాంఛలలోనో, ఆశలలోనో ఒకటి.

---

## శ్రీకృష్ణదేవరాయ విద్యాపరిషద్వార్షికోత్సవము-రాయలసీమ

చరిత్రాంకితములయిన ఆంధ్రసామ్రాజ్యములకు విజయనగరసామ్రాజ్యము, తదధిపతులకు శ్రీ కృష్ణదేవరాయలు తలమానికములు. శ్రీకృష్ణదేవరాయలు సార్వభౌముడయి ఆంధ్రదేశమునకు సమకూర్చిన సకల సంపదల, నిండుదనమును చరిత్రము, సాహిత్యము, శిల్పము, శాసనములు చాటుచున్నవి. ఆసామ్రాజ్య మెన్నడో అంతరించినది; ఆ సార్వభౌముడును కాలగర్భమున గలసి పోయినాడు. తత్కీర్తిచంద్రికలు మాత్రము ఆంధ్రదేశ ముండునంతకాలము స్థిరముగ నుండగలవు. ఆ మహాపురుషునినామ మాంధ్రులకు నిత్యస్మరణమనన యోగ్యము; ఆయనపవిత్ర చరిత్ర ప్రవర్తనములు సమాదరణ సమాచరణార్హములు.

'శ్రీ కృష్ణదేవరాయ విద్యాపరిషత్తు' పెనుగొండయందు 'కేవలము విద్యాసంస్థగా' ౧౯౩౦-వ సంవత్సరమున జన్మించినది. పశ్చిమాంధ్రు లీపరిషత్తును స్థాపించి సకలాంధ్ర లోకమునకును గౌరవమును దెచ్చిరి. ఈపరిషద్వార్షికోత్సవము (నాలవదికాబోలు) ఈ మారు అనంతపురమున జరిగినది. దీని కనుబంధముగా వ్యవసాయాది పరిశ్రమలప్రదర్శనమును జరిగినది. జన్మించినదాదిగా నీపరిషత్తు విద్యావిషయములయందే ప్రవృత్తి కలిగియుండినది. 'గుత్తివద్దనున్న అశోకునిశాసనముల ప్రతులనెత్తి, వానిని చదువుట, ఇతరశిలాశాసనములనెత్తి పరిశోధించుటవిజయనగరరాజులు, నొలంబులు మొదలగువారి తామ్రశాసనములను సంపాదించి, చదివి, ప్రకటించుట. ఈ

మొదలయినవి...చారిత్రకకృషి. పల్లెలలోతిరిగి ప్రాతతాటియాకు పుస్తకములు ౧౫౦౦ సేకరింపబడినవి. వీనిలో కొన్ని అపూర్వగ్రంథములుకలవు. పరిషత్తునకు తగినంతధనము చేరినంతనే ఈపుస్తకములప్రకటన కార్యమును చేపట్టగలదు. సారస్వతోపన్యాసములు, గాథాసప్తశతీసారము, వదరుబోతు అను గ్రంథములు ప్రకటితములు.' ఈగ్రంథములు ప్రశస్తములు. ఇదియంతయు పశ్చిమాంధ్రులయందు పెంపొందుచున్న విజ్ఞానసంపదకు నిదర్శనము. వీరికార్యకౌశలము మిగుల ప్రశంసింపదగినది.

పరిషత్తు 'కేవలము విద్యాసంస్థ' యని పేర్కొనిన ఆహ్వానసంఘాధ్యక్షులు తమ యుపన్యాసమున విద్యాసంస్థకు సంబంధించని విషయములను గూర్చిన ప్రసంగమునకే ఎక్కువ అవకాశము నిచ్చినారు. అది కేవలమప్రస్తుతము; అప్రశస్తము. తద్విషయ గత ప్రసంగము స్థలకాలాంతరాపేక్షము.

కృష్ణదేవరాయ లాంధ్రులెల్లరకు నారాధ్యుడు. తన్మహోత్సవకాలమున నెల్లర హృదయములు నేకముఖముగ తదధీనములుగ నుండవలయును. అట్టులయిననే యిట్టిమహోత్సవములు కొంతయైన ఫలవంతములు కాగలవు.

ఈ మహోత్సవముఁ ప్రశస్తముగ నిర్వహించినపరిషత్తునకు ధన్యవాదములు. మహోత్సవమునకు విషయమయిన మహాపురుషుడు, శ్రీకృష్ణదేవరాయలను ఆదర్శముగాగొని ఆంధ్రులెల్లరు తమ్మును, తమదేశమును నూతనతేజోవిరాజితము కావించుకొనదగుదురు; ఈపరిషత్తు చిరస్థాయియై ఇతోధిక ప్రయోజనకారి యగుటకును తోడ్పడదగుదురు.



తిరువమ్మినయూరు శిథిలములు ఛాయాచిత్రకారుడు: సి. జి. జగన్నాథదాసుగారు.

"జవసత్వములుగలజాతి వహింపవలసిన బాధ్యతలను రోమనులు యేనాడు 'మనకేల యీగోల' అని వదలిరో ఆనాడే రోమసామ్రాజ్యము శిథిలమైనది."

"శక్తిసామర్థ్యతల కొరకు సాముదాయిక గాంభీర్యతను, అధికారమును, ప్రబలపరిమాణము నియ్యగల నైతిక శారీరకసంబంధమగు విలువలను నిర్లక్ష్యముగచూచు జాతులు ముందుతరములవారికి ప్రత్యేక ప్రసిద్ధ గౌరవాదర్శములను చిహ్నములుగ నెలకొల్పజాలవు."

—ఇటలీదేశపు సర్వాధికారి బెనిటో ముస్సోలినీ.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M129 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 180 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 85 ,5, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినవది | Navya |
| పేజీలు విడదీసినవది | Bhanu |
| స్కాన్ చేసినవది | S. Jayalakshmi |
| పరీక్ష చేసినవది | RUKSANA |
| పేజీలు సరిచూసినవది | |
| బైండింగు చేసినవది | |
| ప్యాకింగు చేసినవది | |
| పరిస్థితి | [illegible] |